The Largest Circulated Telugu Monthly

# చతుర

ఫిబ్రవరి 1994 * రూ. 5/-



పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి

## కృష్ణాతరంగాలు

# ఆరోగ్యం ఆనందం మెడినోవా!



సూర్యోదయం-చంద్రోదయం, ఉచ్ఛ్వాస-నిశ్వాస, అతడు-ఆమె,
ఆనందం-ఆరోగ్యం, పరస్పర ఆశ్రయాలు. జీవితాన్ని పరిపూర్ణంచేసే ప్రధానమైన అంశాలు.

ఎవరికోసమైతే మీరు నిరంతరం శ్రమిస్తారో, కలలు కంటారో వారి జీవనవనంలో వేయి పూలు వికసించి, పరిమళించాలని ఆశించడంలో ఆశ్చర్యమేముంది! ఆరోగ్యమే మహాభాగ్యమని పెద్దలు చెప్పిన సూక్తి మీ కలల పంటలను గురించి ఆలోచించినప్పుడల్లా గుర్తుకురావడం సహజమే. ఆ వెంటనే మీకు 'మెడినోవా' పేరు స్ఫురించడం అంతకంటే సహజం!

అంతర్జాతీయ ప్రమాణాలు సాధించడంలో అనితరసాధ్యమైన స్థాయిని అందుకున్న వైద్యపరీక్షల, నిర్ధారణల సంస్థ మెడినోవా. అత్యంత ఆధునికమైన, అత్యున్నతమైన రోగనిర్ధారణ విధానాలను మనదేశంలో ప్రవేశపెట్టిన మొట్టమొదటి సంస్థ మెడినోవాయే. మెడినోవా మీకోసం రూపొందించిన అద్భుతమైన ఆరోగ్యపథకమే 'మెడినోవా మాస్టర్ హెల్త్‌చెకప్'.

సమగ్రమైన హెమటొలాజికల్, పాథలాజికల్, బయోకెమికల్ మరియు ఇ.సి.జి. Xరే, అల్ట్రాసౌండ్ స్కాన్‌పరీక్షలు మీ ఆరోగ్యస్థితికి అద్దంపడతాయి. పైగా మీకు ఎంతో గుండెనిబ్బరం కలుగుతుంది. ఈ ప్రక్రియ అతి సులభం. మీకు యెంతో సౌలభ్యం కూడా. మెడినోవా మీకోసం - మీ పరివారంకోసం.




ఇతర వివరములకు సంప్రదించండి

**మెడినోవా**
డయాగ్నస్టిక్ సర్వీసెస్ లిమిటెడ్

6–3–652, కౌటిల్య, సోమాజిగూడ,
హైద్రాబాద్-500 482.
ఫోన్: 211122/211133/211252.

మెడినోవా మీకోసం, మీ పరివారంకోసం

## పిల్లలు పుట్టని దంపతుల్లారా! విసిగి వేసారి పోయారా?!
## మీకొక ఆశాకిరణం! డా॥ రమా సంతాన సాఫల్య కేంద్రం!

సంతానం కలుగకపోవడానికి కారణాలు అనెకం. డా. రమాదెవిగారు వాటిని దేశ, విదేశాల్లో అధ్యయనం చేశారు. పరిశోధనలు జరిపారు. సంతాన సాఫల్య కేంద్రాన్ని స్థాపించారు. ఇక్కడ అత్యాధునిక ఎలక్ట్రానిక్, డిజిటల్, కంప్యూటర్ పద్ధతుల ద్వారా సంతానం కలుగకపోవడానికి గల కారణాలను శాస్త్రియంగా విశ్లేషిస్తున్నారు.

జపాన్, అమెరికా, జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లండ్, స్విట్జర్లాండ్, నెదర్లాండ్స్, డెన్మార్క్, సింగపూర్ మొదలగు దేశాలనుండి అనేక ప్రత్యేక పరికరాలను తెప్పించి ఇక్కడ ఏర్పాటు చేస్తున్నారు. భారతదేశంలో IVF–ET, GIFT, ZIFT, Vaginal Culture–ET (టెస్ట్‌ట్యూబ్ బేబీకై వివిధ పద్ధతులు)తో సహా సంతాన సాఫల్యతకై అన్ని శాస్త్రీయ పద్ధతులను ఒకేచోట ఏర్పాటు చేస్తున్న ఏకైక సూపర్ స్పెషాలిటీ కేంద్రం.

రెండేళ్ల దాంపత్యజీవితం తరువాత కూడా పిల్లలు పుట్టని దంపతులు వెంటనే ఈ కేంద్రానికి వస్తే సంతానం కలిగే అవకాశం అధికం.

ఈ కేంద్రానికి మొదటిసారి వచ్చే దంపతులు రుతుక్రమం మొదలైన 13వరోజున రావాలి. వచ్చేముందు 3-4 రోజులు దంపతులు శారీరక సంపర్కం జరుపకూడదు. ఇక్కడ సంప్రదింపులకు పరీక్షలకు ఓ మూడురోజులు హాస్పిటల్‌లోనో, బయటనోఉండడానికి వీలుగా రావాలి.

**ఇప్పటికే వందలాది దంపతులకు సంతానప్రాప్తి కలిగింది. మీరూ రండి!**
**సంతానప్రాప్తికై శాస్త్రీయ యత్నానికి!**

**ఆంధ్రప్రదేశ్‌లో అన్ని సౌకర్యాలతో ఏర్పాటు చేయబడుతున్న ప్రప్రథమ IVF–ET (టెస్ట్ ట్యూబ్ బేబీ) కేంద్రం!!**

మా పెళ్ళయి 12 ఏళ్లు గడిచినా, ఎంతోమంది వైద్యులను కలిసి ఎన్నో పరీక్షలు, వైద్యాలు చేయించుకున్నా సంతానం కలగలేదు. తిరిగితిరిగి విసిగి వేసారిన మేం 1992 ఏప్రిల్‌లో డా. రమా సంతాన సాఫల్య కేంద్రంలో రిజిష్టరు చేయించుకున్నాం. ఆదరంతో, ఆప్యాయంతో మా బాధని అర్థం చేసుకుని, మా సమస్యని



అవగాహనచేసుకుని శాస్త్రీయ పద్ధతులతో శ్రద్ధగా వైద్యంచేశారు. మా ఆశలూ... కలలూ ఒక్కసారిగా పండాయి. 1993 ఏప్రిల్ 10న రత్నాల్లాంటి పాప, బాబులని ఒకే కాన్పులో పొందాం. మా ఆనందానికి అంతులేదు. డా. రమాగారి రుణం తీరనిది. వారి కృషి కొనసాగాలి. మాలాగే మరెంతమందో సంతాన సౌభాగ్యాన్ని పొందాలి.



**డా॥ పాపోలు రమాదేవి**

M.B.B.S.,D.G.O.,M.D.,(O&G)
M.A.M.S. (Vienna)




## డా. రమా సంతాన సాఫల్య కేంద్రం
## Dr. Rama's Centre for Fertility

ఓం జ్యూయలర్స్ బిల్డింగ్, గోల్డ్‌స్పాట్ కంపెనీ ఎదురుగా,
అమీర్‌పేట్ బస్‌స్టాప్, హైదరాబాదు-500 016.
ఫోన్లు: 211255, 212294

**FACILITIES AVAILABLE (For Information of Medical Professionals)**

1. Co–ordinated action between GYNAECOLOGIST, ANDROLOGIST, ENDOCRINOLOGIST, PSYCHOLOGIST and other specialists. 2. All investigations HAEMATOLOGY, HORMONAL STUDIES, HISTOSALPINGOGRAPHY, ANTIGEN, ANTI BODY TESTS, CHROMOSOMAL ANALYSIS, HYSTO–PATHOLOGY. 3. TRANS–VAGINAL SONOGRAPHY for OVULATION studies, OVUM pick–up, Functional ovarian Cyst Aspiration, Intra–peritonial insemination. 4. BIOPSY of Ovaries 5. Double puncture diagnostic and operative LAPAROSCOPY 6. Micro surgery for TUBES, VAS etc. Under operative Microscope 7. Operative procedures; Myomectomy, Repair of Congential anamolies etc. 8. HYSTEROSCOPY for Diagnosis of the intra–Uterine Pathology 9. Artificial Insemination after swim–up technique (Sperm of Spouse/Donor)

I V F LAB FOR: 1. In–Vitro Fertilization - Embryo. Transfer. 2. Gamete Intra– Fallopian Transfer. 3. Zygote Intra–Fallopian Transfer. 4. Vaginal Culture and Embryo Transfer. ( To be inaugurated shortly. )

# వైద్యరంగాన్ని కార్పొరేట్

మనిషి అన్నాక రోగాలు, నొప్పులు తప్పనిసరి. ఎంతటివారైనా ఏదో ఒక సందర్భంలో వీటిబారిన పడుతూ ఇబ్బందులపాలవడం సహజమే. అసలే అంతటా ఆవహించిన కాలుష్యం పంచనపడి ఉండటంవల్లనో, ప్రతి పదార్థంలో చోటుచేసుకుంటున్న కల్తీ తిండివల్లనో ఊహించని వ్యాధులకు గురికావాల్సి వస్తోంది. ఇంతకుముందు ఎప్పుడూ వినని రకరకాల కొత్తవ్యాధులు పుట్టుకొస్తున్నాయి. వీటి నివారణకు ఎవరిస్థాయినిబట్టి వారు అందుబాటులో ఉన్న వైద్యనిపుణుల్ని సంప్రదిస్తూ చికిత్సలు చేయించుకుంటున్నారు. ప్రస్తుతం వైద్యచికిత్సలకు ఆస్పత్రులకు వెళ్ళనివారు వెయ్యికి ఒకరు కూడా ఉండరనే చెప్పాలి.

వైద్యవిజ్ఞానం దినదిన ప్రవర్థమానమవుతూ అత్యంత క్లిష్టమైన జబ్బులను కూడా నయంచేయగలిగే రీతిలో అపూర్వమైన వైద్య, శస్త్రచికిత్సలతో మానవాళి మనుగడకు మహోపకారం చేస్తున్నారు వైద్యనిపుణులు. ఈనాటి వైద్యం వ్యాపారపోకడల్లో సాగుతోందనే విమర్శలను అలా ఉంచి ఆలోచిస్తే జన్మతః శరీరభాగాల్లో ప్రధానమైనదిగా పేర్కొనదగిన గుండెను కూడా మార్చి గుండెను అమర్చగల స్థాయికెదిగిన వైద్యవిజ్ఞాన శాస్త్ర అభివృద్ధిని అభి



# విస్తృతపరుస్తున్న ఆస్పత్రులు

నందించకుండా ఉండలేం. ప్రస్తుతం ఓ స్థాయి కలిగిన పట్టణ ప్రాంతాల్లో కూడా మంచి మంచి ఆస్పత్రులు వెలుస్తున్నాయి. మానవాళిని పట్టి పీడిస్తున్న అనేకానేక రుగ్మతల్ని వదిలించుకోవడానికి ఇవి అహర్నిశలు పోరాడుతున్నాయి.

పెద్దపెద్ద నగరాల్లో అయితే ఎన్ని క్లినిక్‌లు, డిస్పెన్సరీలున్నా రోగులకు కొదవ ఉండటంలేదు. గ్రామాలు, పట్టణాల్లోని ఆస్పత్రుల్లో ఉన్న డాక్టరే అన్ని వ్యాధులనూ పరీక్షించి మందిస్తాడు. నగరాల్లో అలాకాదు, కంటినిపుణుడు, తుంటినిపుణుడు, పంటినిపుణుడు అంటూ ఆయా విభాగాలకే ప్రాధాన్యతనిస్తూ వైద్యనిపుణులు ఉంటారు. మన అవసరాన్నిబట్టి ఆయా నిపుణులవద్దకే వెళ్ళి వైద్యం చేయించుకోవాల్సి ఉంటుంది ఉదాహరణకు ఒక వ్యక్తికి కళ్ళు, పళ్ళు రెంటికి సంబంధించిన వ్యాధులు సోకితే అటు కంటి స్పెషలిస్టు దగ్గరికి వెళ్ళి కళ్ళను, ఇటు డెంటిస్టు వద్దకు వెళ్ళి పళ్ళను చూపించుకోవాల్సి ఉంటుంది. కొన్ని ఆస్పత్రుల్లో ఎక్స్‌రే యూనిట్లు, ప్రత్యేక పరిశీలనకై ల్యాబ్‌లు లేకపోతే ఆయా పరీక్షలనిమిత్తం మరోచోటికి వెళ్ళాల్సి వుంటుంది. ఇదంతా రోగికి, అతని బంధువర్గా



నికి తలనొప్పితో కూడిన వ్యవహారంగా ఉంటుంది. ఈ సమస్యలను, అవసరాలను దృష్టిలో ఉంచుకొని సూపర్ స్పెషాలిటి ఆస్ప త్రులు వెలిశాయి. ఈ ఆస్పత్రుల్లో అన్నిరకాల స్పెషలిస్టులు సేవలతోపాటు ల్యాబ్స్, అత్యాధు నిక వైద్యపరికరాలతో కూడిన సౌకర్యాలు ఒకే చోట లభిస్తున్నాయి.

ఎలాంటి రోగాన్నైనా నయంచేసే వైద్యసదు పాయాలతోపాటు ఆహ్లాదకరమైన వాతావ రణం, రోగి అతని సంబంధీకులు ఉండటాని కి కావాల్సిన వసతి సదుపాయాలు, ఏక్షణంలో ఏ అవసరం వచ్చినా కంటికి రెప్పలా ఇరవైనా లుగు గంటలూ చూసుకునే సిబ్బంది ఈ సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రుల ప్రత్యేకత. ఈ ఆస్పత్రుల్లో చికిత్స పొందడం ఖరీదైన వ్యవహా రమే అయినప్పటికీ ఇవి అందించే సేవల్ని కూడా అంత తేలికగా తీసిపారేయలేం.

నవీన సాంకేతిక వైద్యపరికరాలు, నిపుణు లైన ఉన్నతస్థాయి వైద్యుల పర్యవేక్షణ, విన యవిధేయతలతో శుశ్రూషలు చేసే సిబ్బంది ఈ సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులకు ఉన్నత విలువల్ని సమకూర్చిపెట్టాయి. అందుకే కొందరు వ్యంగ్యంగా 'ఇవి ఆస్పత్రులా? లేక స్టార్ హొటళ్ళా?' అనటం కద్దు. అత్యాధునిక వైద్యసాధనా సంపత్తితో కూడిన అపోలో ఆస్ప త్రి, అపోలో డయాగ్నస్టిక్ సెంటర్, మెడ్విన్ హాస్పటల్, సి.డి.ఆర్.వంటి సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులను వీటిలో ముఖ్యమైనవిగా పేర్కొన వచ్చు. శరీరంలోని అంగఅంగాన్ని పరీక్షించి చికిత్సలు జరిపే సమస్త విభాగాలు ఈ ఆస్ప త్రుల్లో ప్రత్యేకంగా ఉన్నాయి.

సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులుగా పేర్కొన దగిన ఆస్పత్రులన్నింటిలో ఆంధ్రాలజి, అనస్తీ షియాలజి, బ్లడ్‌బ్యాంక్, బయోకెమిస్ట్రి, కార్డి యాలజి, కార్డియోథొరాసిక్, చెస్ట్ డిసీజెస్, క్లినికల్ పాథాలజి, కాస్మొటిక్ సర్జరి, సైటాలజీ, డెంటిస్ట్రీ, డెర్మటాలజి, డయాబిటాలజి, డ్రగ్ అండ్ అడిక్షన్, ఇ.ఎన్.టి. ఎండోక్రినాలజి, గాస్ట్రో ఎంటరాలజి, పీడియాట్రిక్స్, గైనకాలజి, హిస్టోపెథాలజి, ఇమ్యునాలజి, ఇండస్ట్రియల్ మెడిసన్, మైక్రో సర్జరి, మైక్రో బయాలజి, నియోనెటాలజీ·న్యూరాలజి, న్యూక్లియర్ మెడి సన్, నెఫ్రాలజి, ఫిజియోథెరపి, వాస్క్యులర్ సర్జరి... ఒకటేమిటి అన్ని విభాగాలకు చెందిన



# యస్. కె. కంటి హాస్పటల్

అంతర్జాతీయ స్థాయిలో లేటెస్ట్ కంటి చికిత్స చేయుచున్న కేంద్రం

**EQUIPPED WITH LATEST INSTRUMENTS AND MODERN TECHNOLOGY**

29-13-87, కాళేశ్వరరావు రోడ్డు, సూర్యారావుపేట, విజయవాడ-2 ఫోన్: 77791

## కంటి చికిత్సకు ఆధునిక సౌకర్యాలు

- మైనస్ పవర్ తగ్గించు రేడియల్ కెరటాటమీ ఆపరేషన్ సంవత్సరము పొడవునా కోస్తా ఆంధ్రాలో ఈ ఆపరేషన్ చేయుచున్న ఏకైక కంటి హాస్పటల్
- ఆధునిక పద్ధతిలో కంటి శుక్లము ఆపరేషన్ మరియు అమెరికాలో తయారైన ఇంటాక్యులర్ లెన్స్ అమర్చుట.
- అమెరికా సహకారంతో తయారుచేసిన సాఫ్ట్ కాంటాక్ట్ లెన్సులు అమర్చుట
- మెల్లకన్ను సరిచేయు సెంటర్
- నీటిశుక్లాల (గ్లాకోమా) పరీక్షలకు, ఆపరేషనుకు లేటెస్ట్ పరికరాలతో ట్రీట్‌మెంటు
- చిన్న పిల్లలకు ప్రత్యేక కంటిచికిత్స
- అత్యున్నత సైంటిఫిక్ పద్ధతులలో కంటి అద్దాలకు రిఫ్రాక్షన్ సెంటర్
- తలనొప్పికి కంటి సంబంధమైన ప్రత్యేక పరీక్షలు
- షుగరు, రక్తపోటు ఉన్నవారికి ప్రత్యేక కంటిపరీక్ష మరియు చికిత్స
- కంటినరము పొరలు రెటీనల్ డిటాచ్‌మెంట్ అతికించు ఆపరేషన్
- కంటికి సంబంధించిన ప్లాస్టిక్ సర్జరీలు
- కంటి గాయాలకు ప్రత్యేక చికిత్స
- కంటినరము, మెదడుకు సంబంధించిన పరీక్షలు
- క్లిష్టమైన కంటిజబ్బుల నిర్ధారణకు మరియు కంటి లోపల అమర్చు ఇంట్రాక్యులర్ లెన్సుపవర్‌కు అల్ట్రా సౌండ్ 'A' స్కాన్ నిర్ధారణ.
- అన్నిరకాల కంటి ఆపరేషన్లకు మైక్రోసర్జరీ సౌకర్యము
- ఎయిర్ కండిషన్డ్ మరియు అత్యాధునిక వసతులు గల ఆపరేషన్ థియేటర్
- కరంటు అంతరాయం లేకుండా జనరేటర్ సౌకర్యము
- విజయవాడ నగరంలో సెంటర్ లొకేషన్‌లో వున్న ఒక పెద్ద కంటి హాస్పటల్
- ఫుల్‌టైమ్ డాక్టరు మరియు నర్సింగ్ స్టాఫ్ సౌకర్యము.

## అత్యాధునిక పరికరాలు

- కంప్యూటరైజ్డ్ అల్ట్రాసౌండ్ ఏ స్కాన్ (అమెరికా) కంటిలోపల అమర్చు అద్దము పవరు తెలుసుకొనుటకు
- డైమండ్ నైఫ్ (మైనస్ పవరు ఆపరేషన్ చేయుటకు)
- అప్లనేషన్ ట్యానోమీటరు -గ్లాకోమా నిర్ధారణకు
- నికాన్ ఆపరేటింగ్ మైక్రోస్కోప్ (జపాన్) -మైక్రోసర్జరీ ఆపరేషనులకు
- మెంటర్ ఇన్‌డైరెక్టు ఆఫ్తాల్మోస్కోప్ (అమెరికా) కంటి రెటీనా ఆపరేషన్లకు మరియు పరీక్షకు
- త్రిమిర్రర్ గోనియో స్కోప్ (అమెరికా) కంటి లోపలి భాగాన్నంతా విశదంగా పరిశీలించుటకు
- పెంటాక్స్ లెన్సోమీటర్ (జపాన్) -కళ్లద్దాలు కరక్ట్ పవరు ఉన్నాయో లేదో తెలుసుకొనుటకు
- స్లిట్‌లాంప్ బయో మైక్రోస్కోప్ కంటి అన్ని భాగాలను వివిధ కోణాలలో మాగ్నిపై చేసి పరిశీలించుటకు
- కెరటోమీటర్ -కంటి కార్నియాపవరు తెలుసుకొనుటకు మరియు కాంటాక్టు లెన్సుల సైజుకొరకు
- బైపోలార్ వెట్‌ఫీల్డ్‌కో ఆగులేటరు -ఆపరేషన్‌ల రక్తనాళాలను రక్తము రాకుండా చేయుటకు
- ప్రిజంబార్స్ -మెల్లకన్ను ఎంతున్నదో ఖచ్చితంగా తెలుసుకొనుటకు
- క్రయో ఆపరేటస్ -శుక్లము ఆపరేషన్‌కు, రెటీనా ఆపరేషన్‌లకు
- విట్రియాక్ట్ మిషన్ -కంటిలో చెడు రక్తమును తీసివేయుటకు
- గ్లూకోమీటరు -రక్తములో షుగర్ లెవల్ గురించి ఒక నిముషంలోనే తెలుసుకొనుటకు
- ఇంటర్ ఆక్యులర్ మాగ్నెట్ -కంటి లోపల పడిన నలకను తీయుటకు
- ఎక్కువసేపు నిరీక్షణ లేకుండా వీలైనంత త్వరగా పేషంట్లకు పరీక్షలు మరియు చికిత్సలు
- ఉదయం గం. 8-00 నుండి రాత్రి గం. 8-00ల వరకు న్యూకేసెస్‌కు డైరెక్టుగా చూపించుకొనవచ్చును.

(ఆదివారం గం. 8 నుండి గం. 2వ.)

**Dr. B. SUBBA RAO** M.D. Ophth AIIMS

Ex. Senior Residential Eye Surgeon & Registar at AIIMS New Delhi and **Trained in Japan**

BACHI ★

వైద్యపరీక్షలు, శస్త్రచికిత్సలూ వున్నాయి. అత్యాధునిక వైద్యసేవలందించడంలో ఇవి ముందుంటున్నాయి.

ఈ సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులు సాధారణ శరీర పరీక్ష మొదలుకొని అత్యాధునిక వైద్యపరీక్షలు, శస్త్రచికిత్సలు జరిపే అసాధారణ సాధనా సంపత్తిని కలిగి ఉన్నాయి.

శస్త్రచికిత్స చేయాల్సిన శరీర భాగాన్ని కోసి తెరవనవసరం లేకుండానే జనరల్ సర్జరీ, థోరాసిక్ సర్జరి, గైనకాలజి, గ్యాస్ట్రో ఎంటరాలజి, యూరాలజి రంగాలలో కీహోల్ సర్జరీ విధానంలో శస్త్రచికిత్సలు చేసే సదుపాయం కూడా పైన పేర్కొన్న సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రుల్లో ఉంది. ఉదాహరణకు గ్యాస్ట్రో ఎంటరాలజి శస్త్రచికిత్స చేయాల్సివస్తే ఈ లాప్రొస్కోపిక్ (కీహోల్) విధానం ప్రకారం కడుపుపై అవసరాన్నిబట్టి రెండుమూడు రంధ్రాలు చేసి లాప్రొస్కోప్‌ను శరీరంలోకి ప్రవేశపెడతారు. వైద్యుడు పరీక్షించాలనుకున్న భాగం ఈ లాప్రొస్కోప్‌ద్వారా వీడియో మానిటర్‌పై ప్రత్యక్షమౌతుంది. దీనిని చూస్తూ ఆ తర్వాత శస్త్రచికిత్స చేస్తారు.

ఈ తరహా శస్త్ర చికిత్సల కోసం రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచే కాకుండా దేశంలోని ఇతర నగరాలనుంచి కూడా రోగులు హైదరాబాద్ రావడం మన సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులపై పెరుగుతున్న నమ్మకానికి చిహ్నంగా పేర్కొనవచ్చు. అపోలో, మెడ్విన్, సి.డి.ఆర్. వంటి ఆస్పత్రులు హృద్రోగం, మూత్రపిండాలు, మెదడు, వెన్నుపూస, ఉదరకోశ సంబంధ వ్యాధుల చికిత్సలో అత్యాధునిక సాంకేతిక పద్ధతుల్నీ యంత్ర పరికరాల్నీ ఉపయోగించి సత్ఫలితాలు రాబడుతున్నాయి. హృద్రోగ శస్త్ర చికిత్సలు నవీన పద్ధతుల్లో నిర్వహించే క్యాథ్ లాబ్‌లు, క్యాన్సర్ వంటి వ్యాధులను గుర్తించే అల్ట్రా సౌండ్ యంత్ర పరికరాలు, రక్తనాళాల పనితీరును పరీక్షించే అంజియోగ్రఫీ సదుపాయాలు అన్ని చోట్లా ఉన్నాయి. మూత్రపిండాల్లో రాళ్లను నిర్మూలించేందుకు సునిశిత పద్ధతులైన ఆధునిక లిథోట్రిప్సీ యంత్ర పరికరంతో నిర్వహిస్తుండగా సరళమైన పద్ధతిలో రోగికి వేదన లేకుండా వీడియో లాప్రొస్కోపిక్, ఉదరకోశ వ్యాధుల కోసం గ్యాస్ట్రోస్కోప్‌లను వినియోగిస్తూ అరుదైన రీతిలో శస్త్ర చికిత్సలు

జరుపుతున్నారు. క్యాన్సర్ వ్యాధిని నిర్ధారించే నిమిత్తం గామా కెమెరా, మెమోగ్రఫీ, సి.టి.స్కాన్ పద్ధతులున్నాయి. ఒక్కో సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రి ఒక్కో ప్రత్యేకతను సంతరించుకుని అత్యాధునిక వైద్య సదుపాయాలను సమకూరుస్తోంది.

హృద్రోగం, గుండె, నాడీ సంబంధమైన వ్యాధులకు సంబంధించి చేస్తున్న శస్త్ర చికిత్సల్లో అపోలో ఆస్పత్రి నూటికి తొంభై తొమ్మిది శాతం విజయాలు సాధిస్తోంది. కంటి జబ్బుల విషయంలో అద్దాలు అవసరం లేకుండా ఆధునిక పద్ధతుల్లో నివారణ చేయగలుగుతున్నారు. వినూత్న వైద్య ప్రక్రియల ద్వారా ఊహించని రీతిలో సోకుతున్న జబ్బులను నయం చేయగలుగుతున్నారు.

సి.డి.ఆర్. ఆస్పత్రిలో ఇతర వ్యాధులకు సంబంధించిన వైద్య సదుపాయలతోపాటు సంతానం లేక కృంగిపోతున్న వారికి విట్రో ఫెర్టిలైజేషన్ వంటి అధునాతన వైద్య పద్ధతుల్లో సంతానం పొందే సదుపాయాన్ని సమకూరుస్తున్నారు. రాష్ట్రంలోనే ప్రప్రథమంగా ఏ సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రిలో లేని విధంగా ఈ సదుపాయాన్ని సి.డి.ఆర్‌లో ఏర్పాటు చేశారు. ఈ రకమైన వైద్య సదుపాయంవల్ల ఇప్పటికే ఇరవై మందికి పైగా దంపతులను తల్లిదండ్రుల్ని చేయగలిగారు. క్యాన్సర్ వ్యాధి సోకిన వారిని తిరిగి సాధారణ మనుషులుగా తయారు చేయగల సామర్థ్యం కలిగిన హైపర్ థెర్మియాను ప్రప్రథమంగా సి.డి.ఆర్. ప్రవేశపెట్టగలిగింది. అదేవిధంగా అత్యాధునికమైన మాగ్నటిక్ రిసోనెన్స్ ఇమేజింగ్ (ఎం.ఆర్.ఐ) యంత్ర పరికరం ద్వారా ఆధునిక వైద్య రంగంలో మరో అడుగు ముందుకు వెయ్యగలిగింది. దీని ద్వారా రోగ నిర్ధారణ చేసి వైద్య సేవల్ని మరింత చేరువ చేసింది.











మెడ్విన్ హాస్పిటల్‌లో అన్ని రోగాలకు సంబంధించిన ఆధునిక వైద్య సహాయాలతో పాటు మరే సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రిలోనూ లేని విధంగా తక్కువ వ్యయంతో మంచి ఫలితాలిచ్చే ఆక్యుపంక్చర్ వైద్య విభాగాన్ని కూడా ప్రవేశపెట్టారు. ఇతర వైద్యాలకు లొంగని పక్షవాతం, హార్మోనుల సమతౌల్యత లోపించడం, చర్మ వ్యాధులు, శారీరక, మానసిక ఇబ్బందులకు ఆక్యుపంక్చర్ ద్వారా సత్ఫలితాలను చూపిస్తున్నారు. ఈ విధానం ద్వారా వైద్య సహాయం అందిస్తున్న వైద్య నిపుణులు

ఇతరత్రా కూడా ఉన్నప్పటికీ మెడ్విన్ హాస్పిటల్‌లో ఆధునిక యంత్ర పరికరాలు, పోర్టబుల్ లేజర్ యంత్రం తదితర సదుపాయాలతో వివిధ రకాల మానసిక రుగ్మతలకు చికిత్సలు నిర్వహిస్తున్నారు. ముఖ్యంగా నరాలకు సంబంధించిన రుగ్మతలు .... పక్షవాతం, సర్వైకల్‌స్పాండిలైటిస్, కీళ్లనొప్పులు, చర్మ సంబంధమైన లూకోడెర్మా, సొరియాసిస్, ఎంతకూ మాయని గాయాలను బాగు చేయడంలో ఆక్యుపంక్చర్ విధానంవల్ల మెరుగైన ఫలితాలను చూపించగలుగుతోంది.

మెడ్విన్ ఆస్పత్రి ముఖ్యంగా కార్డియాలజీకి, కాన్సర్ చికిత్సకు ఇటీవలికాలంలో ప్రసిద్ధమైంది. సమర్థులైన కార్డియాలజిస్టులు, సర్జన్ల బృందాలు ఈ ఆస్పత్రి ప్రత్యేకత. ప్రారంభించిన అనతి కాలంలోనే అనేక విభాగాలతో విస్తరిల్లిన ఆస్పత్రి ఇది. కార్డియాలజీ విభాగంలోనే 100 పడకలతో సకల సౌకర్యాలూ అందుబాటులో ఉండటం విశేషం.

ఈ మూడూ ప్రైవేట్ రంగంలో ప్రస్తుతం మంచి పేరులోఉన్న కార్పొరేట్ ఆస్పత్రులు. ఇవన్నీ ఒక్కొక్కటి 20-25 కోట్ల రూపాయల పెట్టుబడితో, ఆధునిక భవంతులలో, అత్యాధునిక వైద్య యంత్రాలు పరికరాలతో రూపొందినవే. జంట నగరాలలోనూ ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ పట్టణాలు, జిల్లా కేంద్రాలలోను చిన్నా పెద్దా ఆస్పత్రులనేకం స్థాపితమై ఆధునిక పద్ధతులలో నిర్వహించబడుతున్నాయి. ఇవన్నీ గత పదేళ్ల కాలంలోనే అభివృద్ధి చెందటం విశేషం. పెరుగుతున్న అవసరాలవల్లనే ఇన్ని ఆస్పత్రులు ఇంత పెట్టుబడులతో ఇలా అభివృద్ధి చెందాయి.

ప్రస్తుతం హైదరాబాద్ ప్రత్యేకించి వైద్య

రంగానికి సంబంధించినంత వరకూ అగ్రస్థానంలో ఉందని చెప్పవచ్చు. మొన్నమొన్నటి దాకా మనవారు గుండె ఆపరేషన్లకు మద్రాస్ గాని, వెల్లూరుగాని వెళ్తుండే వారు. హైదరాబాద్‌లో డాక్టర్ కాకర్ల సుబ్బారావుగారి నేతృత్వంలో 'నిమ్స్' ఆ అవసరం లేకుండా చేసింది. ఇపుడు అభివృద్ధి చెందిన కార్పొరేట్ ఆస్పత్రులలో నిత్యం కనీసం అరడజను గుండె ఆపరేషన్లు జరుగుతున్నాయి. హైదరాబాద్‌లో ఎప్పటినుండో కాన్సర్‌కు ప్రత్యేకంగా ప్రభుత్వ ఆస్పత్రి ఉంది. అయినా దానిని మించి పోతూ అత్యాధునిక పరికరాలతో, శాస్త్ర విజ్ఞానంతో ప్రవేట్ ఆస్పత్రులు ఈ రంగంలోను ప్రాముఖ్యతలోకి వచ్చాయి. ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డు విజయవాడలోనూ ప్రైవేట్ ఆస్పత్రుల్లో గుండె ఆపరేషన్లకు శ్రీకారం చుట్టారు. తణుకులో ఒక సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రి రూపుదిద్దుకుంటున్నది.

మృత్యుముఖాన పడిన వారిని సైతం తిరిగి మామూలు మనుషులను చేయగల వైద్య విజ్ఞాన సామర్థ్యాలను కలిగి ఉన్న ఈ సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రుల్లో రోగులకు ఏయే మోతాదులో ఏయే సమయంలో అల్పాహారం, భోజన సదుపాయలు అందజేయాలో ఆ బాధ్యతల్ని కూడా ఇవే మోస్తున్నాయి. కాస్తంత ఖరీదయినా రోగి త్వరితగతిన కోలుకోవడానికిగాను నిర్ణీత సమయాల్లో వైద్య సేవలందిస్తున్న వైద్య నిపుణులు, ఆప్యాయతతో కూడిన పలకరింపులతో సిస్టర్లు సమయానుకూలంగా రోగులు మందులు స్వీకరించే బాధ్యతల్ని నిర్వహిస్తున్నారు. తాము ఆస్పత్రిలో ఉంటున్నామన్న దిగులును పోగొట్టి సాధారణ మనుషులుగా తీర్చి దిద్దేందుకు రోగి గదుల్లో శ్రావ్యమైన సంగీతం వినిపిస్తూ మనసులో ఉంటూన్న వ్యధను పోగొట్టగలుగుతున్నారు. ఎన్ని అవరోధాలు ఎదురైనా అత్యాధునిక వైద్య సదుపాయాలతో పది కాలాలపాటు మనగలిగేట్లు పునర్జన్మను ప్రసాదిస్తున్న ఈ సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులు రోగుల పాలిట ఆపద్బాంధవులు అనడంలో ఎలాంటి సందేహం లేదు.

-మాచర్ల శ్రీనివాస్

# చతుర

సంపుటి: 17 సంచిక: 1 ఫిబ్రవరి 1994

మల్లెల మార్దవం, లిల్లీల లాలిత్యం కలపోసినట్టున్న ఆ సౌందర్యరాశిని ఆరాధిస్తూ... ఆమె మనోవీణియపై ప్రేమరాగాలు మీటాడు అతడు.

అనుకోని ఆమనిలా తన జీవనోద్యానవనంలో ప్రవేశించిన అతడిని... ఆర్తిగా ఆహ్వానించబోయిన ఆమెకు... అకస్మాత్తుగా విధి ఎదురుతిరిగింది.

వివాహబంధం పేర, మూఢాచారాల, మూర్ఖ సంప్రదాయాల ఇనుప సంకెళ్లలో బిగుసుకున్న... ఆమె జీవిత చరమాంకం... ఏమిటి?

నేటికీ మారుమూల పల్లెల్లో వికటాట్టహాసం చేస్తూ, మానవత్వాన్ని మంట కలుపుతున్న ఆచారాలకు, నమ్మకాలకు అద్దం పట్టిన

పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి రచన

'కృష్ణా తరంగాలు'

ఈ నెల చతుర సమగ్ర నవల.

## కృష్ణాతరంగాలు

పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి

నల్లగా, చిక్కగా కాటుక పులిమినట్లున్న ఆకాశం అంచుల్లో చీలికలు చీలికలుగా మెరిసిన మెరుపు తాలూకు మిరుమిట్లు గొలిపే వెలుగుతో కృష్ణానది ఒక్కసారిగా వెలుగు వెల్లువతో హోరెత్తిపోయింది.

తెల్లటి నురగలు కక్కుతూ, పాయలు పాయలుగా, ఎత్తువల్లాల్లో సుడులుతిరుగుతున్నట్లుగా, ఉరవడిగా ఒడ్డుని ఒరుసుకుంటూ పరుగులు పెడుతున్న కృష్ణానది అదోలాంటి హోరుమనే శబ్దాన్ని సృష్టిస్తూ భయకంపితుల్ని చేస్తోంది. నల్లటి ఆకాశంకింద కారుచీకటిలో, హోరు తప్ప నది స్పష్టంగా కన్పించడంలేదు. ఆ హోరు ఎలా ఉందంటే, పైపైకి ఉబికుబికి వస్తున్న నది ఏ క్షణాన్నయినా కట్టలు తెంచుకుని ఊరిని మింగేసేలావుంది.

ఆ భయంకర భీభత్స వాతావరణంలో.. సన్నగా... మొదలయినట్లుగా విన్పించసాగింది చిరుజల్లు శబ్దం.

నెమ్మదిగా... ఆ శబ్దం అధికమవుతూ... స్పష్టంగా... అతి స్పష్టంగా విన్పిస్తూ, క్రమక్రమంగా పెద్ద పెద్ద చినుకులుగా మారుతూ అంతకంతకూ అధికమవుతూ జడివానలా మారుతోంది. దానితోపాటు నెమ్మదిగా మొదలయిన గాలి మళ్ళీ ఊపందుకుని, వేగం పెంచుకుంది. చూస్తుండగానే పది నిముషాలలో చిరుగాలి పెనుగాలిగా మారింది. కూత పెడుతున్నట్లుగా, ఈల వేస్తున్నట్లుగా... వికృత శబ్దాల్ని సృష్టిస్తోంది ఈదురుగాలి.

వాతావరణం ఒక్కసారిగా రౌద్రాకారం దాల్చింది.

కృష్ణవేణి పెల్లుబికిన ఆవేశంతో పరుగులు తీస్తోంది. ఉగ్రవిన్యాసాలు చేస్తోంది. పెనుగాలి, జడివానతో ఒడ్డుకి ఒరుసుకుంటున్న ప్రవాహపు వేగం నర్రున అదోవిధమయిన శబ్దంచేస్తోంది.

వేణుగోపాలస్వామి ఆలయం బాగా ఎత్తుగా కట్టబడి ఉండటంతో పిట్టగోడమీదనుండి చూసినా నదికి అవతలి తీరం కన్పిస్తూ ఉంటుంది.

హోరుగాలికి ఆలయం ముందు ఎత్తుగా ఉండి, నీళ్ళకు నానిపోయినట్లు ఉన్న పురాతనమయిన ధ్వజస్థంభం మీది గంటలు గలగలమని మ్రోగుతున్నాయి.

ధ్వజస్థంభానికి నాలుగు అడుగుల దూరంలో ఉన్న పచ్చగన్నేరు, గరుడవర్ధనంమీదకి పూర్తిగా ఒరిగిపోయి వెచ్చదనం వెతుక్కుంటోంది.

దాదాపు గంటసేపటినుండి కురుస్తున్నా వాన తెరపి ఇచ్చేటట్లు లేదు. ఆకాశం చిల్లుపడినట్లుగా, కుండపోతగా కురుస్తోంది వర్షం!

మేఘాలకి జల్లెడ పట్టినట్లుగా జడివాన టపటపమని నదిమీద శబ్దం చేస్తూ కురుస్తోంది.

అప్పుడు సమయం... రాత్రి ఎనిమిది దాటుతోంది.

అటువంటి సమయంలో...

భుజంమీదనుండి జారిపోతున్న ఎర్రటి పట్టువస్త్రాన్ని నిండుగా శరీరంనిండా కప్పుకుంటూ, చలికి సన్నగా వణుకుతున్న చేతులతో గర్భగుడి తలుపులు బంధిస్తూ, అప్రయత్నంగా నిట్టూర్చారు ఆ గుడి అర్చకులు కృష్ణమాచార్యులుగారు.

గర్భగుడినుండి బయటి మండపంలోకి రాగానే, నదిమీదనుండి వచ్చే చల్లటి గాలి, వానగాలితో మిళితమయి శరీరాన్ని ఒక్కసారిగా వణికించింది.

నరాలన్నీ జివ్వుమన్నాయి.

"గోపాలా! వేణుగోపాలా!" అనుకున్నారాయన అప్రయత్నంగా.

పెద్దవయసు కావడంతో ఒక్కసారిగా చుట్టుముట్టిన ఆ చలిగాలికి ఆయన శరీరం తట్టుకోలేకపోయింది. పళ్ళు కటకటలాడినట్లయినాయి. శరీరం గడగడ వణికింది. భుజంమీది వస్త్రాన్ని నెత్తిమీదకి కూడా లాక్కున్నారు.

విసురుగా వీస్తున్న గాలికి ఆయన శరీరంమీది పట్టువంచె గాలికి ఎగురుతూ, జల్లుకు తడిసిపోతోంది. భుజంమీది పట్టువస్త్రం చలిని ఆపలేకపోతోంది. మెళ్ళో వేసుకున్న తులసిమాల అటూ ఇటూ ఊగుతోంది. కనుబొమలమధ్యనుండి నిలువుగా, విశాలమయిన నుదుటిమీద పాపిటవరకూ తీరుగా ధిద్దిన తిరునామం నీటిజల్లుకి చెరిగిపోయి, అక్కడ




క్కడ అతికినట్లుగా ఉంది.

నల్లగా ఉన్న ఆయన శరీరంమీద, చేతుల మీద పడిన జల్లు... మెరపు మెరవగానే ఆ వెలుగులో ముత్యాల్లా మెరుస్తున్నాయి.

చలిబాధ తట్టుకోవడానికన్నట్లు గడగడ వణుకుతూనే ఆయన సన్నగా కృష్ణస్తోత్రాన్ని జపిస్తూ, నెమ్మదిగా తడుముకుంటూ పిట్టగోడ దగ్గరకు వచ్చి దృష్టి సారించారు.

వరద వచ్చినట్లుగా నిండుగా పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తోంది కృష్ణవేణి. వెన్నెలరోజులయినా బాగా మబ్బుపట్టి ఉండటంతో, వాతావరణమంతా గాంఢాంధకారంగా ఉంది. నది ఒడ్డునే నాలుగైదు చిన్న పడవలు, అయిదారు పెద్దపడవలు కట్టేసి వున్నాయి. బలంగా గాలి వీచినప్పుడల్లా అవి నీటిలో అటూ ఇటూ ఉయ్యాలలా ఊగసాగాయి.

ఊరంతా నిశ్శబ్దంగా, అప్పుడే నిద్రపోయినట్లుగా ఉంది. వాన గాలి శబ్దం తప్ప ఇంకేమీ విన్పించడంలేదు. లేకపోతే రోజూ ఈపాటికి సన్నగా, దూరంనుండి గాలిలో తేలుతూ పడవవాళ్ళ పాటలు విన్పిస్తూ ఉండేవి. వాటికి భాష, లయ లేకపోయినా అదోవిధమయిన ఆలాపనతో, ఏరోజుకారోజు కొత్తగా, అందంగా ఉండేవి.

ఒక్కొక్కరోజయితే కృష్ణమాచార్యులుగారు కాసేపు అలాగే పిట్టగోడమీద మోచేయి ఆనించి, నదిమీద తిరుగుతూ, ఎంకి, నాయుడుబావల్లా పాటలు పాడుకునే ఆ పడవవాళ్ళ పాటలు వింటూ ఉండిపోతారు. నది మధ్యలో ఉన్న పడవనుండి అయితే ఇంకా మధురంగా, సన్నటి గొంతు తీగలు తీగలుగా సాగుతూ నదీతరంగాలమీదుగా... గాలి అలలమీద సయ్యాటలాడుతూ, తెరచాప సందులగుండా, వెన్నెలదారాలను పెనవేసుకుని, ఒక్కొక్కసారి సుదూరతీరాలనుండి అంతలో నది ఒడ్డు నుండి అన్నట్లుగా విన్పిస్తూ వుంటాయి.

అన్నీ మర్చిపోయి ఆయన అటువైపే కన్నార్పకుండా చూస్తూ వాళ్ళ పాటలు వింటూ ఉండిపోతారు.

కాని ఇప్పుడు వాతావరణం అందుకు విరుద్ధంగా ఉంది. ప్రకృతి ప్రళయరాగాలు ఆలపిస్తోంది. వంతకలుపుతున్నాయి ఉరుముల, మద్దెల లయ విన్యాసం. పిడుగుల ఢమరుకన్యానం! మెరుపుల వెలుగులో నర్తిస్తోంది కృష్ణవేణి రౌద్రాకార భంగిమలో. కీచురాళ్ళ వేణువు, ఈదురుగాలి వయొలెన్ తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాయి.

పెద్దగా నిట్టూర్చారు కృష్ణమాచార్యులుగారు.

"వేణుగోపాలా!" అనుకుంటూ పక్కకి తిరిగి ముందుకు అడుగువేయబోయి ఒక్కసారిగా ఆగిపోయారు.

పెద్ద గొంతుకతో గద్దించినట్లుగా "ఎవరదీ!" అన్నారు అటువైపు దృష్టిసారించి.

ఆయనకు రెండు అడుగుల దూరంలో పిట్టగోడకు ఇవతలగా ఉన్న స్థంభానికి ఆనుకుని కూర్చుని వున్న ఆ ఆకారం మరింతగా ముడుచుకుపోయింది.

చీకటిలో ఎవరయినదీ అర్థంకావడంలేదు.

"నిన్నే!" మళ్ళీ రెట్టిస్తూ అన్నారాయన.

ఆ ఆకారంలో చలనం వచ్చినట్లుగా చిన్న కదలిక!

జలజలా కురుస్తున్న వానశబ్దం, ఈదురు గాలి వినురుతప్ప... అంతా నిశ్శబ్దంగా ఉంది.

ఒక అడుగు ముందుకేశారు. అప్పుడు నెమ్మదిగా తలెత్తింది ఆమె. అలా తల ఎత్తడంతో నెత్తిమీదుగా నిండుగా కప్పుకున్న పవిటచెంగు జారి భుజంమీద పడింది.

ఆమె ఎవరయినదీ కృష్ణమాచార్యులవారికి ఆ చీకట్లో అర్థంకాలేదు! కాస్త తగ్గుస్వరంతో అడిగారాయన - "ఎవరూ?"

ఆమెనుండి ఎలాంటి సమాధానం రాలేదు. మళ్ళీ మౌనంగా తల వంచుకుంది.

కళ్ళు చిట్లించి అసహనంగా అన్నారాయన "నిన్నే ఎవరూ అంటే సమాధానం చెప్పవేం?"

అప్పుడు...

ప్రళయగర్జనలాంటి ఉరుముల శబ్దాల మధ్యన తళుక్కుమని కళ్ళు చెదిరేలా మెరిసిన మెరుపు తాలూకు వెలుగులో కన్పించాయి...

ఆమె నుదురు, వాల్చిన కనురెప్పలు, కనుబొమల మధ్యన ఎర్రటి బొట్టు!

"ఎవరూ! కృష్ణవేణీ!" అన్నారాయన అప్ర

యత్నంగా.

ఆయన మాటలను మింగేస్తూ ఎక్కడో పిడుగుపడిన శబ్దానికి భూమి కంపించిందా అన్నట్లుగా మండపంలోని జేగంట అటూ ఇటూ కొట్టుకుని పెద్దగా శబ్దంచేసింది. కృష్ణాతరంగాలు ఆకాశాన్ని చుంబించాలన్నట్లుగా ఒక్కసారిగా ఎగిరెగిరి పడ్డాయి.

మాటలు రానట్లుగా ఆమెనుండి నిశ్శబ్దమే సమాధానమయింది.

"కృష్ణవేణీ! నువ్వు... నువ్వు... ఇక్కడ... ఇప్పుడు..." ఆయన తడబడ్డారు. ఆశ్చర్యంతో కళ్ళు విశాలమయినాయి.

రెండుక్షణాలసేపు ఆయన ఏమీ మాట్లాడలేకపోయారు. ఆమెను గుడిలో చూడటం కొత్తకాదుకాని, ఇలా ఈ సమయంలో, ఇలాంటి వాతావరణం, అందులో ఒంటరిగా...

ఈ సత్యాన్ని ఆయన జీర్ణించుకోలేక అర్థంకానట్లు ఆమెవైపు కన్నార్పకుండా చూస్తుండిపోయారు.

కృష్ణవేణి ఏం మాట్లాడలేదు. మరింతగా ముడుచుకుపోయింది.

"నువ్వు వచ్చి ఎంతసేవయిందమ్మా! అసలు ఎక్కడినుండి? గిరికి తెలుసా?" ఒకమాటకి, మరోమాటకి పొంతన లేదన్న సంగతి ఆయనకే తెలుస్తోంది. ఆమె రెండుక్షణాలు మౌనంగా ఉండి, నెమ్మదిగా తల ఊపింది... అడ్డంగా!

"తెలియదా? అంటే నువ్వు ఒక్కదానివే అంతదూరంనుండి... ఈ వానలో... పోనీ మాధవుడయినా..." ఆశ్చర్యంగా ఇంకేదో అనబోయిన ఆయన కనుబొమలు నెమ్మదిగా, అనుమానంగా ముడుచుకున్నాయి.

ఏదో అర్థం అయీ, అర్థంకానట్లుగా ఉంది.

ఇంతక్రితం వేధించిన చలిగాలి సుదూరతీరాలకు పారిపోయింది. మోకాళ్ళ చుట్టూ రెండు చేతులూ పెనవేసి, మరింతగా ముఖం దాచుకుంటూ, ముడుచుకుపోవడానికి ప్రయత్నిస్తున్న ఆమెని చూస్తుంటే రకరకాల అనుమానాలు రేకెత్తుతున్నాయి.

అస్పష్టంగా కన్పిస్తున్న వాల్చిన కనురెప్పలు... కళ్ళలోని భావాలకు తెరలు దించేశాయి.

ఆమెవైపు పరిశీలనగా చూసిన ఆయన నిట్టూర్చారు. ఇక ఏమీ అడగదలచుకోలేదు. ఆమె మౌనం కొంత అర్థాన్ని చెప్పకనే చెబుతోంది. ఆమెవైపే చూస్తూ అన్నారు గంభీరంగా!

"కృష్ణవేణీ! లే! ఇంటికి వెళదాం!"

కృష్ణవేణి రెండునిముషాలు అలాగే ఉండిపోయింది నిశ్శబ్దంగా!

ఆయనా ఆమెవైపు అలాగే చూస్తుండిపోయారు మౌనంగా!

కాసేపటికి నెమ్మదిగా అటూ ఇటూ కదిలి తల ఎత్తింది.

ఆచార్యులుగారు చేతులు వెనక్కి ముడుచుకుని, గంభీరంగా కృష్ణానదివైపు చూస్తూ నిల్చున్నారు. ఆయన ముఖంలోని భావాలు స్పష్టంగా కన్పించడంలేదు.

కృష్ణవేణి నిశ్శబ్దంగా లేచి నిల్చుంది.

అలా నిల్చోడంలో, సన్నగా అలికిడి అయినట్లుగా అయిన ఆమె గాజుల శబ్దానికి తలతిప్పి అప్పుడు చూశారు సూటిగా, స్పష్టంగా ఆమె ముఖంలోకి!

కృష్ణవేణి కళ్ళల్లో నిండుకున్న వేదన!

"బాబుగారూ!" వణికే స్వరంతో సన్నగా అన్నది.

అప్పుడే మెరిసిన మెరుగు వెలుగులో పరిశీలనగా చూశారామెను.

చెదిరిపోయినట్లుగా వున్న జుట్టు రేగి అస్తవ్యస్తంగా ఉంది. కొంచెం చెదరిన ఎర్రటి బొట్టు, విశాలమయిన తెల్లటి నుదురుమీద రేగిన గాయంలా ఉంది. ఏడవడంవలన కాబోలు కళ్ళు వాచినట్లుగా అయి, కొంచెం ఎర్రగా వున్నాయి. పెదవి బిగబట్టి ఏడుపు ఆపుకోడానికి విశ్వప్రయత్నం చేస్తుండటంవలన, మెడమీది నరాలు ఉబ్బినట్లుగా అయినాయి. స్వల్పంగా భుజాలు ఎగిరెగిరిపడుతున్నాయి. ఏక్షణాన్నయినా కట్టలు తెంచుకునే కృష్ణాపాయలా ఉంది ఆమె పరిస్థితి.

చిన్నగా నిట్టూర్చి ఆమె తలమీద చెయ్యివేసి నిమిరి "పద!" అన్నారు.

ఇద్దరూ ముందుకి రెండు అడుగులు వేసి

ఒక్కక్షణం బయటకు చూశారు. బయట బాగా గాంఢాంధకారంగా ఉన్నా వాతావరణం ఇందాకటిమీద కాస్త ప్రశాంతత ఇచ్చినట్లుగా హోరుగాలి, పెద్ద వాన చాలావరకు తగ్గాయి. సన్నగా జల్లు పడుతోంది.

మెరుపులుమాత్రం ఉండుండి బాగా మెరుస్తున్నాయి.

నెమ్మదిగా మండపం దాటి, ధ్వజస్థంభం దగ్గరకు వచ్చారు.

నేల అంతా బురద బురదగా ఉంది. కాళ్ళకింద చిన్న మొక్కలు మెత్తగా బురదలోకి కూరుకుపోతున్నాయి.

"కృష్ణవేణీ! జాగ్రత్త!" హెచ్చరిస్తూ అన్నారాయన.

అలాగేనని తలూపి జాగ్రత్తగా అడుగులు వేస్తూ, ఎందుకో తల తిప్పి చూసిందామె.

ధ్వజస్థంభం దగ్గరనుండి అయితే కృష్ణానది మరీ దగ్గరగా కన్పిస్తుంది. మధ్యలో ఉన్న పిట్టగోడ ఇంతక్రితం గాలివానకి పడిపోవడంతో, ఆ ప్రదేశమంతా పిచ్చిచెట్లు మొలిచివున్నాయి.

వాటి మధ్యగా మెరుపుల వెలుగులో నిండుగా, తళతళలాడుతూ గుంటలు గుంటలు పడుతున్న వానజల్లుతో కృష్ణవేణి దర్శనమిచ్చింది.

ఎందుకో ఒక్కసారిగా ఒళ్ళు ఝల్లుమంది. గుండె వేగం హెచ్చింది. పవిట చెంగు భుజాలచుట్టూ నిండుగా కప్పుకుంటూ ముందుకు అడుగువేయబోయిన కృష్ణవేణి చప్పున ఆగిపోయింది.

కృష్ణమాచార్యులుగారు కూడా ఆగిపోయారు.

కిందనుండి మెట్లు ఎక్కుతూ వస్తున్నాడు ఒక యువకుడు. అతని కుడిచేతిలో టార్చిలైట్ వెలుగుతోంది. ఎడమచేతితో గొడుగు ఎత్తిపట్టుకున్నాడు.

గబగబా అడుగులు వేసుకుంటూ మెట్లు ఎక్కి వచ్చాడతను.

అతన్ని గుర్తుపట్టినట్లుగా కృష్ణమాచార్యులుగారు అన్నారు "వేణూ!"

"అవును! నేనే బాబాయ్! చీకటి! వాన ఇంకా తగ్గేటట్లు లేకపోతే... పిన్ని పంపించింది" ఇంకా ఏదో చెప్పబోతూ, ఆయన పక్కనే తలవంచుకొని నిల్చున్న ఆ యువతిని చూసి మధ్యలో ఆపేశాడు.

వేణు ఆలోచన అర్థంచేసుకున్నట్లుగా ఆచార్యులుగారే చెప్పారు "మన గిరి చెల్లెలురా! కృష్ణవేణి!"

కృష్ణవేణి...!!

ఆకాశం తలుపులు విచ్చుకుని భగభగమని దొర్లిన అగ్నిపిడుగు సూటిగా హృదయాన్ని తాకి, మనసుని ముక్కలుచేసిన ప్రకంపనలు. బయటి ప్రకృతికి పోటీగా మనసు లోపల రేపిన పెనుతుఫానుని బలవంతంగా దిగమింగి "ఆహ" అన్నాడు ముక్తసరిగా.

రెండుక్షణాల అనంతరం...

బలవంతాన, భారంగా ముందుకి అడుగు వేశాడు వేణు.

గుడి ఆవరణ దాటి ఇవతలకు రాగానే ఒక్కసారిగా వానజల్లు శరీరాలమీద దాడిచేసింది.

వేణు చప్పున తన చేతిలోని గొడుగు ఆచార్యులగారికి ఇచ్చాడు. ఆయన దానిని అందుకుని, ఎత్తుగా పట్టుకుని కృష్ణవేణివైపు తిరిగి దగ్గరగా రమ్మన్నట్లు సైగచేశారు.

వేణు ఆమెవైపే చూస్తున్నాడు వానజల్లు తడిపేస్తున్నా పట్టించుకోకుండా! వానలో తడుస్తున్న వేణుని ఆత్రంగా ఏదో అనబోయిన కృష్ణవేణి, ఎవరో వెన్ను చరిచి హెచ్చరించినట్లుగా, చప్పున ఆ ప్రయత్నం విరమించుకుని నెమ్మదిగా ఆచార్యులవారికి దగ్గరగా జరిగింది.

ముగ్గురూ నెమ్మదిగా జారిపోతున్నట్లున్న మెట్లను జాగ్రత్తగా దిగారు.

ముందర... ఒక చెయ్యి ఫాంటుజేబులో పెట్టుకుని, రెండోచేత్తో టార్చి వేస్తూ, మౌనంగా తల వంచుకుని నడుస్తున్నాడు వేణు.

అతనికి అడుగు వెనకగా కృష్ణమాచార్యులుగారు గాలికి గొడుగులా లేస్తున్న భుజంమీది వస్త్రాన్ని ఒకచేత్తో ఛాతీమీద గట్టిగా బిగించి పట్టుకుని, రెండోచేత్తో గొడుగుని ఎత్తిపట్టుకుని




జాగ్రత్తగా అడుగు తీసి అడుగు వేస్తూ నడుస్తున్నాడు.

ఆయనకు పక్కగా, తలమీదుగా ముసుగు కప్పుకుని, సగం గొడుగు కిందకి వచ్చేరానట్లుగా నడుస్తోంది కృష్ణవేణి!

ఎవరి ఆలోచనల్లో వారు!

అంతా నిశ్శబ్దం! వాళ్ళ అడుగుల శబ్దం బురదలో స్పష్టంగా విన్పిస్తోంది. దూరంగా కీచురాళ్ళ రొద!

మధ్యమధ్య మెరుస్తున్న మెరుపులలో బురదనేల తళుక్కున మెరిసి, చీకటిలో కలిసిపోతోంది.

ముగ్గురూ కృష్ణమాచార్యులుగారి ఇంటి ముందు ఆగారు. ఆయన గొడుగు ముడిచి, తలుపు తట్టబోతుంటే - అప్పుడు అన్నది కృష్ణవేణి "బాబుగారూ!"

ఏమిటన్నట్లుగా వెనుతిరిగి చూశారు.

"నాకు ఇక సెలవిప్పించండి! అన్నయ్య దగ్గరకు వెళతాను"

ఆయన ఆశ్చర్యపోయి "ఏమిటి ఇపుడా? ఈ సమయంలోనా? చీకట్లో అంతదూరం? అయినా తొందరేముంది? రేపు ఉదయమే వెళ్ళొచ్చుగాని లోపలికి రా!" కొంచెం మందలింపు ధోరణిలోనే అన్నారు.

వేణు మౌనంగా వీళ్ళ సంభాషణని వింటూ చీకట్లో ఒకవారగా ఉండిపోయాడు.

"లేదు బాబుగారూ! అన్నయ్యను చూడాలి" నెమ్మదిగా అన్నా ఆమె కంఠంలోని స్థిరత్వాన్ని పసిగట్టారు కృష్ణమాచార్యులుగారు.

తలుపు తట్టే ప్రయత్నం మానుకుని, ఆమె వైపు తిరిగి ఒక్కక్షణం ఆలోచనలోపడ్డారు.

"వెళతావు! నిజమే! కాని ఒక్కదానివి..."

"ఫరవాలేదు! అయినా ఎంతదూరమని? నాకు కొత్తేమీ కాదుగా!"

కృష్ణమాచార్యులుగారు గొడుగు చేతిలోకి తీసుకుంటూ "అయితే పద! నేనూ వస్తాను" అన్నారు.

"మీరా! వద్దు! పెద్దవారు. ఈ చీకట్లో, ఈ వానలో రాలేరు! నేను ఒక్కతెనే వెళ్ళగలను బాబుగారూ!" గట్టిగానే చెప్పింది.

ఆమె చెప్పిందీ నిజమే! కృష్ణమాచార్యులుగారు గుడి దగ్గరనుండి ఇంటికి రావడానికే ఎంతో కష్టపడ్డారు. మాట అయితే అన్నారు గాని అంతదూరం వెళ్ళాలంటే శ్రమతో కూడిన పని!

సందేహిస్తున్నట్లుగా తల తిప్పి వేణువైపు చూశారు!

అంతసేపూ వీరిద్దరికీ దూరంగా నించున్న వేణు ఒక్క అడుగు ముందుకువేశాడు.

"వేణూ..."

ఆయన భావం అర్థంచేసుకున్నట్లుగా "మీ యిష్టం బాబాయ్!" అన్నాడు వేణు.

చివ్వున తల తిప్పి చూసిన కృష్ణవేణి, ఏదో అనబోయి, విశ్వప్రయత్నంమీద ఆపుకుని, తల వంచుకుంది.

ఆమె భావాలతో నిమిత్తం లేనట్టుగా పూర్తిగా కృష్ణమాచార్యులగారివైపు తలతిప్పి, ఆయన చేతిలోనుండి గొడుగు తీసుకున్నాడు వేణు.

"వేణూ! జాగ్రత్త! వీధులన్నీ నీళ్ళుచేరాయి. ఏమాత్రం దారి బాగుండలేదనుకున్నా వెంటనే తిరిగి వచ్చేయండి. పల్లపువీధి మరీ లోతులెక్కువ!"

అలాగేనన్నట్లు తలూపి చేతిలోని టార్చ్ ఫోక్‌చేస్తూ, కృష్ణవేణివైపు చూసీ చూడనట్లుగా చూస్తూ పదమన్నట్లుగా ముందుకు అడుగువేశాడు. అతనిని అనుసరించింది కృష్ణవేణి.

వెనకే "గోపాలా! వేణుగోపాలా!" అనుకుంటూ కృష్ణమాచార్యులుగారు నిట్టూర్చడం విన్పించింది.

పది అడుగులు ముందుకు నడిచిన వేణు ఒక్కక్షణం ఆగి, వెనకే రెండు అడుగుల దూరంలో నడుస్తున్న కృష్ణవేణికి గొడుగు అందించబోయాడు.

వద్దన్నట్లుగా తలూపింది.

అతను రెట్టించలేదు.

మౌనంగా ముందుకు నడిచాడు. అతని వెనకే ఆమె మరింత మౌనంగా!

సన్నటి తుంపరలు తలమీద మంచుజల్లులా కురుస్తున్నాయి.

నల్లటి మబ్బు పక్కకి తప్పుకోవడంతో, ఆకాశం అక్కడక్కడా కొంచెం ప్రకాశవంతంగా ఉంది.

దారికి ఇరువైపులా ఉన్న వెదురుపొదల మధ్యనుండి సర్రున కోస్తున్నట్లుగా వస్తోంది గాలి! అదోవిధమయిన మంచి గంధపు వాసన, మట్టివాసన కలగాపులగంగా మిళిత మయి వస్తున్నాయి.

పది నిముషాల్లోనే వచ్చారు ఆ యింటి ముందుకి!

చిన్న పెంకుటిల్లు! ఇంటిచుట్టూ పెద్ద ఆవరణ!

పచ్చగా, నిండుగా, ఒక తీరుగా పెంచిన మొక్కలన్నీ గాలివానకి కాబోలు అన్నీ ఒకవైపుకి పడిపోయినట్లుగా ఒరిగిపోయాయి.

ఇంటిముందు వెదురుబద్దలతో కట్టిన చిన్న గేటుని ముందుకు నెట్టబోయిన వేణు అలాగే ఆగిపోయాడు.

ఆ యింటికి తాళం వేసివుంది.

"తాళం వేసివుంది!" అన్నాడు వెనుతిరగకుండానే!

కృష్ణవేణి ఏం చేయాలో తోచనట్లుగా, బురదనేలలో అలాగే సాలోచనగా నిల్చుండిపోయింది.

వేణు ఏదో ఆలోచన వచ్చినట్లుగా, గబగబా అక్కడినుండి కదిలి, నాలుగడుగులు అవతల రెల్లుగడ్డితో నేసివున్న ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు.

కృష్ణవేణి మౌనంగా చూస్తోంది.

వేణు "కన్నయ్యా! కన్నయ్యా!" అంటూ పిలుస్తున్నాడు మరింత గట్టిగా తలుపు కొడుతూ.

కాసేపటికి తలుపు తెరిచి కన్నయ్య బయటకు వచ్చాడు. తలగుడ్డ విప్పి విదిలిస్తూ "ఎవరూ!" అంటూ అడిగాడు.

వేణు చెప్పి ఏదో అడిగాడు.

చినుకుల శబ్దంలో అతని మాటలు కలిసిపోయి విన్పించడంలేదు.





కన్నయ్య ఆశ్చర్యంగా తలతిప్పి, దూరంగా చీకటిలో, వానలో తడుస్తూ నిల్చున్న కృష్ణవేణిని చూసి, ఆత్రంగా వేణువైపు తిరిగి ఏదో అన్నాడు.

వేణు ఎందుకో హఠాత్తుగా గంభీరంగా అయి, మళ్ళీ తిరిగి కన్నయ్యతో ఏదో మాట్లాడాడు.

కన్నయ్య సాలోచనగా తలతిప్పి, అలాగేనన్నట్లుగా తలూపుతూ, మళ్ళీ తలకు గుడ్డచుట్టుకుని లోపలికి వెళ్ళిపోయాడు.

వేణు వెంటనే గబగబా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ కృష్ణవేణి దగ్గరకు వచ్చి పదమన్నట్లుగా నెమ్మదిగా తల ఊపాడు.

కృష్ణవేణి కదలలేదు. వాల్చిన కనురెప్పలు నెమ్మదిగా ఎత్తి అతనివైపు చూసింది.

చెప్పాడు కొంచెం పక్కకు తిరిగి "మీ అన్నయ్య ఉదయమే సిటీకి వెళ్ళాడట! ఇంతవరకూ రాలేదంటే ఈ రాత్రికి ఇక రానట్లే! కన్నయ్య నిన్ను వాళ్ళింట్లో పడుకోమని ఎంతగానో చెప్పాడు. కాని... నేనే వద్దన్నాను..." అని ఒక్కక్షణం మౌనంగా ఉండి పూర్తిచేశాడు. "ఎందుకో నాకే తెలియదు"

కృష్ణవేణి ఆలోచనలో పడినట్లుగా, కాలి బొటనవేలుతో బురదనేలమీద రాస్తూ అలాగే ఉండిపోయింది.

వేణు ఆమెవైపు చూసి ముందుకు అడుగు వేశాడు.

అతని వెనక సాలోచనగానే అడుగు కలిపింది.

నేలంతా బాగా చిత్తడిగా ఉంది. వాన కాసేపు తగ్గుతోంది. మళ్ళీ అంతలో ఉధృతం అవుతోంది.

చూస్తుండగానే మళ్ళీ ఆకాశంలో మబ్బులు పరుగులు పెట్టసాగాయి. అక్కడక్కడా కన్పిస్తున్న వెలుగు నెమ్మదిగా అంతర్ధానమవుతోంది. ఇద్దరూ గబగబా నడవసాగారు.

వాతావరణంలో మళ్ళీ మార్పు రాసాగింది. గాలిలో కూడా మార్పు వస్తోంది. పక్కనే గట్టుమీద వరుసగా పెద్దపెద్ద పొదల్లా ఉన్నాయి నరుగుడు చెట్లు!

వాటి మధ్యనుండి కృష్ణానదీ తరంగాల గలగల శబ్దం బాగా దగ్గరగా విన్పిస్తోంది.

సరుగుడు చెట్ల మధ్యకు రాగానే, ఒక్కసారిగా చల్లటి గాలి రివ్వుమంటూ వాళ్ళని చుట్టుముట్టింది.

అసలే పూర్తిగా తడిసిపోయిందేమో! "అబ్బా!" అంటూ గజగజా వణికినట్లుగా ముడుచుకుపోయింది కృష్ణవేణి!

వేణు కూడా పళ్ళు బిగబట్టి ఆకాశంవైపు చూశాడు.

ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు.

కాటుక పులిమినట్లుగా నల్లగా, భయంకరంగా ఉంది ఆకాశం! ఎక్కడా మబ్బుతునక అనేది లేదు.

వేణు తలతిప్పి కృష్ణవేణితో ఏదో చెప్పబోతూ ఉండగానే పెద్దగా శబ్దం చేస్తూ మళ్ళీ మొదలయింది జడివాన.

ఇద్దరూ గబగబా నడవసాగారు.

బాగా పల్లెటూరు అవడంతో వీధులు ఒక తీరుగా ఉండవు! సందులూ, మలుపులు ఎక్కువ.

వేణు రెండుసందులు దాటాక హఠాత్తుగా పక్కసందులోకి తిరిగాడు. కృష్ణవేణి కొంచెం భయంగా, కొంత సందేహంగా అతనివైపు చూసింది నడుస్తూనే!

వేణు ఒక్కక్షణం ఆగి చెప్పాడు "తప్పదు! వాన మళ్ళీ ఎక్కువయింది. తగ్గగానే బాబాయివాళ్ళింట్లో దిగపెడతాను. అంతవరకూ నా ఇంట్లో ... దయచేసి వేరుగా అనుకోవద్దు! ఈ వానకి రోడ్డంతా పూర్తిగా కోసుకుపోయి గుంటలు బయటపడ్డాయి! ఈ చీకట్లో ఈ దారిన వెళ్ళటం అంత శ్రేయస్కరం కాదనుకుంటాను!"

కృష్ణవేణి పెదవి విప్పలేదు. మౌనంగా అతన్ని అనుసరించింది.

★ ★ ★

రెండు మూడు ఇళ్ళు దాటగానే, వేణు ఉంటున్న ఇల్లు వచ్చింది.

ఇల్లు అంటే పెద్దదేమీకాదు. ముందర పెద్ద విశాలమయిన గది! దానిని ఆనుకుని చిన్న గది. ముందరి గది రోడ్డుమీదకే ఉంటుంది. ముందర వేరే ఖాళీస్థలం ఏమీ లేదు.

గది తాళం తీసి "ఒక్కక్షణం!" అని లోపలికి నడిచాడు వేణు. కరెంటు లేకపోవడంతో చీకటిమయంగా ఉంది.

కృష్ణవేణి వాకిట్లోనే గోడవారగా నిల్చుండిపోయింది.

రెండు క్షణాల్లో కొవ్వొత్తి వెలిగించి, బయటకు వచ్చి లోపలికి రమ్మన్నట్లుగా తలుపులు పూర్తిగా తీసి నించున్నాడు.

లోపలికి అడుగుపెట్టింది కృష్ణవేణి.

గాలి విసురుకి తలుపులు ధడధడా కొట్టుకున్నాయి.

వేణు చప్పున తలుపు గడియవేశాడు.

గది మధ్యకు రాగానే- ఒక్కసారిగా మత్తయిన పూలసౌరభం కృష్ణవేణిని చుట్టుముట్టి, ఉక్కిరి బిక్కిరి చేసింది. గదంతా కలియచూస్తూ, గది మధ్యలో వేసి ఉన్న పొడవాటి బల్లమీద చివరగా కూర్చుంది.

ఆమె కూర్చున్న బల్లమీద వరుసగా నాలుగయిదు తట్టలు పెట్టిఉన్నాయి. వాటి నిండుగా లిల్లీపూలు, చేమంతులు, మరువం, కనకాంబరాలు, కాగడామల్లెలు, కారబ్బంతిపూలు గుట్టలు పోసినట్లుగా ఉన్నాయి.

ఆమెకి పక్కగా గోడవారగా దండేనికి, పెద్ద పెద్దవి నాలుగు లిల్లీపూల దండలు, గులాబీపూల దండలు వ్రేలాడదీసి ఉన్నాయి. వేణు వాటిని ఒక పక్కకి సర్దుతూ చెప్పాడు, "ఈ పూలు రేపటికి సిటీకి చేరాలి. అక్కడ ఏదో మీటింగ్ ఉందిట. ఈ దండలు కూడా రేపు ఉదయం పదింటికల్లా చేరాలన్నారు. ఏమిటో! ఈ రాత్రికే చేర్చాలనుకున్నాను! అనుకోకుండా ఈ గాలివాన! ప్చ్! ఒక్క పడవ కదలడానికి వీలులేకపోయింది. కనీసం- తెల్లవారు ఝామున్నా తెరిపి ఇస్తే బాగుండును! అడ్వాన్సు కూడా తీసుకున్నాను. మాట పోతుంది!" కొంత కృష్ణవేణికి చెప్పినట్లుగా, కొంత గోడకి చెప్పినట్లుగా, మరి కొంత స్వగతంగా చెప్పాడు.

కృష్ణవేణి ఏమీ మాట్లాడలేదు. తలవంచుకుని, నిశ్శబ్దంగా వింటూ ఉండిపోయింది. ఎందుకో, ఏమీ మాట్లాడాలనిపించడంలేదు! అసలు మాటలు పెగలిరానట్లు, మూగదానిలా ఉండిపోయింది.

బుట్టలోని చేమంతి పువ్వు తీసుకుని, కన్నార్పకుండా దానివైపే చూస్తూ, చేతిలో అటూ ఇటూ తిప్పుతూ ఉండిపోయింది.

బయట టపటపమంటూ వానపడుతున్న శబ్దం విన్పిస్తోంది. మధ్యమధ్యలో కప్పల బెక బెక శబ్దం నిశ్శబ్దాన్ని ఛేదిస్తోంది!

దండలు అటూ ఇటూ సర్దుతున్నట్టుగా ఉండిపోయాడు వేణు! ఇద్దరిమధ్యన భయంకరమయిన నిశ్శబ్దం పేరుకుపోయింది.

కాని-

నిశ్శబ్దంగా ఉన్న కృష్ణవేణి మనసులో మాత్రం సన్నగా అలజడి! మాటలకందని భావోద్వేగం! ఆమె మనఃస్థితి ఆమె చేతివేళ్ళల్లో ప్రతిఫలిస్తుంటే, సన్నగా వణకసాగాయి వేళ్ళు!

గులాబీల గుబాళింపు, మల్లెలమార్దవం, మరువపు మనోహరం, లిల్లీ లాలిత్యం, ఒక్కసారిగా నాలుగువైపులనుండి ఆమెను ముప్పిరిగొనగా, మనసు అట్టడుగు పొరలను నెమ్మది నెమ్మదిగా ఛేదించుకుంటూ... ఎక్కడో సుదూర తీరాలనుండి అన్నట్లుగా విన్పించసాగింది... ఒక స్మృతి హేల... ఒక రాగలీల... ఒక ఈల!



అలలమీద తేలుతూ... నవ్వేడులు రేపుతూ...

ఉయ్యాలలూపుతూ... వేణువు మీటుతూ...

తేలితేలి... సోలిసోలి... ఆటగా... నయ్యాటగా...





వేణువు మోగుతున్నట్లుగా ఈల పాట...

ఒకటి కాదు... రెండు... పది... వంద... వెయ్యి...

వేయి గొంతుల ఈల పాటలు... పదివేల గొంతుకల వేణుగానాలు... చెవులు దద్దరిల్లిపోతున్నట్లనిపిస్తోంది ఆమెకి!

నుదుటిమీద స్వేదబిందువులు అలుముకున్నాయి.

భరించే శక్తి లేనట్లుగా, వణికే చేతులతో గట్టిగా చెవులు మూసుకుంది. మనస్సు లోపలి మంచు ఆవిరై అశ్రురూపంలో బయటపడబోతుంటే బలవంతాన కంటిరెప్పలతో నొక్కిపెట్టి విఫలురాలయింది.

చెవులు మూసుకుని అలా ఎంతసేపు ఉండిపోయిందో తెలియదు.మౌనం మనసులో అలజడిరేపుతుంటే, నిశ్శబ్దం నిర్వికారాన్ని ఆపాదిస్తోంది.

ఆ మౌనంలోనుండి...

ఆ శ్శబ్దంలోనుండి ఒక పిలుపు...

సన్నగా... చిన్నగా... చెవులను తాకింది.

''కృష్ణా!''

ఉలిక్కిపడింది.

ఎక్కడనుండి ఆ పిలుపు? ఎవరో నామజపం చేస్తున్నట్లుగా వేలవేల గొంతులతో అరుస్తున్నట్లుగా... ఏమూలనుండి చూసినా... అదే పిలుపు.

మార్దవం మిళితమయిన స్వరం మళ్ళీ పిలిచింది.

''కృష్ణా!''

తల తిప్పి చూసింది.

వేలాడుతున్న దండలని సరిచేస్తున్నట్లుగా ఉన్న అతని చేతులు. దండలని పట్టుకుని ఎదురుగా ఉన్న వ్యక్తికి వేయడానికి సిద్ధమయినట్లుగా ఉన్నాయి. తడిసిన తలమీది జుట్టు చెల్లాచెదురుగా పాయలు పాయలుగా నుదురుని, కళ్ళను కప్పేయగా, వాటిమధ్యగా నూటిగా కృష్ణవేణిని చూస్తున్నాయి అతని కళ్ళు!

నిలువెత్తు దండ. మధ్యగా ఉన్న వేణు అన్నాడు.

''కృష్ణా! ఎలా... ఎలా ఉన్నావు?'' ఆ రెండు మాటలకే అతని గొంతు మూగపోయింది. ఏదో

అడ్డు పడ్డట్లయింది.

ఆ ఒక్క పిలుపు చాలు- నిండుగా ప్రవహిస్తున్న కృష్ణవేణిలో అలలనుడులను రేపడానికి!

చప్పున కళ్ళు మూసుకుని, పక్కకు తిరిగినట్లుగా జరిగింది. నిండుగా కప్పుకున్న పమిట భుజం మీదకు జారింది.

అపుడు చూసాడు వేణు.

క్రీనీడలో...

జాలువారుస్తున్న కృష్ణా తరంగాల్లా ఆమె మూసుకున్న కనురెప్పల్ని. ఏడుపు దిగమింగడానికి విశ్వప్రయత్నంచేస్తూ బిగపెట్టిన గొంతులో నుడిగుండాన్ని...

హృదయం లోపలి పెనుతుఫాను తాకిడికి అదురుతున్న భుజాలని... కంపిస్తున్న చేతులను... కొనపంటిని బిగించిన పెదవిని... చేతిలో నలిగిపోయి రెక్కలు రెక్కలుగా రాలిపోయిన చేమంతి రేకలు గాలికి అటూఇటూ ఎగిరిపోయాయి.

నెమ్మదిగా తల ఎత్తి, బలవంతంగా శక్తిని కూడతీసుకుంటూ తడబడుతున్నట్లుగా అన్నది.

"వేణూ! దయచేసి... దయచేసి... నన్ను ఏమీ అడగవద్దు! అసలు... అసలు నన్ను అలా పిలవద్దు.. ప్లీజ్!"

అభ్యర్థిస్తున్నట్లుగా ఉన్న ఆమె స్వరంలోని మార్పుకి స్థాణువయినట్లుగా చూశాడు వేణు.

రెండుక్షణాలసేపు, కృష్ణవేణివైపు కన్నార్పకుండా అలాగే చూస్తుండిపోయాడు. అతని చేతిలో ఉన్న గులాబీదండమీద... చేతి వేళ్ళు అప్రయత్నంగా బిగుసుకున్నాయి.

మరుక్షణం... టపటపమంటూ గులాబీ రేకులు చెల్లాచెదురుగా కిందపడసాగాయి వాన జల్లులా!

"కృష్ణవేణీ!" గొంతు పెగలించుకుని అన్నాడు.

"వద్దు ప్లీజ్! మాట్లాడొద్దు! కాసేపు ఆగితే నాదారిన నేను పోతాను!" చివ్వున లేస్తూ అంది కృష్ణవేణి.

వినురుగా అన్నా- ఆ స్వరంలో ఏడుపు స్పష్టంగా విన్పిస్తోంది.

ఒక్కసారిగా బయటనుండి పెనుగాలి వీచింది. కిటికీ రెక్క ధడేలున కొట్టుకుని, ఆ వినురుకి కొవ్వొత్తి టప్‌మని ఆరిపోయింది.

ఇద్దరి మనసుల్లో ఉలిక్కిపడిన భావన.

మళ్ళీ నిశ్శబ్దం... భరించలేని నిశ్శబ్దం...

చిమ్మచీకటి...

ఆ చీకటి పొరలను తొలగించుకుంటూ హఠాత్తుగా విన్పించింది ఆమె పిలుపు.

"వేణూ!"

వేణు మాట్లాడలేదు. కొవ్వొత్తి వెలిగించడానికి కదిలాడు.

"నువ్వు... నువ్వు.. ఎలా ఉన్నావు?" అడిగింది.

ఎందుకో హఠాత్తుగా నవ్వొచ్చింది వేణుకి!

నవ్వాడు! నెమ్మదిగా... క్రమేపీ ఆ నవ్వు అధికమవసాగింది. పగలబడి నవ్వసాగాడు.

ఆ చీకటిలో... అతని నవ్వు చిత్రంగా ప్రతిధ్వనిస్తోంది ఆ రూమ్‌లో!

"ఎందుకు వేణు... ఏడిపిస్తావు?"

"నేనా? నిన్నా? అరె?..."

"మరి?"

"ఊహు! ఎందుకో నవ్వొచ్చింది! అంతే! నువ్వు ఎలా ఉన్నావో... నేనూ అలాగే ఉన్నాను సరా?"

"అంటే?"

"నువ్వు ఎలా ఉన్నావో నీకు తెలియదా కృష్ణా... కృష్ణవేణీ!"

"వేణూ!"

"ఊ!"

"నిజం చెప్పు!"

మళ్ళీ నవ్వాడు "చూస్తున్నావుగా!"

టప్‌మని అగ్గిపెట్టె చప్పుడుతో వెలిగింది కొవ్వొత్తి!

దాని మీదికి వంగి ఉన్న వేణు ముఖం క్రీనీడల్లో కన్పించింది.

నిర్వికారంగా!

అతని కళ్ళు టపటప కొట్టుకుంటున్న

వత్తినే చూస్తున్నాయి సూటిగా! చిన్నగా నిట్టూర్చి, నెమ్మదిగా కదిలి, గోడవారగా ఉన్న కిటికీ దగ్గరకు నడిచి, కిటికీ రెక్క తీసి పట్టుకుని బయటకు చూస్తూ నిలబడింది కృష్ణవేణి.

వాన తగ్గిపోయింది. గాలి మాత్రం వీస్తోంది.

నల్లటి మబ్బు పోయి అక్కడ కూడా ఆకాశం నిర్మలంగా ఉంది. మబ్బు మాటునుండి కుంచెతో తీరుగా చిత్రీకరించినట్లుగా, కుంచె ఆకారంలోనే పడుతున్నాయి చంద్రకిరణాలు నిట్టనిలువుగా!

బయటకు చూస్తూ అడిగింది హఠాత్తుగా.

''ఎలా ఉంది వేణూ! నీ బిజినెస్!''

''బాగానే ఉంది! మూడు మల్లెలు! ఆరు మరువాలు!'' నవ్వబోయాడు! కాని గొంతుకు ఏదో అడ్డుపడ్డట్లుగా నవ్వలేకపోయాడు.

కాని... కృష్ణవేణి నవ్వింది! మనస్ఫూర్తిగా నవ్వింది! హాయిగా నవ్వింది.

''కృష్ణా! నువ్వు... నవ్వు చాలా పెద్దదానివయిపోయావు!'' ఆమెను చూస్తూ అన్నాడు. కృష్ణవేణి హఠాత్తుగా వెనక్కు తిరిగి, ''వేణూ! వర్షం తగ్గింది! వెళదామా!'' అన్నది

వేణు తబ్బిబ్బు అయినట్లుగా తలూపాడు.

అతనికి తెలుసు సంభాషణ ఇంకా పొడిగించడం ఆమెకు ఇష్టంలేదని.

వేణు మాట్లాడలేనట్లుగా ఆమెవైపే చూస్తుండిపోయాడు.

నీళ్ళుకారుతూ చెల్లాచెదురుగా నుదుటిమీదకి పడిన జుట్టు మధ్యగా అతని కళ్ళు కృష్ణవేణి కళ్ళల్లో దేనికోసమో వెతుకుతున్నాయి. కృష్ణవేణి వెళ్ళడం అతనికి ఇష్టంలేనట్లు అతని ముఖకవళికలే చెబుతున్నాయి.

మౌనంగా వెళ్ళి, తలుపు ఒక రెక్కతీసి పట్టుకుని పక్కగా నించున్నాడు. బయటకు అడుగు వేయబోతూ చిన్నగా నవ్వింది కృష్ణవేణి.

వేణుకూడా బయటకు వచ్చి తలుపు తాళంవేసి, గొడుగు మడిచి చేతిలో పట్టుకున్నాడు.

మబ్బు చాటునుండి చంద్రుడు బయటకు వచ్చాడు.

అయినా వెన్నెల మసక మసకగానే ఉన్నది.

ఇద్దరూ గబగబా నడిచి త్వరగానే ఇంటికి చేరుకున్నారు. వేణు తలుపు తడుతూ, ''బాబాయ్! బాబాయ్!'' అంటూ గట్టిగా పిలిచాడు. లోపల మంచంమీద అటూఇటూ కదిలిన చప్పుడు. కాసేపటికి కృష్ణమాచార్యులుగారు తలుపు తీసి ఆశ్చర్యంగా ఇద్దరినీ చూస్తూ!, ''ఏమమ్మాయి! ఏమిటీ? గిరిలేడా?'' అన్నారు.

ముడిచిన గొడుగు గోడవారగా పెడుతూ చెప్పాడు వేణు.

''అవును బాబాయ్! సిటీనుండి ఇంకా రాలేదట. కన్నయ్య అక్కడే ఉండమని చెప్పాడు! కాని, వద్దని నేనే తీసుకువచ్చేశాను. వాన మరీ ఎక్కువయితేనూ... అక్కడే ఓ ఇరవయి నిముషాలు ఉండివచ్చాము...'' నసిగినట్లుగా, సంజాయిషి చెప్పినట్లుగా చెప్పాడు.

అతిసాధారణంగా, తేలికగా తను చెప్పిన అబద్ధానికి, త్రుళ్ళిపడ్డట్లుగా తలతిప్పి అతనివైపు చూసింది కృష్ణవేణి.

వేణు అభ్యర్థిస్తున్నట్లుగా ఆమెవైపు చూశాడు.

కృష్ణవేణి మౌనంగా తల తిప్పుకుంది.

ఇంతలో మధ్యహాల్లో పట్టెమంచానికి కాస్త దూరంలో వేసి ఉన్న నులకమంచంమీద నుంచి బరువుగా, బద్ధకంగా లేచిన ఆండాళమ్మ పక్కనే చెక్కపెట్టెమీద ఉన్న లాంతరు వత్తి పెద్దది చేసి బయటకు వచ్చింది.

పాతనేత చీరను భుజంనిండా కప్పుకుంటూ కృష్ణవేణిని చూస్తూ అంది.

''రావే కృష్ణా! లోపలికి రా! ఎంతసేవయింది వచ్చి! పాడునిద్ర! ఓ పట్టాన మెలుకువ రాలేదు! ఏమిటీ! గిరి లేడా!''

కృష్ణవేణి లేడన్నట్లుగా అడ్డంగా తలూపి లోపలికి అడుగుపెట్టింది.

వేణు కృష్ణవేణివైపు ఒక్క క్షణంసేపు చూసి, వెంటనే కృష్ణమాచార్యులగారివైపు చూస్తూ చెప్పాడు, ''ఇక నే వెళ్ళొస్తా బాబాయ్! రేపు కలుస్తాను!''

''అలాగేరా! జాగ్రత్త! గొడుగు తీసుకువెళ్ళు!''




అప్పటికే వేణు రోడ్డుమీదకి వచ్చేశాడు. "ఎందుకు? వద్దులే బాబాయ్! ఎలాగూ తడిసిపోయాను. ఎంత? నాలుగడుగులేగా!" అంటూ గబగబా నడుస్తూ చూస్తుండగానే చీకట్లో కలిసిపోయాడు.

అటే చూస్తూ ఉండిపోయిన కృష్ణమాచార్యులుగారు, వేణు కనుమరుగవగానే చిన్నగా నిట్టూర్చి లోపలికి వచ్చి తలుపు గడియవేస్తూ భార్యవైపు చూస్తూ చెప్పారు.

"ఆండాళూ! అమ్మాయికి పడక గదిలో ఏర్పాటు చేయి!"

ఆండాళమ్మ అలాగేనంటూ గబగబా తలుపువేసిఉన్న గదివైపు అడుగులువేసి, గొళ్ళెంతీసి తలుపు తీసింది.

లోపల పెద్ద పందిరిమంచం ఉంది. దానిమీద పరుపు, పైన పాతకాలం గళ్ళ దుప్పటి వేసి ఉన్నాయి. ఆమె వెనకే కృష్ణవేణి కూడా గదిలోకి వచ్చింది. ఆండాళమ్మ ఎర్రటి కాశీ కండువా కృష్ణవేణి చేతికి ఇచ్చి, "బాగా తడిసినట్లున్నావు. ముందు తల తుడుచుకో!" అంటూ మంచంమీది దుప్పటిని బాగా మూలలకు సర్దుతూ, "హాయిగా నిద్రపో! కావాలంటే ఆ కిటికీ తలుపు తెరుచుకుని పడుకో! ఇందాకటినుండీ బాగా జల్లు వస్తుంటే వేశాను. ఇపుడు కాస్త తగ్గినట్లుంది! ఏం వానలో బాబూ... అన్నట్లు బట్టలేమీ తెచ్చుకున్నట్లు లేదు. చీర చూస్తే పూర్తిగా తడిసిపోయింది..."

కృష్ణవేణి మొహమాటంగా తలతిప్పి, "ఇపుడేమీ వద్దు! కాసేపటికి అదే ఆరిపోతుంది" అంటూ మంచంమీద కూర్చుంది.

ఆండాళమ్మ కృష్ణవేణివైపు సాలోచనగా చూస్తూ, "నీ యిష్టం! అయినా కావాలంటే తీసుకో! నావి ఏవో పాతకాలం చీరలనుకో! ఏదో ఈ రాత్రికి..."

"అబ్బే! ఫరవాలేదు!"

"సరే! అయితే పడుకో!" అంటూ హాల్లోకి నడిచి నులకమంచం మీద తలగడ సర్దుకుని పడుకోబోతూ పక్కకి తిరిగి భర్తవైపు చూసింది. కాస్త దూరంలో వేసి ఉన్న పట్టెమంచంమీద అటు తిరిగి పడుకున్న కృష్ణమాచార్యులుగారు అపుడు చిన్నసైజు గురక ప్రారంభించారు.

"కృష్ణ! కృష్ణ!" అనుకుంటూ ఆండాళమ్మ కూడా అటూఇటూ పొర్లిగింతలుపెట్టి, ఆవలింతలు వస్తే చిటికలు వేస్తూ నెమ్మదిగా నిద్రలోకి జారుకుంది.

గదిలో మంచంమీద వెల్లకిలా పడుకుంది కృష్ణవేణి!

శరీరానికి అతుక్కుపోయిన చీర చలి పుట్టిస్తున్నా గదిలో వెచ్చగా ఉండటంతో కాస్త నయం.

నెమ్మదిగా కళ్ళు మూసుకుంది.

నిద్రవలన కాదు! అలసటకి! అపుడు మొదలయింది... కనురెప్పల మాటున కదలిక! మనసు అగాధంలో పెనుతుఫాను, హృదయపు లోపొరల ప్రకంపనం!

ఒక్కసారిగా వానజల్లులా తడిపేశాయి రకరకాల ఆలోచనలు...

మంచంమీదనే అటూఇటూ ఎవరో కుదిపినట్లయి, పక్కకు వత్తిగిల్లింది.

చెవుల్లో ఏదో హోరు...

ఎక్కడినుండో... దూరంగా... విన్పిస్తున్నట్లుగా... ఏవో అరుపులు... కేకలు...

కలగాపులగంగా!

రకరకాల గొంతులు... ఏడుస్తున్నట్లుగా... మెడమీద చెయ్యివేసి తోస్తున్నట్లుగా... ఏవో దృశ్యాలు...

అరుపులు... అంతకంతకూ పెద్దవవుతూ... పెద్ద గోలగా... తయారవుతూ. ఆ గందరగోళం మధ్యన కిర్రుకిర్రుమంటూ వికృతంగా శబ్దం చేస్తూన్న ఉయ్యాలబల్ల, తనమీదుగానే నీడలు సృష్టిస్తూ అటూఇటూ ఊగుతున్న భావన!

ఖణేల్‌ఖణేల్ మంటూ గొలుసుచప్పుడు చేస్తూ... మెడకు బిగుసుకుంటున్నట్లుగా...

చివ్వున లేచి కూర్చుంది కృష్ణవేణి!

ముఖమంతా చెమటతో తడిసిపోయింది.

ఆయాసం వచ్చినట్లుగా ఊపిరి గబగబా పీల్చసాగింది.

ఆలోచనల పరంపరకి తట్టుకోలేనట్లుగా మెదడంతా వేడెక్కిపోయింది. మొద్దుబారిపోయినట్లుగా అచేతనంగా అయిపోయింది. రెండు నిముషాలసేపు మంచం మధ్యలో ము

డుచుకుపోయినట్లుగా మోకాళ్ళమీద ముఖం ఆనించి కూర్చుండిపోయింది.

అంధకార నిశ్శబ్దం!

నిముషం! రెండు నిముషాలు... మూడు... నాలుగు...

నిశ్శబ్దపు పొరలను అలవోకగా తొలగించు కుంటూ...

పిల్ల తెమ్మెరలా... మంచు పొగలా...

స్పష్టాస్పష్టంగా... వినిపించసాగింది.

ఈలపాట...

కోయిల కూతలా, వేణుగానంలా, అందెల రవళిలా, వీణానాదంలా, సేదతీరుస్తున్నట్లుగా, నిద్రపుచ్చుతున్నట్లుగా.

జాలి పాటగా, జోలపాటలా,

గాలిలో... లీలగా... తేలుతూ...తుళ్ళుతూ...

చూస్తుండగానే... నాలుగువైపులనుండి మంచులా కమ్మేసింది కృష్ణవేణిని ఆ వేణు గానం...

క్రమంగా మైకంలో, మమేకమవుతూ,

పిల్లనగ్రోవి పిలుపు "అల్లనల్లన ఏవో దూర తీరాలకు సాగిపోతూ... తీసుకుపోతుంటే.

కళ్ళు బరువులవసాగాయి.

వళ్ళు తూలసాగింది...

నెమ్మదిగా... మంచంమీద వెనక్కి వాలింది!

నెమ్మదిగా... వేణుగానం కూడా అస్ప ష్టంగా... లీలగా... దూరంగా... వినిపించసా గింది. మరింత దూరంగా... ఆలోచనలు విసిరే సిన అగాధానికి ఈల పాట నిచ్చెన వేసింది.

నిశ్శబ్దం!

తనకు తెలియకుండానే నిద్రలోకి జారిపో యింది కృష్ణవేణి!

అలా ఎంతసేపు పడుకుండిపోయిందో తెలి యదు.

బయట వాన పూర్తిగా తగ్గిపోయింది. గాలి కూడాలేదు.

ఒక మధ్య రాత్రివేళ.

ఎవరో తట్టి లేపినట్లుగా, ఉలికిపాటుతో హఠాత్తుగా లేచి కూర్చుంది కృష్ణవేణి. చప్పున తను ఎక్కడుందో అర్థంకాలేదు! అంతా కొత్త వాతావరణం! తలతిప్పి చూసింది!

హాల్లో భార్య భర్తలు ఇద్దరూ పోటీలుపడి గురకలు పెడుతున్నారు. గుమ్మం పక్కగా పెట్టిన లాంతరు వెలుగు బాగా తగ్గిపోవడంతో చీకటిగా అన్పిస్తోంది. గాలి పూర్తిగా స్థంభించి పోవడంతో శరీరమంతా చెమటలుపట్టింది.

చీర పూర్తిగా ఆరిపోయి చుట్టుకుపోయిన ట్లుగా అయింది. మంచంమీద బద్ధకంగా అటూఇటూ కదిలి లేచి నిల్చుంది. చిరాకుగా ఒళ్ళు విరుచుకుని, రెండు అడుగుల దూ రంలో ఉన్న కిటికీ దగ్గరకు నడిచి కిటికీ రెక్కలు తెరిచింది. అలా తెరుస్తుంటే ఎంత ఆపుకుందామన్నా ఆపుకోలేని ఆవలింత తన్నుకు వచ్చింది.

కిటికీ రెక్కలు తెరిచి బయటకు చూసిన కృష్ణవేణి... శిలాప్రతిమలా, బొమ్మలా, రెప్పవే యలేనట్లుగా, అలాగే ఉండిపోయింది.

కిటికీ అవతల సుమారు నలభై గజాల అవతల ఎత్తు తక్కువగా, పిట్టగోడలా ఉన్న ప్రహరీగోడమీదనుండి కన్పిస్తోంది కృష్ణానది! అఖండ కృష్ణవేణి!

నిండుగా, గంభీరంగా, నిశ్చలంగా, మంద్రంగా!

ఆకాశంలో ద్వాదశి చంద్రుడు వెన్నముద్దలా వెలిగిపోతున్నాడు. చంద్రకిరణాలుపడి నది అంతా వెండిపూత పూసినట్లుగా తళతళ లాడిపోతోంది. వెండిదారాలు నేత వేసినట్లుగా ఉన్నాయి.

ఆ అద్భుతమయిన, అపురూపమయిన దృ శ్యం చూస్తూ ఊపిరి పీల్చడం కూడా మర్చిపో యింది కృష్ణవేణి.

అదోవిధమయిన కమ్మటి వాసన!

వానలో తడిసిన పారిజాతాలు, పున్నాగపూ లు, పొగడలు కలిసికట్టుగా వెదజల్లుతున్న సమ్మోహనసౌరభం!

వెండివెన్నెల నదిలో ప్రతిఫలిస్తూ జిగినీ వెలుగులను సృష్టిస్తోంది.

ఆ నిశ్శబ్దవాతావరణంలో, వెన్నెల జలకాలా డుతున్న కృష్ణవేణిని తదేకంగా చూస్తూ, తమ కంలో పడిపోయినట్లుగా, కిటికీ రెక్కకు తల




ఆనించి అలాగే ఉండిపోయింది కృష్ణవేణి!

అలా ఎంతసేపు నిల్చుందో తెలియదు.

కాసేపటికి, నెమ్మదిగా, మత్తుగా, కలలో నడుస్తున్నట్లుగా అడుగులు వేస్తూ వచ్చి మంచంమీద వాలిపోయింది.

పూలసౌరభం మత్తుమందు జల్లిపోతే, చల్లటి గాలి నెమ్మదిగా... జోలపాట పాడింది... మరో పదినిముషాలలో గాఢనిద్రలోకి జారిపోయింది. ఎలాంటి ఆలోచనలూ లేకుండా!

★ ★ ★

ఎక్కడో దూరంగా విన్పించీ విన్పించనట్లుగా చెవులకు లీలగా సోకుతోంది విష్ణుసహస్రనామం!

మగతగా, బరువుగా కనురెప్పలు ఎత్తి చూసింది కృష్ణవేణి.

ఎదురుగా ఉన్న కిటికీలోనుండి సూర్యకిరణాలు ఏటవాలుగా తన కాలిమీద పడుతున్నాయి.

ఒళ్ళు విరుచుకుంటూ లేవబోతుంటే... అపుడు విన్పించింది విష్ణుసహస్రనామం. దగ్గరగా! చాలా దగ్గరగా!

చప్పున మంచంమీదనుండి లేచి, జారిపోయిన పమిటను సర్దుకుంటూ కిటికీ దగ్గరకు వెళ్ళి బయటకు చూసింది.

బయట...

నుదుటిమీద, భుజాలమీద, ఛాతీమీద తిరునామాలు ధరించి, ఎర్రటి పట్టుబట్ట కట్టుకుని, అలాంటిదే భుజంమీద కూడా వేసుకుని, చేతిలో పూలసజ్జతో చెట్లదగ్గర నిలబడి విష్ణుసహస్రనామం చదువుతూ పూలు కోస్తున్నారు కృష్ణమాచార్యులుగారు.

ఆయన చేతిలో ఉన్న పూలసజ్జ పారిజాతాలు, పున్నాగలు, ఎర్రగన్నేరు, పచ్చగన్నేరు, మందారులతో నిండిపోయింది. ఆ పూలు వేణుగోపాలస్వామి ఆలయానికి తీసుకువెళ్ళి స్వామికి అర్పించడం ఆయన నిత్యవిధి. ఆయనకి కొద్ది దూరంలో ఉన్న గిలకబావి దగ్గర నీళ్ళు తోడి, జాగ్రత్తగా బిందెను నడుంమీద పెట్టుకుని ఇటు తిరిగింది ఆండాళమ్మ! ఆమెను చూడగానే చక్కటి భావం కలుగుతుంది! అపర పార్వతీదేవిలా తోస్తుంది ఎవరికయినా! పచ్చటి పసిమిఛాయ! నెరసిన జుట్టుతో వేసుకున్న జారుముడిలో మందారం, తులసిదళం! పచ్చటి నుదురుమీద ఎర్రటి బొట్టు! కొనదేలిన ముక్కుకి దానిమ్మపండు రంగు ముక్కుపుడక! మెడలో పగడాల గొలుసు, నల్లపూసలగొలుసు, కాళ్ళకు కడియాలు, చేతులకు నిండుగా ఉన్న ఎర్రగాజులు! ఆమె ముఖంలో సదా పూస్తుండే చిరునవ్వు ఆమె ముఖాన్ని ప్రకాశవంతం చేస్తుంటే, కాసిబోసి కట్టుకున్న ఎరుపు, పసుపు రంగుగల గళ్ళపట్టుచీర ఒక విధమయిన హుందాతనాన్ని ఆపాదిస్తోంది.

బురదనేలలో జాగ్రత్తగా అడుగులువేస్తూ వంటింటిలోకి వచ్చింది ఆండాళమ్మ!

ప్రహరీగోడమీదనుండి కృష్ణానది ఇపుడు బాగా కన్పిస్తోంది. సూర్యకిరణాలు నదిమీద పడి ప్రకాశవంతంగా తళతళలాడుతున్నాయి. అయితే నదిలో నీళ్ళు స్వచ్ఛంగా లేవు! అక్కడక్కడా కొంచెం ఇటుకరాయి రంగులో, వాన నీళ్ళల్లా ఉన్నాయి.

నది మాత్రం నిండుగా, పరవళ్ళుతొక్కుతూ వరద వచ్చినట్లుగా ఉంది. దూరంగా రెండు మూడు తెరచాప పడవలు కన్పిస్తున్నాయి.

కృష్ణవేణి వెనుతిరిగి, మంచంమీద అటూ ఇటూ చెదిరిపోయిన దుప్పటిని సరిచేసి హాల్లోకి వచ్చింది.

కృష్ణమాచార్యులుగారు కూడా అపుడే హాల్లోకి వచ్చినట్లున్నారు. గుడికి బయలుదేరబోతున్నారు. సహస్రనామం నెమ్మదిగా గొణుగుతున్నట్లుగా చదువుతూ, కృష్ణవేణివైపు చూసి, పలకరింపుగా నవ్వి, చేతిలో ఉన్న పూలసజ్జలో నిండుగా ఉన్న పూలను సర్దుతూ, గుడికి వెళుతున్నట్లుగా చేతితో సైగచేసి, రోడ్డుమీదకి నడిచారు.

కృష్ణవేణి పమిట నడుముచుట్టూ దోపుకుని, భుజాలమీద సర్దుకుంటూ వంటింట్లోకి వచ్చింది.

వంటింటి మధ్యలో కత్తిపీట పెట్టుకుని పెద్ద సొరకాయ తరుగుతూ కూర్చుంది ఆండాళమ్మ. ఆవిడకి కొద్ది దూరంలో కుంపటిమీద పాలు కాగుతున్నాయి. సన్నటి సెగమీద, అట్టక

ట్టినట్లుగా ఉన్న మీగడతో కాగుతున్నపాలు కమ్మటి వానన వస్తున్నాయి.

అలికిడికి తలతిప్పి కృష్ణవేణివైపు చూస్తూ, చేస్తున్న పని ఆపి నవ్వుతూ అన్నది ఆండాళమ్మ. "మంచి నిద్రే పోయినట్లున్నావే! అయినా మా ఇంట్లో నిద్ర ఎలా పట్టిందే నీకు? మా గుర,కలకి పక్కవీధిలో వాళ్ళు కూడా ఖాళీచేయాల్సిందే!"

కృష్ణవేణి కూడా నవ్వి పెరట్లోకి నడిచింది.

పావుగంటలో కాలకృత్యాలు తీర్చుకుని వచ్చి పెరటి గుమ్మంమీద కూర్చుంది కృష్ణవేణి. కృష్ణవేణి రావడం చూసి వెంటనే, చిక్కటి పాలతో కలిపిన కాఫీ పెద్ద స్టీలుగ్లాసునిండా ఇచ్చింది ఆండాళమ్మ.

గుమ్మంమీదనే కూర్చుని, నెమ్మదిగా త్రాగుతూ రోడ్డువైపు దృష్టి సారిస్తోంది మధ్యమధ్యలో అక్కడనుండి చూస్తే బయటి గేటువరకు కన్పిస్తుంది.

మనసుపరుగులు తీస్తోంది! కళ్లు ఆత్రంగా బయటకు చూస్తున్నాయి. గిరి ఈ సరికి సిటీ నుండి వచ్చి ఉండాలి! కన్నయ్య చెప్పే ఉండాలి! కాని... కాని... ఇంకా రాలేదేం!

"మీ ఆయనా అత్తగారూ బాగున్నారటే కృష్ణా! అందరూ కులాసానా?" ఆండాళమ్మ అడిగింది.

ఉలికిపాటుగా ఆమెవైపు తిరిగి "ఆ! ఆ! బాగున్నారు!" అన్నది కొంత పరధ్యాన్నంగా! ఆండాళమ్మ మళ్ళీ అడిగింది నవ్వుతూ!, "మొన్న దసరాకి నువ్వు రానేలేదు! కొత్త చీర కొన్నాడా మీ ఆయన? అది సరే! ముందు ఈ సంగతి చెప్పు!" ఏమిటన్నట్లు ప్రశ్నార్థకంగా చూసింది కృష్ణవేణి.



"ఈ సంవత్సరం ఏదయినా విశేషం చెబు తావా?"

కృష్ణవేణికి సిగ్గురాలేదు! నవ్వు అంత కంటే రాలేదు బుగ్గల్లో గులాబీలు విరబూయలేదు.

మౌనంగా తలవంచుకుంది. మళ్లీ తిరిగి ఏదో చెప్పబోతూ రోడ్డువైపు చూసిన కృష్ణవేణి కళ్ళల్లో హఠాత్తుగా గొప్ప మెరుపు! కళ్ళు మిలమిల మెరిశాయి తడిగా! గభాలున లేస్తూ చిన్నగా గొణిగింది" అన్నయ్య... అన్నయ్య వచ్చాడు!" రోడ్డుమీద నుండి లోపలికి చకచకా అడుగులు వేస్తూ హడావిడిగా వచ్చాడు గిరిధర్!

తెల్లటి ఫాంటు, మోచేతులవరకు మడిచిన గోధుమరంగు షర్ట్! మనిషి నీట్‌గా ఉన్నా ముఖం అలిసిపోయినట్టుగా ఉంది! నిద్రలేమితో అన్నట్లుగా కనురెప్పలు బరువుగా ఉన్నాయి. టెన్షన్‌కి కాబోలు ముఖం ఎర్రగా అయింది.

గిరిని చూడగానే హాల్లోకి ఒక్క అంగలో వచ్చింది కృష్ణవేణి.

గిరి నోటినుండి ఒక్కసారిగా దూకాయి మాటలు!

"కృష్ణా! నువ్వు... నువ్వు... ఒంటరిగా అసలు ఎపుడొచ్చావు? అందరూ కులాసానా? ఈ గాలివానలో... ఎందుకిలా?... నేను సిటీనుండి ఇపుడే వస్తున్నాను. రాగానే నువ్వు వచ్చావని కన్నయ్య చెప్పాడు. ఇంత హఠాత్తుగా ఈ గాలివానలో ఎందుకు వచ్చావో తెలియక, అర్థంగాక దాదాపు పరిగెత్తుకొచ్చాను! అసలు ఏమయింది?"

కృష్ణవేణి ఏం మాట్లాడలేదు. మౌనంగా తల వంచుకుంది.
చెల్లెలివైపు పరిశీలనగా రెండుక్షణాలసేపు చూశాడు గిరిధర్!

సందేహంలేదు! అక్కడ అత్తవారింట్లో ఏదో జరిగింది! ఎందుకో సంశయిస్తోంది. ఇంత మౌనంగా, ఇంత నిశ్శబ్దంగా ఎప్పుడూలేదు కృష్ణవేణి!

బరువుగా నిట్టూర్చి "పద! ఇంటికి వెళదాం" అంటూ చెల్లెలి భుజం చుట్టూ చేతులు వేశాడు.

ఇంతలో ఆండాళమ్మ పమిటచెంగుకి చేతులు తుడుచుకుంటూ వచ్చి అన్నది.

"ఉండవయ్యా! ఇపుడేగా వచ్చింది? కాఫీ తాగి వెళుదువుగాని! అంత హడావిడేమిటి?"

"లేదు పిన్నీ! ఇంకా స్నానం కూడా చేయలేదు! బాబుగారితో చెప్పు కృష్ణని ఇంటికి తీసుకు వెళ్ళానని! మళ్ళీ కలుస్తాను" ఆండాళమ్మ సమాధానంకోసం ఎదురుచూడకుండా ముందుకి అడుగువేశాడు.

అన్నయ్యతోపాటు ముందుకు అడుగువేసి, భుజాలమీద ఉన్న గిరి చెయ్యి తొలగిస్తూ ఆండాళమ్మవైపు చూసి చెప్పింది కృష్ణవేణి- "వస్తాను పిన్ని! బాబాయిగారికి చెప్పండి?"

వాళ్ళ పరిస్థితి అర్థం అయింది ఆండాళమ్మకి! ఇప్పుడు వాళ్ళని మొహమాటపెట్టి, బలవంతం చేయడం భావ్యంకాదు.

అలాగేనని తలూపి "అయితే సాయంత్రం మళ్ళీ రా గిరీ!" అన్నది.

గిరిధర్ అలాగేనంటూ తలూపాడు. ఇద్దరూ రోడ్డుమీదకివచ్చారు. వాళ్ళతోపాటు గుమ్మంవరకూ వచ్చి, వాళ్లు కనుమరుగయ్యేంతవరకు గుమ్మంలో నిల్చుని, తలుపువేసి వచ్చి వంటపనిలో పడింది ఆండాళమ్మ.

* * *

గిరిధర్!

దాదాపు గోవర్ధన పర్వతమంత బాధ్యత అతని చిన్న వయసులోనే పడింది అతని లేలేత భుజస్కంధాలపైన.

ఆ ఊరు... పల్లెటూరు. చాలా చిన్నపల్లెటూరు. ఇంకా చెప్పాలంటే కృష్ణానదికి ఆనుకుని ఉన్న లంకల్లో ఒక చిన్న లంక!

మంచి సారవంతమయిన నేల అవడంతో అక్కడివారు ఎక్కువగా కూరగాయల పెంపకం, పండ్ల పూల తోటల పెంపకం, చేపలు పట్టడంలాంటి వృత్తులమీద ఆధారపడి జీవనం సాగిస్తూవుంటారు.

అలాంటి లంకలో కృష్ణానదికి ఆనుకుని- ఎత్తుగా ఉన్న వేణుగోపాలస్వామి ఆలయం తాలూకు స్వస్తివాచకులు గిరిధర్ తండ్రి.

శేషయ్యశాస్త్రి!




# ఏరిన ముత్యాలు

★ అప్పు తీసుకునేవాడు అప్పిచ్చేవానికి దాసుడు.

-- లోకోక్తి

★ యజమానికన్నా అప్పులవాడికి ఎక్కువ భయపడాలి. యజమానికి మన శరీరం మీదే అధికారం ఉంటుంది. కానీ అప్పిచ్చిన వాడికి మన గౌరవం మీద కూడా అధికారం ఉంటుంది.

-- విక్టర్ హ్యూగో

★ ఒక్కసారి వచ్చి మళ్లీ వెళ్లని అతిథి అప్పు.

-- ప్రేంచంద్

★ అప్పు ఆనందంతో మొదలై బాధతో ముగుస్తుంది.

-- మాలీయర్

★ ఈరోజు అవకాశం జారవిడుచుకుంటే రేపూ అంతే అవుతుంది. మరింత సోమరితనం పెరుగుతుంది.

-- షేక్స్పియర్

★ విజయం మనం విడిదిచేసే ప్రదేశం. సాహసం ఆ గమ్యస్థానానికి మార్గం, అవకాశం ఆ మార్గానికి ఇరువైపులా నీడనిచ్చే చెట్లు.

-- ఎమర్సన్

★ జీవితంలో విజయం సాధించాలంటే, వచ్చే ప్రతి అవకాశాన్ని వినియోగించుకొనేలా ఉండాలి.

-- డిజ్రాయిలి

★ అనుకరణ అన్నిటికంటే నిష్కపటమైన ముఖస్తుతి.

--కోల్టన్

★ తోడేలు నక్కను పోలిఉన్నట్టే, పొగిడేవాడు స్నేహితుని వలె ఉంటాడు.

-- ఆంగ్ల సామెత

★ మనకు ఆలోచనాశక్తి ఉన్నదని అనుకుంటాం. వివేచనా పటిమ ఉన్నదని గర్విస్తాం. కాని దేన్నైనా మన అనుబంధం, అనుభూతి అనే రంగుటద్దాల ద్వారానే చూడగలుగుతాం.

-- నార్ల

★ వానలాగా ప్రజల హృదయాల్లో వర్షించి కొత్తభావాల బీజాలు చల్లేదే కవిత్వం.

--శ్రీశ్రీ

★ తనకీ ప్రపంచానికీ సామరస్యం కుదిరేదాకా కవి చేసే అంతర్బహిర్ యుద్ధరావమే కవిత్వం.

--చలం

★ ఒక వ్యక్తి పాపాలు చేసి డబ్బు సంపాదిస్తాడు. దానిని కుటుంబసభ్యులంతా అనుభవిస్తారు. అయితే పాపాలకు ఫలితం మాత్రం అతనొక్కడే అనుభవిస్తాడు.

— మహాభారతం

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఫిబ్రవరి చతుర నవల **కృష్ణాతరంగాలు** ............

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

ఆయన భార్య పార్వతమ్మ!

ఒకడే కొడుకు గిరిధర్!

గిరిధర్ పదవయేట.

ప్రతీయేటా జరిగే స్వామివారి ఉత్సవాల ఊరేగింపులో స్వస్తివాచకం పలుకుతున్న శేషయ్యశాస్త్రి హఠాత్తుగా గుండెపట్టుకుని పక్కకి పడిపోవడం. మరి నాలుగురోజులలో అది పక్షవాతంలోకి దారితీయడం. వాళ్ళ జీవితాలలో గొప్ప కుదుపు.

అప్పటికి కృష్ణవేణి పుట్టి మూడు సంవత్సరాలు.

ఆ షాక్‌కి తట్టుకోలేక సగం దిగులుతో రెండు సంవత్సరాలలోనే శేషయ్యశాస్త్రి కాలం చేయడం అన్నింటికి మించి పెద్ద దెబ్బ!

అప్పుడు వాళ్ళ పరిస్థితి నదిమధ్యలో చుక్కాని లేని నావలా తయారయింది. స్వస్తివాచకులకి ఈనాముకింద ఇచ్చిన పొలంమీద కొంత ధాన్యం వస్తున్నా అంతంత మాత్రంగానే ఉండేది.

అలాంటి దిక్కుతోచని, పరిస్థితులలో వాళ్ళకి అండగానిలిచి వాళ్ళ జీవితాలకు ఒకదారి చూపించి, ఎప్పటికప్పుడు ధైర్యం చెబుతూ కొండలా మళ్ళీ జీవితంలోని పెనుతుఫానుకి అడ్డుగా నిలిచిన వ్యక్తి కృష్ణమాచార్యులుగారు!

అప్పటికీ, ఇప్పటికీ ఎప్పటికీ... ఆ కుటుంబానికి హితుడు, సన్నిహితుడు, మిత్రుడు, గురువు... అంతకంటే దైవం... అంతటి బలీయమయిన బంధం వాళ్ళది!

సాంప్రదాయకమయిన వైష్ణవ కుటుంబంలో పుట్టి, తండ్రినుండి వంశపారంపర్యంగా వచ్చిన ఈ అర్చకత్వాన్ని బాధ్యతగా, భక్తిశ్రద్ధలతో స్వీకరించిన కృష్ణమాచార్యులుగారు నిజానికి దైవప్రతినిధి అయినా, ఆ ఊరివారికి దైవసమానులే! ఒక మాటలో ఆ ఊరికే పెద్దదిక్కు.

మంచిరోజు చూడాలన్నా ముహూర్తం పెట్టాలన్నా తిధివారనక్షత్రాలు లెక్కవేయాలన్నా గోచార గ్రహచారాలు పరిశీలించాలన్నా మంచిమాట లేదా మంచి సలహా ఇవ్వాలన్నా పెద్దరికంగా వ్యవహరించడం, మధ్యవర్తిత్వం చేయడం, వ్యవహారం నడపడం...లాంటి అన్నిపనులూ ఆయన చేతిమీదుగా జరగవలసిందే.

వారి నాన్నగారు బ్రతికిఉన్నరోజుల్లో ధనుర్మాసంలో తెల్లవారుజామునే తండ్రీకొడుకులు కలిసి చదివే విష్ణుసహస్రనామాన్ని వినితీరాలంటారు ఊరివారు.

ఆయన ఎంత ఖచ్చితమంటే ఉదయమే గుడిలో ఆయన కొట్టేగంట ఆ ఊరివారికి గడియారపు గంటలా విన్పించేది. క్రమం తప్పకుండా నిత్యవిధిని ఆయన అలా సాగిస్తూ వస్తున్నారు.

ఆయన భార్య ఆండాళమ్మ ఆయనకి మంచి చేదోడువాదోడు. వాళ్ళకి పిల్లలు పుట్టకపోయినా ఏనాడూ వాళ్ళ ముఖాల్లో అలాంటి అసంతృప్తి ఈషణ్మాత్రమయినా తొంగిచూడలేదు.

ఆ గుడిలోనే స్వస్తివాచకులుగా ఉండే శేషయ్యశాస్త్రితో మంచి సన్నిహితం కృష్ణమాచార్యులుగారికి.

రోజూ సాయంత్రంవేళల్లో శేషయ్యశాస్త్రి వచించే మంత్రపుష్పానికి కృష్ణమాచార్యులుగారు కూడా గొంతు కలిపితే కృష్ణానది సైతం పులకించి పరవళ్ళుతొక్కేది.

చిరుగాలి సైతం సంతోషంగా చిరుగంటలను గణగణలాడించి తనవంతు కర్తవ్యాన్ని నెరవేర్చేది!

అలాగే శేషయ్యశాస్త్రి కుటుంబంతో కూడా మంచి సాన్నిహిత్యం ఉండేది! చాలాసార్లు ఆర్థికపరమయిన ఇబ్బందుల్లో ఆదుకున్నాడు కృష్ణమాచార్యులుగారు.

ఆ సంగతి ఒక్క శేషయ్యశాస్త్రికే తెలుసు!

శేషయ్యశాస్త్రి పోవడం- కృష్ణమాచార్యులుగారికి స్వంత తోబుట్టువు పోయినట్లుగా అన్పించింది.

భర్తపోయి శోకసముద్రంలో మునిగిపోయిన పార్వతమ్మకి, కృష్ణమాచార్యులగారి ధైర్యవచనాలే కొండంత అండగా నిలిచేవి.

ఆయన సలహామీదనే... మొదట విశాలంగా ఉన్న పెరడుని చదునుచేసి ఇంటిచుట్టూ కూరగాయలపాదులు వేశారు.

రోజూ వాటికి పాదులుచేస్తూ ఉంటే పార్వత

మ్మకి కాని, కడవలతో నీళ్లుపోసే గిరిధర్‌కి కాని తెలియదు.

అదే కొన్నాళ్ళకు వాళ్ళకి జీవనోపాధి అవుతుందని.

గిరి ఒకవక్క తోటపని చూసుకుంటూనే, అతికష్టంమీద ఇంటర్‌మీడియట్ పూర్తిచేయ గలిగాడు! ఆర్థిక దుస్థితివలన ఆపైన ఇంక చదవలేక వదిలేశాడు. పూర్తిగా తోటపనిలో పడిపోయాడు.

అదీగాక తల్లి ఎక్కువ శ్రమ తీసుకోలేకపోతోంది. ఏకొన్త పనిచేసినా విపరీతంగా ఆయాస పడేది. ఎదుగుతున్న చెల్లెలు. ఇవన్నీ చూస్తుంటే చదవాలన్న ఉత్సాహం పోయింది గిరిధర్‌కి!

కాని, కృష్ణమాచార్యులుగారు ఊర్కోలేదు. పట్టుపట్టారు. బలవంతంగా డబ్బు సహాయం కూడా చేయడంతో గిరి డిగ్రీ పూర్తిచేశాడు.

తర్వాత ఒక సంవత్సరం ఖాళీగా ఉండి, హైదరాబాద్‌లో ఏదో ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగం చేసినా, నచ్చక మానేసి మళ్ళీ ఉన్న ఊరికే వచ్చేశాడు.

తర్వాత... సిటీలో ఉన్న బాంకునుండి అప్పు తీసుకుని- పూర్తిగా కూరగాయల పెంపకంమీదనే దృష్టి సారించాడు.

వాళ్ల పొలంపక్కనే మరికొంత స్థలంకొని అక్కడే తోటవేసి బాగా విస్తరింపచేశాడు.

అతడి కృషి... అతను ఊహించిన దాని కంటే ఎక్కువ ఫలితాలనివ్వసాగింది.

కృష్ణమాచార్యులగారికి పిల్లలు లేకపోవడం, మొదటినుండీ వీళ్ళ కుటుంబంతో సాన్నిహిత్యం ఉండటం, ఆయనకు గిరిమీద వాత్సల్యం పెంపుచేశాయి. చిన్న వయసులోనే బాధ్యత నెత్తిమీద వేసుకుని సంసారాన్ని ఒక క్రమపద్ధతిలో నడుపుతూ చెల్లెల్ని చదివిస్తూ అహర్నిశలు కష్టపడుతున్న గిరిధర్ అంటే ఆయనకు ఎంతో ఇష్టం!

మరో రెండు సంవత్సరాలకి పార్వతమ్మ కూడా పోయింది, అన్నాచెల్లెళ్లను అనాథలను చేసి!





అయినా గిరిధర్ చలించలేదు.

బాధ్యతలు అతని వ్యక్తిత్వాన్ని సానపెడితే, అనుభవాలు అతని చలించని గుండెధైర్యాని కి ఉక్కుకవచంలా నిలిచాయి. కష్టాలు కృష్ణాతరంగాల్లా అతన్ని చుట్టుముట్టగా సుడిగుండాల్ని సైతం అవలీలగా అవతలకు నెట్టేసేస్థితికి చేరుకోగలిగాడు.

తల్లిపోయాక, మరింత బాధ్యతగా కృష్ణవేణిని కంటికిరెప్పలా కాయసాగాడు. ఏ అవసరం వచ్చినా కృష్ణమాచార్యులుగారు పితృవాత్సల్యంతో సలహాలు ఇస్తూ ఉంటారు. గిరిధర్ కూడా ఆయనను సంప్రదించకుండా ఏ పనీ చేయడు.

ఉత్సాహం, ఉత్తేజంతోపాటు, పట్టుదల తొణకిసలాడే కళ్లు, విశాలమయిన నుదురు, చిందరవందరగా నుదుటిమీదికి పడే జుట్టు, కొంచెం లావుగా ఉండే ముక్కు, సాధారణమయిన ఎత్తు లావుగా ఉన్నా ధృఢమయిన శరీరం, చామనఛాయగాఉండే అతనిలో అందరినీ కట్టిపడేసేది, అతని నవ్వు!

గిరిధర్ నవ్వితే, రెండుబుగ్గలూ సొట్టలు పడటంతో పాటు, అందమయిన పలువరస తళుకుమనే అతని నవ్వు చాలా బాగుంటుందని అతనికీ తెలుసు!

అతను నవ్వుతుంటే హాయిగా అన్పిస్తుంది. కల్మషంలేని ఆ నవ్వు చూస్తుంటే చక్కటి అనుభూతి కల్గుతుంది.

కాని...

అతని జీవితంలోని ఒడుదుడుకులూ, అనుభవాలు, అనుభూతులూ అతను గంభీరంగా ఉండటాన్నే ఎక్కువగా అలవాటు చేశాయి.

అతని జీవితంలో అత్యధికంగా ప్రేమించేది తల్లి తర్వాత, చెల్లి కృష్ణవేణిని! గిరిధర్‌కి తెలుసు! చిన్నప్పుడే తండ్రిని పోగొట్టుకుని, కష్టాల ఉయ్యాలలో ఊగినలాడిన ఆమెకు ఏ ముచ్చటా తీరలేదని! వయసు వస్తున్న తరుణంలోనే తల్లి దూరమవడంతో తట్టుకోలేక ఒక్కసారిగా బావురుమంటూ గట్టిగా తనని పెనవేసుకుపోయి, పెనుతుఫానులో వణికిపోతున్న చిగురుటాకులా, ఆలంబనకోసం తనని హత్తుకుపోయి గుండెలమీద

తలపెట్టి వెక్కివెక్కి ఏడుస్తున్న ఆ దృశ్యం ఎలా మరిచిపోగలడు?

తనతోపాటు, కడవ తీసుకుని, అంచులు చిరిగిన పరికిణీ పైకి దోపుకుని వెలిసిపోయిన ఓణీని చుట్టూ తిప్పి నడుముదగ్గర బిగించి, మౌనంగా మొక్కల మధ్య తిరుగుతూ, నీళ్లుపోస్తూ కలుపుతీస్తూ, చెట్లకు, మొక్కలకు పాదులు తీస్తూ, ఎర్రటి ఎండలో నుదుటపట్టిన చెమటను నుతారంగా అద్దుకుంటూ, ఆయాసంగా చెట్టుకి ఆనుకుని ఒక్కక్షణం కళ్ళు మూసుకుని అలుపు తీర్చుకుంటూ నిల్చుండిపోయే ఆ దృశ్యం ఎలా మర్చిపోగడు?

కాని, అతని భయం ఒక్కటే!

స్మృతుల తాలూకు ఆలోచనలు, పడిన కష్టాల తాలూకు చేదునిజాలు ఆమె హృదయాన్ని కరడుకట్టించకూడదు! ఆప్యాయత, అనురాగం అలాగే వెల్లివిరుస్తూ ఉండాలి!

మనసులో మరో భావం రాకూడదు!

అందుకే గిరిధర్ సాధ్యమయినంతవరకు కృష్ణవేణిని తోటపనినుండి తప్పించాడు. కృష్ణవేణిని శారీరకశ్రమకు ఆమడదూరంలో ఉంచాలన్నదే అతని ధ్యేయం.

పెళ్ళి కావల్సిన పిల్ల! ఎండలో కందిపోతే ఎలా?

అయినా ఇపుడా అవసరం కూడాలేదు. వ్యాపారం కూడా ఒక క్రమపద్ధతిలోకి వచ్చి, బాగా విస్తరించింది. మొదటినుంచి అతనికి చేదోడు వాదోడుగా ఉండే కన్నయ్యని, మరి ఇద్దరిని కూలీలుగా తీసుకుని మరింత అభివృద్ధిపథంలోకి అడుగిడసాగాడు.

కృష్ణవేణి ఇంటిపనులతోనే కాలక్షేపం చేసేది.

గిరిధర్ కార్యక్రమం ఉదయం అయిదు గంటలకు ప్రారంభమవుతుంది. అతను అన్ని పనులూ పూర్తిచేసుకుని తోట దగ్గరకు వెళ్లేసరికి కూలీలు కూరగాయలు కోసి గంపలకెత్తి సిద్ధంగా ఉంచుతారు. తాజాగా, నవనవలాడుతూ ఉన్న కూరగాయల బుట్టలను, బస్తాలను లెక్క చూసుకుని కూలీల సాయంతో రేవుకు చేర్చేసరికి పడవవాళ్లు లంగరెత్తి సిద్ధంగా ఉంటారు.

రేవంతా సందడిగా ఉంటుంది. నది ఒడ్డు మెట్లన్నీ కూరగాయల బుట్టలతో నిండిపోయి ఉంటాయి.

గంపలు, బస్తాలు పడవలో చేర్చి తను ఒకవైపు కూర్చుంటాడు. ప్రత్యూషవేళ! చల్లటి నదిపైనుండి వచ్చే పిల్లతెమ్మెరలు! నెమ్మదిగా, ఉయ్యాలలా ఊగుతూసాగే నావ!

ఏరోజుకారోజు కొత్తగా అన్పించే ఆ అనుభూతి, వింతగా కన్పించే ఆ ప్రకృతి అంటే గిరిధర్‌కి ఎంతో ఇష్టం.

మిగతా పడవలలో వాళ్లు గలగలా మాట్లాడుకుంటున్నా గిరిధర్ మాత్రం మౌనంగా ధ్యానముద్రలో ఉన్నట్లుగా, ప్రకృతిలో మమేకమై అలాగే ఉండిపోతాడు పడవ అవతలి రేవును తాకేంతవరకు!

అక్కడ దించిన ఈ గంపలూ, గోతాములూ లాగుడురిక్షాల సాయంతో సిటీమధ్యలో ఉన్న పెద్ద మార్కెట్‌కి చేర్చేసరికి పూర్తిగా తెల్లవారుతుంది.

మార్కెట్లో ఏజెంట్ల కూరగాయల పాట, డబ్బులెక్క చూసుకోవడం, ఇవన్నీ అయ్యేసరికి ఎనిమిది అవుతుంది. అక్కడ ఆ పని పూర్తిచేసుకుని, సిటీలోకి వెళ్ళి ఏవయినా ఎరువులూ అవీ కావాలంటే కొనడం, లేదా తెలిసిన వాళ్ళ ద్వారా పెళ్లిళ్లు, పెద్ద పెద్ద ఫంక్షన్లు లాంటివి ఏమయినా జరుగుతూవుంటే డైరెక్టుగా వాళ్ళకు కూరగాయలు, సప్లయ్‌చేసే ఒప్పందాలు చేసుకోవడం. అన్నీ అయినాక వెంటనే వెనక్కు తిరిగివచ్చి మళ్ళీ తోటపనిలో పడటం! ఇదీ అతని దినచర్య.

అదంతా ఒక క్రమబద్ధంగా ఉండేలా అతనే అలవాటు చేసుకున్నాడు.

ఇంతపని ఒత్తిడిలోనూ కనీసం రోజుకు పదినిముషాలయినా కృష్ణమాచార్యులుగారితో ముచ్చటించనిదే గిరికి రోజు గడిచినట్లుకాదు. మధ్యమధ్యలో కృష్ణమాచార్యులుగారు కూడా ఏవయినా కావాలంటే గిరిధర్‌చేత సిటీనుండి తెప్పించుకోవడం కూడా కద్దు.

ఇంతక్రితం అయితే అడపాదడపా ఆయనే సిటీకి వెళ్ళి వస్తుండేవారు. కాని... వయసుపై



బడుతోంది. అంతటి ఓపికా తగ్గుతోంది. శరీర ధారుఢ్యంలోపిస్తోంది. కళ్ళల్లోని తీక్షణత తగ్గింది.

రేపు వచ్చే కృష్ణాష్టమికి యాభయి నిండి యాభయిఒకటి వస్తాయి మరి!

ఏదయినా వాళ్ళ జీవనవిధానాలు, అనుబంధాలు అన్నీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కృష్ణానదితో బలీయంగా ముడివేసుకుపోయాయి.



ఆరోజు ఉదయం కృష్ణవేణిని తీసుకువెళ్లిన గిరిధర్ మళ్ళీ ఆ సాయంత్రం తోటవనికికాని, కృష్ణ ఒడ్డుకుకాని, కనీసం కృష్ణమాచార్యులు గారి దగ్గరకు కాని రాలేదు.

మర్నాడు ఉదయం!

కూర్లగంపలు, బస్తాలు పడవలకెత్తి, సిటీలో మార్కెట్ పనిముగించుకుని వెంటనే తిరిగి వచ్చేశాడు గిరిధర్.

చూస్తేనే తెలుస్తోంది. ఎప్పటివలె- అతని ముఖం ఉత్సాహంగా, కాంతివంతంగా లేదు.

ముఖం వడలిపోయినట్లుగా అయింది. కళ్లు ఉబ్బినట్లుగా ఎర్రగా ఉన్నాయి.

పడవరేవులో కన్నయ్య పలకరించబోయాడు కాని, గిరి అన్యమనస్కంగా సమాధానం చెప్పడంతో మళ్ళీ కదిలించలేదు.

పడవదిగి నరానరి గుళ్ళో అడుగుపెట్టాడు.

కాని, పైమెట్టుమీదనే ఆగిపోయాడు.

గుడి, ముందరి మండపమంతా భక్తులతో రద్దీగా ఉంది.

పట్టుచీరలు కట్టుకుని బారులుతీర్చి నించున్న ఆడవాళ్ళూ, మరొకవైపు భక్తితో చేతులు జోడించి నించున్న మగవాళ్లూ, వాళ్ళ మధ్యన ఆ ఊరి మోతుబరి రైతునాయుడుగారు. పట్టుపంచె కట్టుకుని, చొక్కాలేని ఛాతీమీద పట్టు ఉత్తరీయం నిండుగా కప్పుకుని, పక్కనే ఉన్న భార్యతో మాట్లాడుతూ- మధ్య మధ్యలో దేవుడివైపు తిరిగి ధ్యాన నిమగ్నులవుతున్నారు.

గిరిధర్ చిన్నగా నిట్టూర్చాడు.

నాయుడుగారు పూజ చేయిస్తున్నట్లున్నారు. కృష్ణమాచార్యులుగారు, ఆ పనిలోనే గర్భగుడిలో నిమగ్నమయివున్నారు.

గంభీరంగా, స్పష్టంగా, ఉచ్ఛ స్వరంతో ఆయన ఉచ్ఛరిస్తున్న మంత్రాలు ధ్వజ స్తంభంవరకూ విన్పిస్తున్నాయి.

కృష్ణచార్యులగారితో ఏవేవో చెప్పుకోవాలని, ఆయన ధైర్యవచనాలతో ఊరడిల్లాలని, పని గబగబా ముగించుకుని పరిగెత్తుకొచ్చిన గిరిధర్ కాళ్ళకు బంధం వేసినట్లయింది.

ఎన్నడూ అతను ఇంతగా అధైర్యపడలేదు. ఇంతగా చలించలేదు.

తలవంచుకుని, మోచేతి వంపులో తలదాచుకుని, గద్గద స్వరంతో కృష్ణవేణి చెబుతున్న మాటలే మరీ మరీ గుర్తుకు వస్తున్నాయి.

"నేనేం పాపం చేశాను? నేనేం పాపం చేశాను?"

నిలదీసి ప్రశ్నిస్తున్నట్లుగా ఉంది! మొరపెట్టుకుంటున్నట్లుగా ఉంది. దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తున్నట్లుగా ఉంది.

అక్కడనించో లేనట్లుగా గబగబా మెట్లుదిగి రేవు ఒడ్డుకువచ్చాడు.

తోటకు వెళ్ళాలనిపించడంలేదు.

ఏంచేయాలి? ఎవరితో చెప్పుకోవాలి ఈ బాధ?

ఎవరితో పంచుకోవాలి?

మెదడంతా స్తబ్దంగా ఉంది.

నించోలేనట్లుగా గట్టుమీదే కూలబడినట్లుగా కూర్చుండిపోయాడు. పక్కనే గుట్టపోసినట్లుగా ఉన్న రాళ్ళలోనుండి ఒక్కక్కటే తీసి

నదిలోకి విసురుతూ అది సృష్టించే తరంగాల ను చూడసాగాడు.

దృష్టి అయితే అక్కడ ఉందికాని, మనసె క్కడో తిరుగుతోంది.

మొద్దుబారిపోయిన మెదడులో, ఒక్కసా రిగా వేలవేల తేనెటీగలు ఝుంకారం చేస్తూ ఎగురుతూ కల్లోలం సృష్టిస్తున్న భావన!

పడవలవాళ్ళు, బట్టలు ఉతుక్కోడానికి వచ్చినవాళ్ళు, కొంచెం దూరంగా మంచినీళ్ల బిందెలు భుజానికెత్తుకుంటున్నవాళ్ళు, నదిలో స్నానం చేస్తున్నవాళ్లు ఆశ్చర్యంగా చూ శారు గిరివైపు.

గిరిధర్‌ని ఆ సమయంలో, అలా అన్యమన స్కంగా... సాలోచనగా, తీరుబాటుగా కూర్చుని ఉండటం వాళ్ళు ఎప్పుడూ చూసి ఉండలేదు.

అందరి మెదడులో ఒకేప్రశ్న ఉద యించింది, "ఏం జరిగింది?"

అందరి దృష్టి తనమీదే పడటం కాస్త ఆలస్యంగా గమనించాడు గిరిధర్! ఇక అక్కడ కూర్చోదలచుకోలేదు.

లేచి వెనక్కి తిరిగి తలెత్తి గుడివైపు చూశా డు.

భక్తులు ఇంకా ఉన్నారు. గుడిలో గంట గణగణ మోగుతోంది. అయితే, పూజ ఇంకా అయినట్లులేదు.

నోళ్లు తెరుచుకుని వింతగా చూస్తున్న మను మల్ని దాటుకుంటూ, జారుతున్న పాకుడు రాళ్ళమీద జాగ్రత్తగా నడుస్తూ, తీరం వెంబడి నడక సాగించాడు. తాపీగా, ఫాంటుజేబుల్లో చేతులు పెట్టుకుని, తలవంచుకుని తీరం వెంబడి నడుస్తూ వెళుతున్న గిరిధర్‌ని ఆశ్చ ర్యంగా చూస్తూ ఉండిపోయారు రేవులోవాళ్లు.

నడుస్తున్నాడు.

రేవులో మనుషులు దాటిపోయారు.

అక్కడక్కడా కట్టివున్న పడవలని కూడా దాటుకుంటూ నడుస్తున్నాడు.

కాళ్ళకు అడ్డువచ్చిన రాళ్ళను తన్ను కుంటూ నడుస్తున్నాడు.

కాళ్ళకింద మెత్తటి ఇసుక స్పాంజిలా ఉంది.

ఇసుకలో పాదాలు ఇరుక్కుపోయి అడుగు లు త్వరగా పడటంలేదు.

రేవుదాటి చాలా దూరం వచ్చేశాడు తనకు తెలియకుండానే!

గిరికి ఎదురుగా, ఒకవైపు 'వి' ఆకారంలో ఇసుకలో కూరుకుపోయినట్లుగా పడివున్నాయి రెండు నాటుపడవలు.

వాటిని కూడా దాటబోతుంటే...

అప్పుడు విన్పించింది. ఆ పిలుపు తరంగా లు... తరంగాలుగా...

"హలోవ్..."

చప్పున ఆగిపోయాడు!

తననేనా పిలుస్తున్నది? తలతిప్పి చూశా డు.

పడవల మధ్యనుండి రాజహంసలా నడిచి వస్తోంది ఆ యువతి!

మళ్ళీ అంది చిన్నగా "హలో!"

సంభ్రమంగా చూశాడు ఆ యువతివైపు.

ఆకాశం రంగుచీరకు, ముదురునీలం బోర్డర్! అదేరంగు 'వి'నెక్ జాకెట్! మెళ్ళో సన్నటి గొలుసు. చెవులకు గాలి తాకిడికే అల్లల్లాడుతూ ఊగేజూకాలు, లూజుగా అల్లు కున్న జడలో, చెవిపక్కగా పెట్టుకున్న తెల్ల రంగు గులాబీ, కనుబొమల మధ్యన ఎర్రటి బొట్టు, మెడలో వ్రేలాడుతున్న కెమేరా, భుజా నికి వ్రేలాడుతున్న హేండ్‌బాగ్... వెరసి...

"సంధ్యా! నువ్వా!" ఆశ్చర్యంగా అన్నాడు గిరి.

చిన్నగా నవ్వింది "ఆహా! అయితే ఈ లోకంలోనే ఉన్నారనమాట!"

"అబ్బే! నిన్ను ఇక్కడ సడెన్‌గా చూసేసరి కి..."

"ఆశ్చర్యపడవలసింది మీరు కాదు! నేను. ఎందుకంటే, నేను ఏ సమయంలో ఎక్కడ కన్పించినా వింతేమీ లేదు. కాని ఈ సమ యంలో తీరుబాటుగా అందునా ఊరికి దూ రంగా ఇక్కడ, ఒంటరిగా మిమ్మల్ని చూ స్తుంటే ఆశ్చర్యమేకాదు... అనుమానంగా కూడా ఉంది" కొంచెం చిలిపితనం మేళ వించి నవ్వుతూ అంది.

గిరి కూడా నవ్వేసి చెప్పాడు. "అబ్బే! ఏనేమీలేదు. అదీకాక... మనసు కూడా బాగా లేక" అతనితోపాటు చేతులు కట్టుకుని నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తున్నట్లుగా నడుస్తున్న సంధ్య చప్పున ఆగిపోయి, చివ్వున అతని వైపు తిరిగి అడిగింది.

"మనసు బాగుండకపోవడమా! అదేమిటి? ఏం జరిగింది!"

గిరి సర్దుకుంటున్నట్లుగా అయి అన్నాడు, "నా సంగతి సరే! మీరేమిటి? ఇంత ఉదయమే"

"ఓ! అదా? పడవలవాళ్ళని ఇంటర్వ్యూ చేద్దామని ఉదయమే వచ్చాను. కాసేపు ఆగితే దొరకరు! నదిమీదకి వెళ్ళిపోతారు. వాళ్ళ జీవన విధానం, వృత్తి తదితరులు తెలుసుకుందామని"

"ఆహా!!" అని ఊర్కుండిపోయాడు గిరిధర్.

అతని అనాసక్తిని గమనించింది సంధ్య!

అంతేకాదు! అతనేదో తీవ్రమయిన సమస్య గురించి మధనపడుతున్నట్లుగా పడగాడ్పు కొట్టినట్లుగా ఉన్న అతని ముఖమే చెబుతోంది.

హఠాత్తుగా అడిగింది సంధ్య.

"మీకు ఇప్పుడు ఏనేమయినా ఉందా?"

లేదన్నట్లుగా తలూపి "ఎందుకు?" అనడిగాడు.

"అహ! వేరే ఏమీలేదు. నాకు చాలా బోర్‌గా ఉంది. కాసేపు అలా నడుద్దామా?" దూరంగా కన్పిస్తున్న మామిడి తోటవైపు వేలుపెట్టిచూపిస్తూ అన్నది. గిరి ఒక్కక్షణం ఆగి వాచివైపు చూశాడు. ఏదో ఆలోచిస్తున్నవాడిలా వెనక్కితిరిగి చూశాడు.

రేవుదాటి చాలాదూరం వచ్చేశారు.

రెండుక్షణాలుఆగి "సరే! పదండి" అన్నాడు అడుగులవేగం హెచ్చిస్తూ!

"అరె! ఎందుకంత తొందర? నెమ్మదిగా నడవండి" అతనిని అందుకోలేక వెనకపడిపోయి అన్నది సంధ్య!

నవ్వుతూ అలాగేనని తలూపి నెమ్మదిగా నడవసాగాడు.

ఆ ప్రాంతంలో ఎక్కడా మనుషుల అలికిడి లేదు.

నదిమీదుగా చల్లటి గాలి వీస్తోంది.

కుడిచేతివైపు పొలంలో విశాలంగా, కనుచూపుమేర విస్తరించుకుని ఉన్నాయి దోసపాదులు. ఆకుపచ్చటి ఆకుల మధ్యనుండి బంగారు ముద్దల్లా తొంగిచూస్తున్నాయి దోసపళ్లు.

ఆ పరిసరాలు ఎంతో అద్భుతంగా, అందంగా, కంటికింపుగా ఉన్నాయి.

గిరిధర్‌కి సంధ్య సంవత్సరన్నరక్రితం పరిచయస్థురాలు. సంవత్సరం క్రితం స్నేహితురాలు. ఆరునెలలనుండి ఆ స్నేహం మరింత బలపడింది.

సంధ్య సాన్నిహిత్యం గిరికి ఎంతో తృప్తినిస్తుంది. ఆలోచిస్తూ నడుస్తున్నాడు. అందుకే అది పల్లెటూరయినా, ఆమెతో కలిసి, అలా తీరంవెంబడి సాగిపోతుంటే ఎవరి గురించీ ఆలోచించదలచుకోలేదు. అక్కడ కూడా పొలంలో పనిచేసుకుంటున్నవాళ్ళు, జాలర్లు తామిద్దరిని చూస్తే చూసి ఉండవచ్చుగాక! చూడనీ!

పల్లెటూళ్ళల్లో త్వరగా వ్యాపించే అర్థంలేని పుకార్లను తను పట్టించుకోడు.

నిజంగా... సంధ్య పక్కన నడుస్తుంటే ఆ పరిసరాలకే కొత్త అందం వచ్చినట్లు, తనలో కొత్త ఉత్సాహం రెక్కలు విప్పుకుంటున్నట్లుగా ఉంది. మనసు సేదతీరుతున్నట్లుగా అన్పిస్తోంది.

"మాట్లాడండి" హఠాత్తుగా సంధ్య అన్నది అతని ఆలోచనలు చీలుస్తూ,

"ఏం మాట్లాడేది?"

"మీ ఇష్టం! ఏదయినా"

మళ్ళీ ఇద్దరి మధ్యనా నిశ్శబ్దం! ఇద్దరూ మాటలకోసం వెతుక్కుంటున్నట్లుగా ఉండిపోయారు.

అనుకోకుండా కలిసివచ్చిన ఏకాంతం మూగతనాన్నే మిగిల్చింది కాని, చైతన్యాన్ని సృష్టించలేకపోయింది.

దానికి కొంతకారణం గిరి ముభావంగా, ఆలోచిస్తున్నట్లుగా ఉండిపోవడం! మధ్యలో





గిరిధర్ ఆగాడు. పక్కనే గట్టుమీదికి పాకిన దోసపాదు మధ్యనుండి, బాగాపండి పసుపు రంగుకు తిరిగిన రెండు దోసకాయలను కోసి, వాటిని పక్కనే నదిలో కడిగి సంధ్యకు ఇస్తూ అన్నాడు.

''తిను సంధ్యా! చాలా బాగుంటాయి. లంక దోసపళ్లు''

సంధ్య నెమ్మదిగా కొరుకుతూ అంది. ''ఇంతక్రితం జాలర్లను ఇంటర్వ్యూ చేస్తుంటే నాకో అయిడియా వచ్చింది''

''అయిడియానా? ఏమిటది'' తినడం ఆపి అడిగాడు గిరిధర్!

''మిమ్మల్ని కూడా ఇంటర్వ్యూ చేయాలని... నా పద్ధతిలో'' నవ్వుతూ అన్నా ఆ నవ్వు వెనక కొంటెతనం గమనించకపోలేదు గిరిధర్.

''ష్యూర్! కాని ఇప్పుడు కాదు. నా మూడ్ బాగాలేదు''

అప్పుడు అడిగింది. ''అదిసరే! ఇప్పుడు చెప్పండి. ఈరోజు ఎందుకింత మూడీగా ఉన్నారు? అందునా ఈ సమయంలో తోటలో తప్ప బయట ఎక్కడా కన్పించనివారు... ఒంటరిగా ఇలా! చాలా పరధ్యానంగా ఉన్నారు. ఇంత క్రితం రెండుసార్లు విష్ చేసినా విన్పించుకోలేదంటే... బాప్‌రే! ఏం జరిగిందనలు?''

గలగలా జలపాతంలా దూకుతూవస్తున్న ఆమె ప్రశ్నలకు, సమాధానాలు రానివాడిలా, లేనివాడిలా ఉండిపోయాడు.

''ఏం? నాతో చెప్పకూడదా? హఠాత్తుగా ఆలోచనలోపడ్డారు. అయితే వద్దులెండి''

''నో! నో! అదికాదు. అలా తోటలోకి వెళదాం. కూర్చుని మాట్లాడుకుందాం'' దగ్గరలోకి వచ్చిన మామిడితోటవైపు చూస్తూ అన్నాడు.

సంధ్య వాచి చూస్తూ, ''దాదాపు మనం అరగంట నడిచాం'' అన్నది.

ఇద్దరూ తోటలోకి వచ్చారు.

ఏపుగా, గుమ్మటాల్లా, గుబురుగా విస్తరించుకుని ఉన్నాయి, ఓ పాతికదాకా మామిడిచెట్లు.

చెట్లనిండా ఉండాల్సిన పూత, క్రితంరోజు రాత్రి వచ్చిన గాలికి చాలావరకు రాలిపోయింది. అక్కడక్కడ తెల్లగా గుబురుల మధ్యన మాత్రం మిగిలిఉంది.

ఎక్కడా మనుమల అలికిడి లేదు.

గుబురుగా ఉన్న ఒక చెట్టుకింద హాండ్‌కర్చీఫ్ వేసి కూర్చున్నాడు గిరిధర్. అతనికి కొద్దిదూరంలో కిందకి వంగి వున్న పెద్ద కొమ్మ మీద కూర్చున్నట్లుగా నించుని వున్నది సంధ్య.

అలికిడికి కాబోలు గుబురుల్లోంచి రెక్కలు టపటపలాడించుకుంటూ రెండు రామచిలుకలు బయటకు ఎగిరివచ్చాయి.

గిరి సంధ్యవైపు చూస్తూ అన్నాడు ''అవును! మీ ఫ్రెండ్ పెళ్ళికి బందరో, గుడివాడో ఎక్కడికో వెళ్ళాలని చెప్పినట్లు గుర్తు!''

''అవును! వెళ్ళి మొన్నరాత్రే వచ్చాను!'' సంధ్య చెప్పింది.

''బాగా జరిగిందా పెళ్ళి''

''బాగా అంటే ఎలా అని మీ ఉద్దేశ్యం? ఆడంబరంగానా? అందంగానా?''

''బాగా అంటే నా ఉద్దేశ్యం ఎలాంటి గొడవలూ లేకుండా అని!''

''అయితే చాలా అసహ్యంగా జరిగింది!''

''అదేమిటి?''

''అవును! పెళ్ళయితే బాజాభజంత్రీలు, మెరిసే లైట్లు... వీటిమధ్యన చాలా అట్టహాసంగా, ఆడంబరంగా జరిగింది. కాని పెళ్ళివారి అంటే మగపెళ్ళివారి లేకి మనస్థత్వాలే అసహ్యంగా అన్పించాయి!''

''బాగా గొడవ చేశారా?''

''పోనీ మీరన్నట్లు చేసేదేదో ఆ గొడవ డైరెక్టుగా చేసివుంటే బాగుండేది! కాని అలకలు పేరుతో మూతి బిగింపులు, పంతాలు, పట్టింపులు, మర్యాదలు సరిగ్గా చేయలేదని చులకనగా మాట్లాడటం, సాంప్రదాయం పేరుతో, ఆచారం అడ్డుపెట్టుకుని హిరణ్యాక్ష వరాలు కోరి, వాటిని నెగ్గించుకోడానికి, మొండి పట్టుదలకు పోయి... ఛీ! ఛీ! వాళ్ళ వెకిలి మనస్థత్వాలు, లేకి కోరికలు చూస్తుంటే చాలా అసహ్యం అన్పించింది. వేడుక పేరుతో వెర్రి ఆగడాలు, నిజంగా నా స్నేహితురాలు, దాని తల్లిదండ్రులు మానసికంగా ఎంతటి క్షోభ ననుభవించారో ప్రత్యక్షంగా చూశాను. పోనీ

కట్నం విషయంలో ఏమయినా తక్కువా? ఆ విషయంలో బాగానే ముక్కుపిండి వసూలుచేశారు.

ఒక అమ్మాయిని తన జీవితంలోకి ఆహ్వానించడానికి తన జీవితాన్ని పంచి భాగస్వామిని చేసుకోడానికి వచ్చి ఎంతో హుందాగా, గౌరవంగా అగ్నిసాక్షిగా పదిమంది ముందు ఆ అమ్మాయిని స్వీకరించాల్సింది పోయి, ఆ పదిమందితో కలిసి జంతువులకంటే హీనంగా ప్రవర్తిస్తే ఏమనాలి? అదేమంటే సంప్రదాయం, ఆచారం! వేడుక! ఇవన్నీ చూస్తొంటే సాంప్రదాయమంటేనే చిరాకనిపిస్తోంది. సింపుల్‌గా ఏ దేవాలయంలోనో లేదా రిజిష్ట్రార్ ఆఫీసులోనో చేసుకుంటే ఎంత హాయి? ఎంత ఆదా?''

"మీ స్నేహితురాలు ఏమంటుంది?"

కొంచెం కోపంగా చెప్పింది సంధ్య "ఏమంటుంది? మధ్యతరగతి నగటు ఆడపిల్ల! మౌనంగా భరించి ఊర్కుంటుంది''

"నిజమే సంధ్యా! ధైర్యం, తెగింపూ అనేవి ఈ రోజుల్లో ఎంతమందికి ఉన్నాయి? అభ్యుదయం అనేది ఆలోచనల్లోనేకాని, ఆచరణలోకి వచ్చేసరికి అమాంతం గాలిలో కలిపేసి అట్టహాసంగా, బ్యాండుమేళం మధ్యన, మిరుమిట్లు గొలిపే లైట్లమధ్యన, గంగిరెద్దులా తల వంచి తాళి కట్టించుకోవడంతో ఆమె అభ్యుదయం పరిసమాప్తి అవుతుంది!''

సంధ్యా ఏ పేపరయినా చూడు! భార్యను తగులపెట్టిన భర్త అనే ఉంటుంది కాని, భర్తను చంపిన భార్య అనే వార్త చాలా తక్కువగా వస్తుంది. నువ్వు ఎన్ని అన్నా చెప్పు! ఎంత అభ్యుదయ మార్పయినా కానీ! ఇప్పటికీ మనది మేల్ డామినేటెడ్ సొసైటీ! కాదంటావా?''

"నిజమే!'' ఒప్పుకుంటూ అన్నది సంధ్య.

గిరిధర్ మళ్ళీ కొనసాగించాడు. "సంధ్యా! నువ్వు కొంత పెళ్ళికూతుళ్ళ గురించి మాట్లాడావు. పెళ్ళి సమయంలో వాళ్ళ మనస్తత్వాలు ఎలా రూపుదిద్దుకుంటాయో చెప్పావు. అలాగే చాలామంది పెళ్ళికొడుకుల అసలు రంగు, అసలు మనస్తత్వం కూడా బయటపడేది పెళ్ళి పందిట్లోనే! చాలావరకు ముందరే ఆరా తీసినా అసలు నైజం అప్పుడే బయటపడుతుంది. అతని అలవాట్లు, స్నేహితుల సర్కిల్, కొన్ని కొన్ని మాటలద్వారా అతని మెంటాలిటీని చాలావరకూ అంచనావేయవచ్చు. పెళ్ళిపందిట్లో నిజం తెలిసినా ఇంతవరకూ వచ్చింది ఆ మూడు ముళ్ళు పడి బాధ్యత తీరిపోతే తర్వాత అవే అన్నీ సర్దుకుంటాయని సమర్థించుకుని కళ్ళు, నోరు, చెవులు మూసుకుని, పెళ్ళి జరిపించేసేవాళ్ళు ఎంతమందిని చూడటంలేదు? బాధ్యత తీర్చుకోవడంకోసం కన్న తల్లితండ్రుల ఆరాటమది.

పెళ్ళి కాకపోవడం పాపం అనే మూర్ఖపు ఆలోచనలోనే మార్పు రావాలి ముందు. డబ్బు మనిషిని శాసిస్తుంటే సంప్రదాయం స్త్రీని శాసిస్తోంది!''

"నిజమే! గిరిధర్‌గారూ! ఏమిటీ సాంప్రదాయం? ఎందుకీ అర్థంలేని ఆచారాలు? పెళ్ళిళ్ళలో ఏమిటీ వింత పోకడలు?''

"సంధ్యా! ఆచారము, సంప్రదాయము అనేవి మన నైతిక విలువలు దిగజారకుండా మనం కట్టుకున్న ఒక అడ్డుగోడ. మనం గీసుకున్న గిరి. నీతి నియమాలకు కట్టుబాటు! కాని దురదృష్టంకొద్దీ ఆచారం మూఢాచారంకింద దిగజారి, నైతిక విలువలను నట్టేట ముంచి, మూర్ఖపు పట్టుదలలను రెచ్చగొట్టి అసలు అర్థాన్నే మార్చివేస్తోంది. ఆచార వ్యవహారాలు అనేవి సమాజమనే అద్దంలో మన నాగరికతని అందంగా చూపించగలగాలి. కాని వికృతరూపంతో, వేయి నాల్కలతో చిందులు తొక్కుతోంది. నిజంగా ఇది మన దురదృష్టం సంధ్యా! ముఖ్యంగా... ముఖ్యంగా...'' చప్పున ఆగిపోయాడు గిరిధర్!

"ఏం జరిగింది?'' ముందుకు వంగి అడిగింది సంధ్య, అతను హఠాత్తుగా ఎందుకలా ఆగిపోయాడో అర్థంకాక!

నెమ్మదిగా చెప్పాడు... "ముఖ్యగా నా చెల్లెలు కృష్ణవేణి విషయంలో...''

గొంతుకేదో అడ్డుపడ్డట్లయి ఆగిపోయాడు. హఠాత్తుగా అతని ముఖం ఎర్రబడింది.

ఇంతసేపూ అతనికి దూరంగా ఉన్న




సంధ్య గభాలున గిరిధర్‌కి దగ్గరగా వచ్చి ఏమయిందన్నట్లుగా అతని భుజంమీద చెయ్యివేసింది. మళ్ళీ అతను గమనించేలోపల చివ్వున చెయ్యి వెనక్కి తీసుకుని కొంచెం పక్కగా జరిగి అడిగింది "ఏమయింది?" అని.

పేలవంగా అన్నాడు "ఇంకా ఏమీ కాలేదు! కృష్ణవేణి ప్రస్తుతం ఇక్కడే ఉంది. మొన్న రాత్రి వచ్చేసింది. ఊహూ! కాదు, వాళ్ళే పంపించేశారు!"

"మొన్నరాత్రా? అంత గాలివానలోనా? మై గాడ్! అసలు ఏంజరిగిందట?" కళ్ళు పెద్దవి చేసి, అప్రయత్నంగా గుండెలమీద చెయ్యి వేసుకుని అడిగింది సంధ్య.

"కృష్ణవేణి పెళ్ళి విషయంలో నేను చాలా మోసపోయాను సంధ్యా! మంచి సాంప్రదాయక కుటుంబం అంటే జనరల్‌గా మనం ఏమనుకుంటాం? చెప్పు సంధ్యా! ఏ లోపమూ, ఏ మచ్చా లేని, ఏ దురలవాట్లు ఉండని మంచి పెంపకాలతో కూడిన మంచి కుటుంబం అనుకుంటాం. అవునా? కాని నా చెల్లెలి విషయంలో అక్కడే మోసపోయాను. కృష్ణవేణి అత్తవారిల్లు... అదొక మూఢాచారవు తీగలతో దట్టంగా అల్లుకుపోయిన వల లాంటిది. మా దురదృష్టంకొద్దీ అందులో నా చెల్లెలు ఇరుక్కుపోయింది. ఏమాత్రం నోరులేనిది. అసలు సరిగ్గా మాట్లాడటం కూడా చేత కాని గంగిగోవు. నా తొందరపాటు నిర్ణయం, నా చెల్లెలి జీవితాన్ని భగ్నంచేసింది!"

"గిరిధర్! ప్లీజ్! బాధపడద్దు!" అతని ముఖం చూస్తూ అనకుండా ఉండలేకపోయింది సంధ్య.

గిరి ఏం మాట్లాడలేనట్లుగా రెండు నిముషాలసేపు ఆలోచనలో మునిగిపోయాడు. కాసేపటికి ఉలిక్కిపడ్డట్లయి తేరుకుని, వాచి చూసుకుని, "బాప్‌రే! చూశారా! ఎంత టైమయిందో!" అన్నాడు.

"నిజమే! మనకు తెలీకుండానే చాలా కాలం దొర్లిపోయింది. అంతేకాదు - నాచేత పెద్దపెద్ద స్పీచ్‌లు ఇప్పించారు కూడా!" సిగ్గుగా నవ్వుతూ అన్నది.

ఎండ బాగా వచ్చింది!

నది మధ్యలో ఇప్పుడు అక్కడక్కడా పడవలు చాలా కన్పిస్తున్నాయి. జాలర్లు జోరుగా వలలను విసురుతున్నారు.

కాళ్ళకింద ఇసుకలో చెమ్మదనం తగ్గి, పొడి పొడిగా, కొంచెం వేడి ఎక్కుతూ ఉండడంతో అడుగులు త్వరత్వరగా పడసాగాయి.

కృష్ణానదిలో వాన నీరు కూడా కలవడంతో కొంచెం గోధుమరంగు మిశ్రమంతో నిండుగా, గుట్టను ఒరుసుకుని ప్రవహిస్తోంది.

నడకలో వేగం తగ్గిస్తూ, కొంచెం ఆగినట్లుగా అయి చెప్పాడు గిరిధర్ "సంధ్యా! ఇంతక్రితం అడిగావు ఎందుకంత మూడీనెస్ అని! కేవలం అదే కారణం! కృష్ణవేణి భవిష్యత్ ఎలా ఉంటుందోనని ఆందోళన!"

"అసలు ఏమయింది? భార్యాభర్తల మధ్యన ఏదయినా గొడవలు..."

"ఊహు! కాదు..." నెమ్మదిగా నడుస్తూ చెప్పసాగాడు గిరిధర్.

"సంధ్యా! కృష్ణవేణి పెళ్ళి అయి సంవత్సరన్నర కావస్తోంది. నీకు తెలిసిందేగా"

తెలుసునన్నట్లుగా తలూపి తను కూడా నెమ్మదిగా నడవసాగింది సంధ్య.

దారికి ఒకవైపు పొలంలో గాలికి అల్లల్లాడుతూ తలలూపే దోస ఆకులు... మరోవైపు గలగలా పారుతూ ఉరకలు పెట్టే కృష్ణవేణి...

రెండింటి మధ్యన... నెమ్మదిగా నడుస్తూ...

తన బాధలను, ఆవేశాన్ని ఆందోళనను వివరిస్తున్నాడు గిరి!

చెబుతూ నడుస్తున్నాడు.

శ్రద్ధగా వింటూ నడుస్తోంది సంధ్య!

అప్పటికే దాదాపు రేవువరకూ వచ్చేశారు.

రేవులో జనం అంతగాలేరు! ఎవరి పనుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

అంతా విన్నాక సంధ్య మాటలు రానట్లుగా ఉండిపోయింది. ఏం సమాధానం చెప్పాలో తోచనట్లుగా నిశ్శబ్దంగా ఉండిపోయింది.

దూరంగా కన్నయ్య వస్తూ కన్పించాడు.

గిరి ఆగిపోయి సంధ్య కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు "సంధ్యా! నిన్ను బాధపెట్టినా... నాకు

కొంత బాధ తగ్గినట్లుగా అనిపిస్తోంది. ఎంతో సేద తీరినట్లుగా ఉంది! ఎందుకంటే నీకు పంచేశానుకదా! నిజం సంధ్యా! నిన్నటినుండి నా మనసు లావాలా ఉడికిపోతోంది! ఈరోజు నువ్వు కన్పించకపోతే ఎలా ఉండేదో!''

సిగ్గు పడ్డట్లుగా నవ్వింది. ''పంచుకోవడం అనేది లేకపోతే మన స్నేహానికి అర్థంలేదు గిరీ!''

గిరిధర్ కళ్ళల్లో ఒక్కసారిగా గొప్ప కాంతి తళుక్కుమంది. మనసులో ఒక తరంగం అమాంతం ఎగసిపడి హృదయాన్ని ఉత్తేజితం చేసింది.

''గిరీ!'' అన్న ఏకవచన సంబోధం చెవులకు తియ్యగా సోకింది. అప్రయత్నంగా అతని నోటినుండి వెలువడ్డాయా మాటలు!

''సంధ్యా! నాకో మాటివ్వాలి!''

ఏమిటన్నట్లు కళ్ళెత్తి అతని కళ్ళల్లోకి చూసింది.

''ఇకనుంచి నన్ను ఎప్పుడూ ఇలాగే పిలవాలి!''

నిజమా! అన్నట్లు పెదవి బిగించి నవ్వింది.

''లేకపోతే మన స్నేహానికి అర్థంలేదు''

మధురంగా నవ్వింది సంధ్య.

అతని వెనుకగా కన్నయ్య వస్తూ కన్పించాడు సంధ్యకి!

''శెలవామరి! గుడ్‌బై!'' ముందుకు అడుగువేస్తూ అన్నది సంధ్య!

గిరి చిన్నగా విష్‌చేసి చెప్పాడు ''గుడ్‌బై!''

★ ★ ★

కన్నయ్యతో పది నిముషాలు మాట్లాడి, మళ్ళీ గుడి దగ్గరకు వచ్చాడు గిరిధర్! పూజ అయిపోవచ్చినట్లుంది. అందరూ వరుసగా అటూ ఇటూ బారులు తీరి నిల్చుంటే వాళ్ళ మధ్యన చేతిలో పళ్ళెం పట్టుకుని మంత్రపుష్పం చదువుతున్నారు కృష్ణమాచార్యులుగారు.

అందరూ చివరి మెట్టువరకూ వెళ్ళాక అప్పుడు నెమ్మదిగా తలతిప్పి చూసి లేచాడు గుడిలోకి వెళ్ళడానికి ఆయత్తమవుతూ!





అదే సమయానికి కృష్ణమాచార్యులుగారు కూడా గర్భగుడిలోనుండి బయటకు వస్తున్నారు.

గిరిధర్‌ని చూస్తూనే నవ్వి ''రా గిరీ! ఇంతక్రితమే మెట్లమీద నిన్ను చూశాను! నీకోసమే వస్తున్నాను!'' అంటూ మళ్ళీ ఏదో గుర్తుకొచ్చినట్లుగా లోపలికి వెళ్ళారు.

కృష్ణమాచార్యులుగారు చేతిలో బాదం ఆకుల్లో పెట్టివున్న దద్ధోజనం, పులిహోర ఇస్తూ ''గిరీ! ముందర ఈ ప్రసాదం తిని తరువాత మాట్లాడు!'' అంటూ ఆకులు గిరిచేతిలో పెట్టారు.

గిరి మౌనంగా ప్రసాదం తీసుకుని తిన్నాడు. ధ్వజస్థంభానికి ఒకపక్కగా ఉన్న పంపుదగ్గర చేతులు కడుక్కుని, ఫాంటు జేబులోనుండి కర్చీఫ్ తీసి చేతులు తుడుచుకుంటూ మంటపంలోకి వచ్చాడు.

కృష్ణమాచార్యులుగారు గిరివైపు చూస్తూ చిన్నగా నిట్టూర్చి అడిగారు ''ఊ! ఏమిటీ విషయం? ఇంతకీ కృష్ణవేణి అంత రాత్రివేళ, ఆ గాలివానలో పడి ఒక్కతే ఒంటరిగా... ఏం జరిగింది? నిన్న నీకోసం చాలాసేపు ఎదురు చూశాను. అసలు కలవలేదేం?''

గిరి ఆయన ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా ''ముందర నాకు ఈ సంగతి చెప్పండి బాబుగారూ!'' అన్నాడు.

చిన్నప్పటినుండి కృష్ణమాచార్యులుగారిని అలా 'బాబుగారూ!' అని సంబోధించడం అతనికి అతని తల్లి అలవాటుచేసింది. కృష్ణవేణికి కూడా అదే అలవాటయింది.

''ఏమిటది?'' కనుబొమలు ముడిచి అడిగారాయన.

ఒక్కక్షణం ఆలోచనలో పడ్డట్లయి, తర్వాత ఒక్కొక్క అక్షరమే వత్తి పలుకుతూ అడిగాడు గిరిధర్.

''అసలు ఈ మడి అంటే ఏమిటి?''

గిరివైపు ఆశ్చర్యంగా చూశారాయన. తర్వాత ఆశ్చర్యంనుండి తేరుకుని, భుజాలెగరేసి ''ఊ! పెద్దప్రశ్నే వేశావునుమా!'' అంటూ నవ్వారు.

''చెప్పండి!'' అన్నట్లు చూశాడు గిరి.

''ఎందుకు వచ్చింది నీకీ సందేహం?''

''ఎందుకంటే... నా సమస్య దాదాపు అక్కడి నుండే ప్రారంభమయింది కాబట్టి, చాలావరకు అదే కాబట్టి!'' ఆయన కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు గిరి.

''గిరీ!''

''ఔను బాబుగారూ! చెప్పండి! ముందర నా ప్రశ్నకు సమాధానం చెప్పండి! తరువాత అంతా చెబుతాను'' మొదట్లో రెట్టిస్తూ అడిగినట్లు అన్పించినా క్రమక్రమంగా అతని స్వరం పూడుకుపోయింది.

కృష్ణమాచార్యులుగారు గిరివైపు పరీక్షగా, కన్నార్పకుండా చూశారు. కాసేపటికి ఏదో అర్థమయినట్లుగా మందహాసం చేశారు.

''అయితే... కృష్ణవేణి అత్తగారింట్లో ఏదో గొడవ జరిగిందన్నమాట!''

మొదట గిరి మాట్లాడలేదు. తర్వాత కొంచెం విసురుగా సమాధానం చెప్పాడు.

''అవును గొడవే అయింది. దాదాపు దాని మీద చెయ్యి చేసుకునేటంత గొడవే అయింది!''

బరువుగా నిట్టూర్చారు కృష్ణమాచార్యులుగారు. ''నేను వింటున్నదానిని బట్టి ఇప్పుడిప్పుడే వాళ్ళ అసలు మనస్థత్వాలు నాకు అర్థమవుతున్నాయిరా గిరీ! హు! ఎప్పటికి అర్థం చేసుకుంటారు ఈ మూఢాచారపు మూర్ఖులు - మడి అంటే శుచి, శుభ్రం అని!''

''కాని... కాని వాళ్ళ దృష్టిలో మడి అంటే అంటరానితనం! నన్నంటకు నామాలకాకి పద్ధతి! కూర్చోకూడదు. నించోకూడదు. ఏమిటీ పిచ్చి? ఎందుకంత కట్టడి?''

హఠాత్తుగా గంభీరంగా అయిపోయారాయన! రెండు క్షణాలు ఏదో ఆలోచిస్తున్నట్లుగా కళ్ళు మూసుకుని ఉండిపోయారు. తర్వాత మంద్రస్థాయిలో చెప్పసాగారు... ''గిరీ! దురదృష్టం కొద్దీ ఈ మడి అనేది మరీ వెర్రితలలు వేసి అసలు అర్థమేపోయి, నువ్వన్నట్లు నన్నంటకు నామాలకాకి అయింది. అసలు పూర్వం రోజుల్లో ఈ మడి అనేది ఎందుకు ఏర్పరిచారంటావు?

దేనికయినా ఒక కట్టుబాటు, ఆచారం ఆపాదిస్తే తప్ప అర్థంకాని రోజుల్లో పుట్టింది ఈ మడి! సాంప్రదాయాన్ని రంగరిస్తే తప్ప తలకెక్కని తరంలో తలెత్తింది ఈ మడి. మడి అంటే ఏమిటని అడిగావు. మన వాళ్ల దృష్టిలో 'మడి కట్టుకున్నారు' అంటే వారిని ఎవరూ తాకకూడదు. వారు వచ్చే దారిలో తొలగి పక్కకి తప్పుకోవాలి. వారిని ప్రత్యేకంగా చూడాలి. వేరే పంక్తిన కూర్చోపెట్టాలి. ఇలాంటివి... నిజానికి అన్ని కుటుంబాలలో ఉండవలసినదీ, జరుగవలసిన క్రమమూ ఏమిటి? వేకువనే లేవడం, సూర్యోదయానికి ముందే కాలకృత్యాలు తీర్చుకోవడం, తరువాత ధ్యానం! అది ఏదయినా కావచ్చు. ఆ ధ్యానమనేది భగవంతుడిని గూర్చి కావచ్చు, లేదా మరొక అజ్ఞాత శక్తి గురించి కావచ్చు! ఏదయినా మనస్సుని కాసేపు మౌనంగా ఒక వస్తువు లేదా భగవంతుడి మీద స్థిరమయిన చిత్తంతో లగ్నం చేసి దృష్టిని దాని మీదనే కేంద్రీకరించి, కళ్లు మూసుకుని చుట్టుపక్కల పరిసరాలను క్రమంగా విస్మరిస్తూ ఆలోచనా పరిధిని విస్తరిస్తూ, భిన్నత్వంలో ఏకత్వాన్ని అనుసంధానం చేస్తూ ఏకాగ్రతని పెంపొందించుకోవడమే ఈ ధ్యానం లేదా మెడిటేషన్ లేదా యోగనిద్ర! మనసుకి ఒక విధమయిన ఎక్సర్‌సయిజ్ లాంటిది ఈ ధ్యానం.

అమలినము, ప్రశాంతము, ఆరోగ్యవంతము అయిన మనస్సుతో భగవంతుడిని ధ్యానించడమే జపం ఈ అమలినం, ప్రశాంతం, పరిశుభ్రత, ఆరోగ్యం అనేవి మనసుకే కాదు దేహానికి కూడా అనే ఉద్దేశ్యంతో మన పూర్వీకులు 'శుచిగా, శుభ్రంగా' అన్నారు. అదే మడిగా ఆచారంగా మారింది.

ఆచారాన్ని సక్రమంగా పాటిస్తున్నామనే అందమయిన ఆత్మవంచన తప్ప, అంటరానితనాన్ని ప్రోత్సహిస్తున్నామనే నిజాన్ని తెలుసుకోలేని నేటి ఈ మూర్ఖులకు అసలు మడి అంటేఏమిటో, సంప్రదాయం లోని అసలు పరమార్థమేమిటో చిత్తశుద్ధి అంటే ఏమిటో ఎన్ని జన్మలెత్తినా తెలియదు. యాదవుడైన వేణుగోపాలస్వామి పాదపూజతో పునీతురాలయిన రాధ ఏ మడికట్టుకుని పూజలు చేసింది? ఈ మడి ఇలా మూఢాచారంగా మారి

నవ్వుల పాలవడానికి కారణం మన మూర్ఖత్వం! అంతే! నిజంగా నియమనిష్టలను, మడి ఆచారాలను చిత్తశుద్ధితో పాటించేవారు ఎవరూ ఎదుటివారిని అగౌరవపరచరు! చులకన చేయరు. దూరంగా ఉంచరు. అందరినీ ఒకే దృష్టితో చూస్తారు. ఆరోగ్యానికి, ఆచారానికి మధ్యఉండే అనుబంధం తెలుసు వీరికి! ఆలోచనకు, ఆచరణకు మధ్య ఉండే గీత తెలుసు వీరికి! అదే అసలయిన వారి సంప్రదాయం. అదే సిసలయిన సదాచారం''

మొట్టమొదటిసారిగా కృష్ణమాచార్యులు గారి వదనంలో ఇంతటి ఆవేశాన్ని చూశాడు గిరి.

ఎంత చక్కగా చెప్పారు?

నిజానికి వారి ఇంట్లో కూడా మడి, నియమనిష్టలు ఉన్నాయి. కాని వాటివల్ల ఎవరూ ఇబ్బందిపడరు. కృష్ణమాచార్యుల గారింట్లో చక్కని అనుభూతి పొందడమనేది కేవలం వాళ్లింట్లోని అందమయిన ఆచార వ్యవహారాల వలనే అంటే అతిశయోక్తికాదు. అణువణువునా తొంగి చూసే సంప్రదాయం ముచ్చట గొల్పుతూ మడికి అసలు అర్థాన్ని విప్పి చెబుతున్నట్లుగా ఉంటుంది.

మడిపేరుతో, ఆచారం పేరుతో ఎదుటి వ్యక్తిని కించపరచడం, తక్కువ చేయడం అనేది ఆయన ఎపుడూ చేయలేదు. అందుకే అన్ని వర్గాలు, అన్ని కులాలవారి దృష్టిలో కృష్ణమాచార్యులు గారు నిజమయిన ఆచార్యులు.

"బాబుగారూ! ప్రస్తుతం కృష్ణవేణి అత్తగారింట్లో జరుగుతోంది అదే! ఈ ఆచారం అనేది వికృత రూపంలో విలయతాండవం చేస్తోంది. నిజంగా కృష్ణవేణి చెబుతుంటే నాకు మతి పోయింది''

"ఏమయింది, గిరీ!'' కొంచెం అలనటగా వెనక్కివాలి అడిగారాయన.

"హు! ఏముంది! కృష్ణవేణిని వాళ్లు ఎంత గానో హింసిస్తున్నారు! మానసికంగా అదెంతో క్రుంగిపోతోంది. వాళ్ల ఊళ్లో బావి నీళ్లు చప్పగా ఉంటాయి. కాబట్టి అందరూ తప్పనిసరిగా తాగడానికి మంచినీళ్లు నది నుండి తెచ్చుకోవాల్సిందే! మీకు తెలిసిందే కదా! దానికేమో అసలు చలిగాలి సరిపడదు. పెళ్లి అవగానే నదినుండి నీళ్లు తెచ్చే బాధ్యత అమాంతం కృష్ణవేణి నెత్తిమీద పడేశారు. ఒకటి కాదు, రెండు కాదు, నాలుగు బిందెలు! చలికాలం. పొద్దున్నే లేవాలంటే ఎంత కష్టం? ఊహించండి. స్వెట్టర్ లాంటిది ఏదయినా వేసుకుంటానంటే వాళ్ల అత్తగారు ససేమిరా ఒప్పుకోలేదట. తడిబట్టతో తెస్తే తప్ప ఆవిడ మంచినీళ్లు ముట్టరట. లేకపోతే అనాచారమట? ఏం చెప్పేది బాబుగారూ! పోనీ బావగారితో చెప్పుకుందామంటే తల్లి తడిబట్టతో తెమ్మంటే తనయుడు తల స్నానం కూడా చేసి మరీ తీసుకురా అనే రకం. ఇక ఎవరితో చెప్పుకుంటుంది దాని బాధ? కట్టుకున్న మొగుడే అర్థం చేసుకోలేకపోతే. తలచుకుంటేనే వళ్లంతా సెగలూ, పొగలు కక్కుతున్నట్లవుతోంది'' ఆవేశంతో ఊగిపోతూ చెప్పాడు గిరిధర్.

కృష్ణమాచార్యులుగారు చప్పున ముందుకు వంగి, గిరి భుజం మీద తడుతూ అన్నారు "గిరీ! నువ్వు కూడా ఇలా ఆవేశపడిపోతే సమస్యకు పరిష్కారమనేదే ఉండదు''

"మరి మరి ఏం చేయమంటారు? తల వంచి నన్ను కూడా కావిడి భుజాన వేసుకోమంటారా? చెప్పండి బాబుగారూ! నా బాధ అర్థంచేసుకోండి. దానికి ఎలాగూ నోట్లో నాలుక లేదు! ఆ అలుసు తీసుకునేగా వాళ్లు అట్లా ఆడిస్తున్నారు''

"గిరీ!'' మందలిస్తున్నట్లుగా పిలిచారాయన.

గిరి వెంటనే సిగ్గుపడ్డట్లుగా అయి, చప్పున మాట్లాడటం ఆపేసాడు. కృష్ణమాచార్యులుగారు అనునయంగా గిరి భుజం తట్టారు.

"గిరీ! అసలు ఏం జరిగిందిట? కేవలం ఇదే కారణమా?''

రెండు నిముషాల మౌనం తర్వాత గిరి నెమ్మదిగా చెప్పాడు. "లేదు బాబుగారూ! ఎన్నని చెప్పేది? ఏమని చెప్పేది? కృష్ణవేణి ఒక్కొక్క సంఘటనా చెబుతుంటే మనుమలలో మూర్ఖత్వం ఎంతగా వెర్రితలలు వేస్తోందో





తలచుకుంటూ ఉంటే విస్మయం కలుగుతోంది. నిన్న ఉదయం మీ ఇంటి దగ్గరనుండి కృష్ణవేణిని తీసుకు వెళ్లానుకదా! తరువాత''

గిరి చెబుతుంటే కృష్ణమాచార్యులుగారి కళ్ల ముందు ఆ సంఘటనలు దృశ్యాల్లా కదలసాగాయి.



గలగలమంటూ పారే కృష్ణ ఒడ్డున నీళ్ల మీద ఉయ్యాల లూగుతున్నట్లుగా ఉన్న తెరచాప పడవమీద కుడికాలు పెట్టబోతూ వెనకే గిరిధర్ చేతిలో ఉన్న తన చేతిని సుతారంగా విడిపించుకుంటూ అన్నయ్య ముఖంలోకి చూసి చిన్నగా నవ్వింది కృష్ణవేణి.

''కృష్ణా!'' గొంతుకు అడ్డు పడ్డట్లుగా పిలిచాడు గిరి!

కళ్లల్లో ఒక్కసారిగా చిప్పిల్లిన కన్నీళ్లతో కృష్ణవేణి మసక మసకగా కన్పించింది. ప్రకృతి అంతా ఒక్కసారిగా మూగపోయినట్లుగా స్థంభించిపోయింది. కృష్ణవేణి జాగ్రత్తగా పడవలో కాలుమోపి, భర్త ఎదురుగా తలవంచుకుని కూర్చుంది. భార్య ఎదురుగా కూర్చోగానే ఎందుకో పక్కకి తల తిప్పుకున్నాడు కొత్త పెళ్లికొడుకు మాధవరావు.

సిగ్గుపడుతూ, ఒక మూల ఒదిగి కూర్చుంది కృష్ణవేణి.

నుదుట కల్యాణపు బొట్టు, బుగ్గన కాటుక చుక్క, తలంటి పోసుకున్న తలలో నిండుగా పెట్టుకున్న సన్నజాజి, మరువం, కనకాంబరాల కదంబమాల, మెడలోకి కొత్తగా వచ్చిన నల్లపూసల గొలుసు, చెవులకు ఊగుతున్న బుట్టలు. నిండుగా, పుష్టిగా, దంతపు బొమ్మలా ఉన్న కృష్ణవేణి పెళ్లికూతురు అలంకారంలో మరింతగా వెలిగిపోతోంది. బరువుగా వాలిపోతున్న కాటుక కనురెప్పలు, సిగ్గుతో ఎరుపెక్కిన చెక్కిళ్లు, మాటిమాటికి అధరాల మాటున పూచే చిరునగవు ఆమె అందానికి అలంకారాలయి కృష్ణానదిలో ప్రతిఫలిస్తున్నాయి.

లంగరు విప్పుతున్నారు పడవవాళ్లు.

''కృష్ణా! జాగ్రత్తమ్మా!'' అన్నాడనుకున్నాడు గిరి! కాని మాటలు పెగలి బయటకు రాలేదు. ఒక్కసారిగా చెప్పలేని ఒంటరితనం కమ్మేసింది. కనుకొనలలో లీలగా నిలిచిన కన్నీటిని కొనగోట తుడుచుకుంటూ ఉంటే వెనుకగా భుజం మీద చెయ్యిపడింది.

తలతిప్పి చూశాడు గిరి!

కృష్ణమాచార్యులుగారు.

''గిరీ! సలక్షణంగా పెళ్లి చేసుకుని అమ్మాయి అత్తవారింటికి వెళుతూ ఉంటే నీకెందుకయ్యా ఈ కన్నీళ్లు? ఆ! చూడు ముచ్చటగా ఉన్న ఆ దంపతులను చూడు. నువ్విట్లా కన్నీళ్లు పెట్టుకుంటే, కొత్తగా అత్తవారింటికి వెళుతున్న కృష్ణవేణి ఇంకెంత బెంగపడుతుందో! గుండె చిక్కపట్టుకో! నాలుగురోజులకు అదే అలవాటయి పోతుంది. ఆడపిల్ల అన్నాక అత్తవారింటికి పంపక ఎప్పటికయినా తప్పదయ్యా! చూస్తూ ఉండు! సంవత్సరం తిరిగేసరికి కృష్ణాష్టమి కల్లా మన కృష్ణవేణి వేణుగోపాలుడిని ఎత్తుకొని వస్తుందయ్యా. నవ్వుతూ అమ్మాయిని అత్తవారింటికి పంపించు! అన్నట్లు ఆ అరిటి గెలలూ కొబ్బరి బొండాలు.. అన్నీ పడవలో పెట్టించావా? ఏమీ మర్చిపోలేదుగా!'' లేదన్నట్లుగా మౌనంగా తలూపి కృష్ణవేణి వైపు చూసాడు గిరి.

కృష్ణవేణి కూడా అన్నయ్య వైపే చూస్తోంది. హఠాత్తుగా ముఖం పాలిపోయినట్లుగా అయిపోయింది. కళ్లల్లో దిగులు రెపరెప లాడుతోంది. కనురెప్పల మాటున కన్నీరు సుడులు తిరుగుతూంటే నెమ్మదిగా నవ్వి, తలవంచుకుంది.

కృష్ణమాచార్యులుగారు పంచెని కొంచెం పైకి ఎత్తిపట్టుకుని నీళ్లల్లోకి దిగి పడవ అంచు దగ్గర నిలబడి మాధవరావు వైపు చూస్తూ

అన్నారు, "బాబూ! ఇక భారం అంతా నీదే! తల్లి అయినా, తండ్రి అయినా, భర్త అయినా... అన్నీ కనిపెట్టుకుని చూసుకో బాబూ! అశుభం శుభం తెలియని అమాయకురాలు. కృష్ణమ్మ తల్లి చల్లటి ఒడిలో పెరిగిన గంగిగోవు మా కృష్ణవేణి! ఇక నీ చేతుల్లోపెట్టాము" మాధవ రావు చెయ్యి చేతిలోకి తీసుకుంటూ ఉంటే అనుకోకుండా... ఆయన స్వరం కూడా గద్గదిక మయింది.

ఎదురుగా ఉన్న కృష్ణవేణి కళ్లల్లోంచి-అపుడు బయటపడ్డాయి కన్నీళ్లు ఒక్కసారిగా! ఆపుకోలేనట్లుగా పవిట చెంగు నోటికి అడ్డం పెట్టుకుని ఉండిపోయింది. కృష్ణవేణి వైపు నడిచారాయన. ఆమె తల మీద చెయ్యివేసి నిమురుతూ "కృష్ణవేణీ! ఈ రోజు వరకూ మేము! ఇక నుండీ నీకు సర్వస్వం, సాక్షాత్తూ దైవం... నీ భర్తే నమ్మా! పుట్టింటి ప్రతిష్ఠ, మెట్టినింటి గౌరవం ఇక అన్నీ నీ చేతుల్లో ఉన్నాయి తల్లీ! జాగ్రత్త తల్లీ! ఇకనుండి కష్టమయినా, సుఖమయినా మనసులోని మాట విప్పి చెప్పుకునేందుకు నీ భర్త ఉండగా నీకింకా దిగులేమిటమ్మా! వచ్చేయేటికి చిట్టి వేణుగోపాలుడిని ఎత్తుకుని పడవ దిగాలి నువ్వు! సరేనా!" అన్నాడు.

కృష్ణవేణి సిగ్గుపడ్డట్లుగా తల పక్కకు తిప్పుకుంది.

కృష్ణమాచార్యులుగారు పక్కకు తిరిగారు.

ఆయనకు ఎడమవైపు పడవలో కృష్ణవేణి అత్తగారు సూరమ్మ, ఆమె తమ్ముడు దీక్షితులు కూర్చుని ఉన్నారు. వారి చుట్టూ బోలెడంత సామాను, రేకు పెట్టెలు పెట్టి ఉన్నాయి. ఆమెవైపు తిరిగి చెప్పారు కృష్ణమాచార్యులుగారు...

"అక్కయ్యగారూ! మా అమ్మాయిని ఇక మీ చేతుల్లోపెట్టాము! తల్లీ తండ్రిలేని పిల్ల! ఇక తల్లయినా అత్తగారయినా మీదే భారం! మా పెంపకాలలో ఏవయినా లోపాలుంటే దయచేసి క్షమించి, అన్నీ దగ్గరుండి చెప్పి చేయించుకోండి! తల్లిలేని పిల్ల అవడంవలన చాలా తెలియకపోవచ్చు. ఉంటానమ్మా" అంటూ ఆమెకి, దీక్షితులుకి చేతులెత్తినమస్కారం చేసి చిన్నగా నిట్టూర్చి వెనుతిరిగి వచ్చి గట్టుమీద నించున్నారు.

దీక్షితులు పెద్దగా అరిచాడు. "ఊఁ ఊఁ! కదలండి! అవతల వర్జ్యం ముంచుకొస్తోంది. ఇప్పటికే ఆలశ్యం చేసేసారు ఊఁ ఊఁ!!"

నెమ్మదిగా నదిలోకి ప్రవేశించిన పడవలో నుండి కృష్ణవేణి మాటి మాటికి కన్నీళ్లు నిండుతున్న కళ్లను తుడుచుకోవడం కూడా మానేసి, చెయ్యి ఊపుతూ అందరి దగ్గర వీడ్కోలు తీసుకుంది.

గట్టుమీద గిరీ, కృష్ణమాచార్యులుగారు, కన్నయ్య, అతని భార్య, రంగడి భార్య అలివేలు చేతులూపుతూ ఉండిపోయారు.

నెమ్మదిగా ఊగుతూ నదిలోకి దూసుకుపోయింది పడవ.

క్రమేపీ ఒడ్డునున్న మనుషులు, ఆలయ శిఖరం అస్పష్టం అవసాగాయి. కృష్ణవేణి మనసులోనే వేణుగోపాలుడికి దణ్ణం పెట్టుకుంది.

మళ్లీ తల వంచుకోబోతూ, ఓరగా భర్తవైపు చూసింది.

అంతసేపూ కృష్ణవేణివైపే చూస్తున్న మాధవరావు తడబడి, తల తిప్పుకుని నదివైపు చూస్తుండిపోయాడు.

భర్తని నెమ్మదిగా పరిశీలించసాగింది కృష్ణవేణి కను చివరలనుండి.

చామనఛాయరంగు సాధారణమయిన పర్సనాలిటీ! చప్పున చూడగానే కొంచెం పొట్టి అనిపించినా కనుముక్కు తీరు కొంచెం ప్రత్యేకంగా ఉంది. బుగ్గలు లావుగా ఉండటంతో కిందకి జారినట్లుగా ఉండి, మెడ కన్పించీ కన్పించనట్లుగా ఉంది! సన్నటి పెదాలు పొడవుగా ఉండే ముక్కు, డైమండ్ ఆకారంలో ఉండి తేలిపోతున్నట్లుగా ఉండే కళ్లు దట్టంగా ఉండి మధ్యభాగంలో కలుసుకున్న కనుబొమల మధ్యన బొటనవేలు పరిమాణంలో కుంకుమబొట్టు, చిన్ననుదురు, పొట్టి క్రాపు, సన్నగా గీసుకున్న గడ్డం, మీసం! చెవులకు పోగులు, కొంచెం ఎత్తుగా ఉన్న పొట్ట, బొడ్డు క్రిందికి కట్టిన తెల్లటి పట్టువంచె, ఏ ఆచ్ఛాదనాలేని ఛాతీమీద వచ్చటి యజ్ఞోపవీతం, భుజం మీదనుండి పట్టువస్త్రం వేసుకున్నా గాలికి ఆగడం లేదు.




"అబ్బాయ్ మాధవూ! టైమెంతయిందేమిటి?" పక్క పడవలో నుండి సూరమ్మ అడగటంతో కృష్ణవేణి ఉలిక్కిపడి, పరిశీలన ఆపి అటు చూసింది! మాధవరావు గాలిలోకి జోరుగా చెయ్యి విసిరి టైము చూసి చెప్పాడు.

"అహా!" అని చుట్టూ ఉన్న అరటిగెలల్లో నుండి అరటిపళ్లు టప్‌మని లాగి తినసాగింది సూరమ్మ.

సూరమ్మని చూడగానే చప్పున చెప్పేయచ్చు, కొడుకు తల్లి నోట్లో నుండి ఊడిపడ్డాడని.

సూరమ్మ వయసు యాభయిపైబడుతున్నా మనిషి అలా ఉండదు. మంచి రంగులో పుష్టిగా ఆరోగ్యంగా ఉంది.! లావుగా, పొట్టిగా, ఆరోగ్యంగా, బలంగా అన్పిస్తుంది. తెల్లటి గ్లాస్కో వంచెని చీరలా కట్టుకుని, పవిట చెంగు భాగాన్ని నున్నగా గీయించుకున్న గుండు మీదుగా మునుగులా కప్పి, తిరిగి దానిని జాకెట్ లేని భుజాల మీదుగా తీసుకువచ్చి గుండెల మీద కప్పుకుంది.

ఎదురుగా గొంతుక్కూర్చున్న ఆమె తమ్ముడు దీక్షితులు సన్నగా వెనక్కి వంచిన వెదురు బద్దలా ఉన్నాడు. ఎపుడూ ఆర్పుతూ ఉండేకళ్లు, కోలముఖం, నుదుటిమీద ఎర్రటి గుండ్రటి బొట్టు, పొడవాటి గద్దముక్కు, పొట్టి క్రాపులోనుండి వేలాడే చిన్న పిలక, మాట్లాడుతూ ఉంటే ఎడంగా ఉండే పళ్ల మధ్యనుండి హిస్ మంటూ గాలి వస్తూ ఉంటుంది.

అక్కాతమ్ముళ్లు ఎందుకో పడీపడీ నవ్వుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ అరటి పళ్లు ఆరగిస్తున్నారు.

చూస్తుండగానే అవతలిగట్టు చేరువ అయింది.

కృష్ణవేణితోపాటు రుక్మిణి అత్తయ్యా వచ్చింది!

పడవలు ఒడ్డున ఆగగానే దీక్షితుల ఆజ్ఞమేరకు మాధవరావు కృష్ణవేణి చిటికినవేలు పట్టుకుని దిగాడు.

మెత్తటి ఇసుకలో కొంతదూరం నడిచి రోడ్డు మీదకి వచ్చేనరికి వరుసగా నాలుగయిదు గూడుబళ్లు రెడీగా ఉన్నాయి.

ఇంటికి మరో అరగంటలో వచ్చేరు. ఊరేగింపులా రావడంతో బాగా లేటయింది. ఇంటికి రాగానే సూరమ్మ తరపు బంధువులు ఎర్రనీళ్లు దిష్టి తీసేసారు. మరో అరగంటలో ఊళ్లోవాళ్లు కొంతమంది బిలబిలమంటూ సూరమ్మ గారి కొత్త కోడలిని చూడటానికి వచ్చారు.

మనసులో దిగులు, ప్రయాణపు బడలికతో కృష్ణవేణికి విపరీతమయిన తల నొప్పిగా ఉంది.

వచ్చినవాళ్లకి చిరునవ్వే సమాధానమివ్వసాగింది. కృష్ణవేణి తరపున రుక్మిణి సమాధానాలు చెప్పింది ఓపికగా.

మర్నాడు సత్యనారాయణ స్వామి వ్రతానికి గిరి బట్టలు తీసుకొచ్చాడు. ఆచార్యులు గారు, అండాళమ్మ కూడా వచ్చారు.

రెండు రోజులుండి రుక్మిణి కూడా అటు నుండి అటే సిటీ వెళ్లిపోయింది.

ఈ బంధువుల సందడి, సమారాధనల మధ్య మూడు రోజులు కృష్ణవేణికి బద్ధకంగా అంతకుమించిన బడలికతో బరువుగా గడిచాయి. నాలుగోరోజునుండి కృష్ణవేణి అసలు కాపురం మొదలయింది ఆ ఇంట్లో.

ఉదయం అయిదు గంటల సమయం.

బయటగేటు కిర్రుమని చప్పుడు చేస్తూ తెరుచుకుంది.

గదిలో పడుకున్న కృష్ణవేణి లేచి తలుపు తీసింది. పాలవాడు చేతిలోపాల బిందెతో నిల్చుని ఉన్నాడు.

హాల్లో పడుకున్న సూరమ్మ ఇంకా నిద్రలేవలేదు. మంచం మీద వెల్లికిలా పడుకుని నోరు తెరుచుకుని గురకపెడుతోంది.

కృష్ణవేణి గిన్నె తీసుకుని వెళ్లి పాలు పోయించుకుని లోపలికి వచ్చేనరికి మంచం మధ్య బాసింపట్టు వేసుకుని కూర్చుని ఉంది సూరమ్మ.

చిటికెలువేసి ఆవలిస్తూ మత్తుగా అడిగింది "ఎన్ని పోయించుకున్నావేమిటీ పాలు?"

చెప్పింది కృష్ణవేణి.

"హేవిటీ!" మంచం మీద అంతెత్తున ఎగిరిపడింది సూరమ్మ! దెబ్బకి నిద్రమత్తు

ఎగిరిపోయినట్లుగా తల అటూఇటూ జూలు విదిలించినట్లుగా ఆడించి, నెత్తిమీదికి జారిపోయిన ముసుగు లాక్కుని తీక్షణంగా చూసింది. అదిరిపడి బిత్తర చూపులు చూసింది కృష్ణవేణి.

"హదేవిటమ్మాయి! మీ పెళ్ళయిన తర్వాత ఈ రోజు గుళ్లో పూజ ఉన్నది. మనం అందరం ఉపవాసాలుండాలి అని నిన్ననే చెప్పానుగా, ఏం చేసుకుందామనీ ఇన్ని పాలు? మన నెత్తిన అభిషేకాలు చేసుకోడానికా?"

"హే..విటే.. పొద్దున్నే" మత్తుగా జోగుతూ గది గుమ్మం దగ్గరికి వచ్చి నిల్చున్నాడు మాధవరావు.

తల్లికొడుకులకి అంత హఠాత్తుగా నిద్రలు ఎలా వస్తాయో, మళ్లీ అంత సడెన్‌గానే మెలకువలు ఎలా వస్తాయో కృష్ణవేణికి ఆశ్చర్యమే.

"హేవుంది నాయనా నీ పెళ్లానికి కాస్త పొదుపు నేర్చుకోమని చెబుతున్నా అంతే! లేకపోతే కాపురం హిదుగో... హింతే" అంటూ గాలిలో పెద్ద సున్నా చుట్టింది.

సూరమ్మకి ప్రతిదీ గాలిలో సున్నాలు చుట్టి చెప్పటం అలవాటు.

కృష్ణవేణి మౌనంగా వంటింట్లోకి నడిచింది.

ఆ రోజు ఉపవాసం సంగతి తల్చుకుంటేనే నీరసం కమ్ముకు వస్తోంది. ఏదో ఒకటి టైమ్‌కి తినడమేకాని ఇలా ఉపవాసాలని తిండి మానేయడం కృష్ణవేణికి అలవాటులేదు.

కాసేపటికి మాధవరావు లుంగీపైకి ఎగ్గట్టుకుని పెరట్లోకి వచ్చాడు. వీధంతా దద్దరిల్లిపోయేలా ఖాండ్రిస్తూ పావుగంటసేపు దంతధావన కార్యక్రమం పూర్తి చేసి అక్కడే స్నానం కూడా చేసేసాడు. మగవాళ్లు బాత్‌రూమ్ లో స్నానం చేయడం మగతనం కాదని చెప్పడం చాలాసార్లు విన్నది కృష్ణవేణి.

నెత్తిమీద నాలుగు బొక్కెనల నీళ్లు తోడి దిమ్మరించుకుని పది నిముషాలలో స్నానం పూర్తి చేసుకుని వంటింట్లోకి వచ్చాడు.

ఎందుకో మాధవరావు కాని, సూరమ్మకాని ఏ పని చేసినా హడావిడిగా, చేతులు ఝాడిస్తూ, పెద్దగా శబ్దమయ్యేలా అడుగులు వేస్తూ హంగామా చేస్తూ ఉంటారు. కానీ తీరా చూస్తే అక్కడ అంత ఖంగారు పడాల్సినంత పనులు ఏమీ ఉండవు.

వంటింటి గూట్లో ఉన్న వీబూధి తీసుకుని ఛెళ్‌ఛెళ్ మంటూ శబ్దమయ్యేలా ఇంత వీబూధి గాలిలోకి ఎగిరేలా, చేతులు గాలిలో ఝాడిస్తూ రెండు చేతులకీ నుదుటికీ గుండెల మీద వీబూధి దిద్దుకుని సంధ్యావందనానికి కూర్చున్నాడు.

తర్వాత ఆచమనం!

పంచపాత్రలోనుండి గంటమ్రోగిన శబ్దంతో ఉద్ధరిణితో నీళ్లు తీసుకుని 'ఉఫ్‌ఉఫ్'మంటూ నీళ్లు లోపలికి పీల్చేవాడు. శబ్దం తప్ప నీళ్లు లోపలికి వెళ్లాయో లేదో! తెలియదు

పావుగంటలో సంధ్యావందనం ముగించుకుని హాల్లోకి వచ్చి ఉయ్యాలబల్ల మీద కూర్చుని సూరమ్మ ఇచ్చిన పాలు తాగసాగాడు.

విశేష మేమిటంటే అంతసేపూ మాధవరావు ఆ తడిపొడిగా ఉన్న టవల్‌తోనే ఉన్నాడు.

కృష్ణవేణి ఆ ఇంట్లో అడుగు పెట్టిన మొదటిరోజే ఆ విషయం గమనించింది. అది చాలా అసహ్యంగా చిరాకుగా అన్పించిందామెకు.

నిండుగా లుంగీకట్టుకోవడమో పైన కనీసం బనియన్ వేసుకోవడమో లాంటివి చేయడు.

బొడ్డు కిందకు కట్టిన టవల్ మధ్యమధ్యలో జారిపోతుంటే దానినే విప్పి మళ్లీ మళ్లీ కట్టుకుంటూ హాల్లో పెరట్లో తిరుగుతూ పిట్టగోడమీదగా పక్కవాళ్లని పలకరిస్తూ... ఆ దృశ్యం తలచుకుంటేనే కృష్ణవేణికి సిగ్గుగా అన్పిస్తుంది.

తొమ్మిది గంటల సమయంలో డ్రస్ చేసుకున్నాడు. లూజుగా ఉండి ముడతలు పడిన తెల్లటి ఫాంట్‌లోకి పెళ్లికి ప్రత్యేకంగా ముచ్చటపడి కుట్టించుకున్న ముదురు కనకాంబరం రంగు మీద వంకాయ రంగు పూల చొక్కా టక్ చేశాడు.

కృష్ణవేణికి ఆ క్షణంలో తన మీద తనకే జాలివేసిందిగానీ, సూరమ్మకయితే ఆ క్షణంలో కొడుకు సినిమా హీరోలా కన్పించాడు.




కళ్లజోడులోనుండి తృప్తిగా చూస్తూ మనసులో అనుకుంది, సాయంత్రం ఆఫీసునుండి రాగానే కొడుకుకి దిష్టి తీసిపారేయాలని.

మాధవరావు సైకిల్ తీసుకుని రేవువరకూ తొక్కుకుంటూ వెళ్లి అక్కడ తనతోపాటు దానిని పడవలో ఎక్కించి అవతల ఒడ్డున దించి సరాసరి దానిమీదే ఆఫీసుకి వెళతాడట.

ఆ రోజు ఉపవాసం కాబట్టి కాఫీలులేవు. కృష్ణవేణి కూడా పాలు మాత్రమే తాగి నీర సంగా మధ్యాహ్నం వరకూ గడవగలగిందిగానీ ఆ తర్వాత మాత్రం ఎక్కడ లేని నిస్సత్తువా ఆవహించింది.

పడుకోవాలన్నా నిద్రపట్టలేదు. అసలు ఉప వాసం రోజున నిద్రపోగూడదని సూరమ్మ ముందరే వార్నింగ్ ఇచ్చింది.

నీరసంగా హాల్లో గోడకానుకుని కూర్చుంది! హాలు నిండా గజం ఖాళీలేకుండా దేవుడి ఫొటోలు, మధ్యమధ్యలో మేమున్నామని ఎప్ప టివో పాతకాలం గ్రూపు ఫొటోలు తొంగి చూస్తు న్నాయి. ఒక వైపు గోడనిండా స్వాములవార్ల ఫొటోలు, వాటికి చెమ్కీ దండలు వేలాడుతు న్నాయి. చెమ్కీ దండలని పట్టుకుని బూజు దండలు కూడా వేలాడుతున్నాయి.

అంతసేపూ వంటింటి గడపదగ్గర ఏదో త్యాగరాజ కృతి దీర్ఘం తీస్తూ వత్తులు చేసు కుంటున్న సూరమ్మ అంతలో ఏదో గుర్తుకొచ్చి నట్లు ఛెంగున లేచి దొడ్లోకి వెళ్లింది.

ఏమిటా? అని తొంగి చూసింది కృష్ణవేణి.

చేతిలో పెద్ద కర్ర పట్టుకుని పెరట్లోని గోడ దగ్గరున్న జామచెట్టు కొమ్మలమీద కొడుతూ చుట్టూ తిరుగుతోంది. ఆఖరుకి రాళ్లలాంటి ఓ పది కాయలు రాలినాయి. వాటిని భద్రంగా చెంగున కట్టుకుని హాల్లోకి వచ్చి కృష్ణవేణి ముందర దులపరించి "ఇదిగో! నువ్వు కూడా తినవే! పళ్లు ఫలాలకి ఏమీ తప్పులేదులే!" అంటూ కాయని కొరకసాగింది. వాటి మొహం చూస్తూ ఉంటేనే తెలుస్తోంది అవి ఎంత పచ్చికాయలో. కృష్ణవేణి మౌనంగా లేచి వంటింట్లోకి వెళ్లి బిందెలో మంచినీళ్లు ముంచుకు తాగసాగింది.

నడెన్‌గా అపుడే గుర్తుకొచ్చినట్లు అన్నది సూరమ్మ "అన్నట్లు ఇదిగో అమ్మాయోవ్! ను వ్వు సాయంత్రం త్వరగా మడినీళ్లు తీసుకురా వాలి సుమా! లేకపోతే వంటకి లేటయిపో తుంది!"

"సాయంత్రమా?" వెనక్కి తిరిగి అడిగింది కృష్ణవేణి!

"అవునే- అయినా పొద్దునవి సాయంత్రాని కి ఎలా పనికి వస్తాయని? రోజూ అంటే ఫరవాలేదు! సర్దుకుపోవచ్చు! ఇంత ఉప వాసం ఉండి, గుళ్ళో పూజ పెట్టమని- రాత్రి వంటకి ఆ మైల నీళ్ళే ఎలా వాడతాం? నాకా? ఒఖ్ఖపూట తినకపోతే కాళ్ళు చచ్చుపడిపో తాయి! కళ్ళు తిరుగుతాయి! ఆ సంగతి నీకూ తెలుసు! అయినా వయసు మీద పడుతుంటే ఓపిక ఏముంటుందని? ఇక అన్నీ నువ్వే చూసుకోవాలి మరీ! నీళ్ళయినా నిప్పుల యినా? అబ్బాయి చెప్పలేదా?"

ఆరోజు ఉదయమే మాధవరావు కొంత డైరెక్టుగా- కొంత ఇన్‌డైరెక్టుగా అదే విషయం చెప్పాడు! "ఇదిగో సాయంత్రం మడి నీళ్ళు అవీ తొందరగా తీసుకొచ్చుకో- లేకపోతే వంట లేటయి- గుడిలో పూజ లేటవుతుంది- అలా అని కాకపోయినా అమ్మ అంతసేపు ఉండలే దు. పెద్దవయసు, పెద్దావిడ! కష్టపడినంత కాలం పడింది, చిన్నవాళ్లం మనమే చూసుకో వాలి మరి! మా సంప్రదాయం చాలా గొప్పదని మడీ ఆచారాలు ఖచ్చితంగా పాటిస్తామని, నీకు ఇప్పటికే అర్థంఅయి ఉంటుందను కుంటాను. అన్నట్లు రేవుకి దారి తెలుసుగా?"

రెండు రోజులక్రితం "అలా సరదాగా- షికా రుకి" అంటూ మంచినీళ్ళరేవుకి భర్త ఎందుకు తీసుకువెళ్ళాడో అపుడర్థమయింది కృష్ణవేణికి!

ఆ ఊరి నీళ్ళు చవ్వగా ఉండి- వంటకి పనికిరావు కాబట్టి- అందరూ దక్షిణంవైపుఉన్న కృష్ణమీదనే ఆధారపడ్తారు!

కృష్ణవేణి నీరసంగా వచ్చి హాల్లో గోడకి జారిగలపడి కూర్చుంది! పక్కనే సూరమ్మ కూర్చుని "అయితే అమ్మాయి- మీ పుట్టింట్లో ఇలా ఉపవాసాలు- వ్రతాలు అవీ" అంటూ ఏదో అనబోతుంటే వాకిట్లో సైకిల్ బెల్ విన్పించింది!

"అబ్బాయి వచ్చినట్లున్నాడు! పర్మిషన్ పెట్టి పెందరాళే వస్తానని నిన్ననే చెప్పాడు!" సూరమ్మ స్వగతంగా అనుకుంది!

మాధవరావు అరుగుమీద సైకిల్ పెట్టి హాల్లోకి అడుగుపెట్టాడు! హఠాత్తుగా కృష్ణవేణి చెవిదగ్గర "ఇష్ ఇష్" అని ఏదో విన్పించి తల తిప్పింది! సూరమ్మ కళ్లు కోపంగా చూస్తున్నాయి! ఏదో గొణుగుతోంది చిన్నగా!

కృష్ణవేణి అర్థంకానట్లు అయోమయంగా చూసింది!

వెంటనే- సూరమ్మ కృష్ణవేణి డొక్కలో ఒక్క పోటు పొడిచి "నించో! లేచి నించో! మొగుడొస్తే- పెళ్ళాం లేచి నించోవాలని తెలీదూ? అదికూడా చెప్పాలా?"

కృష్ణవేణి ఖంగారుగా- తడబడుతూ లేచి నిల్చుంది!

మాధవరావు చిరునవ్వుతో తల ఆడించి- దండెంమీద ఉన్న టవల్ తీసుకుని- నందులోగుండా పెరట్లోకి నడిచాడు.

బైటకి వెళ్ళి వచ్చిన బట్టలతో వంటింట్లో అడుగుపెట్టడం ఆ యింట నిషిద్ధం! బొమ్మలా నిల్చున్న కృష్ణవేణి చెయ్యిపట్టి ఒక్క గుంజు గుంజింది సూరమ్మ! మళ్ళీ చతకిలపడిన కృష్ణవేణివైపు విడ్డూరంగా చూస్తూ హేళనగా అన్నది సూరమ్మ. " అదికాదే! నీకు తెలియదు... సరే! మీ పెద్దవాళ్ళయినా చెప్పరా? అలా చేయాలి! ఇలా చేయాలి అని! హాయ్యోరామా!" అంటుండగానే టవల్ ధరించి మాధవరావు హాల్లోకి అడుగుపెట్టాడు.

మళ్ళీ కృష్ణవేణి డొక్కలో పోటు!

లేచి నిల్చుంది... నీరసంగా!

"హిష్" అనుకుంటూ మాధవరావు ఉయ్యాల బల్లమీద కూర్చున్నాడు!

సూరమ్మ మళ్ళా చెయ్యి పట్టి గుంజింది!

కృష్ణవేణి ఈసారి మోకాళ్లమీదే కూలబడింది!

"హయ్యో! అయోమయం మేళమా? మొగుడొస్తే మంచినీళ్ళివ్వాలని ' కూడా..." అంటుండగానే గబుక్కున లేచి వంటింట్లోకి నడిచింది.

నీరసంతో కాళ్ళు తడబడ్డాయి!

మంచినీళ్ళగ్లాసుతో హాలులో అడుగుపెట్టిన కృష్ణవేణి ఆగిపోయింది!

అసలే చిన్న టవల్- దానిని కూడా తొడల్లోకి మడిచి- తల్లి ఎదురుగా గొంతు కూర్చుని అంటున్నాడు మాధవరావు. "ఇదిగో అసలే పెద్దదానివి ఉండలేవు, అందుకే ఈ అరటిపళ్ళు తెచ్చాను తిను!" అంటూ అరటిపళ్ళు ముందుకు పెడుతూ అన్నాడు.

"ఇష్! నా కెందుకు లేరా? మీకో!" అన్నది నీరసంగా సూరమ్మ.

ఆ! చిన్నవాళ్ళం మాకేం ఫరవాలేదు" అంటుండగానే గంటక్రితమే సిటీలో తిన్న అరటిపళ్ళు, యాపిల్‌వళ్లతాలూకు కలగావులగ త్రేన్పు తన్నుకు వచ్చింది!

"రామా!" అనుకుంటూ- నీరసంగా మూల్గుతూ క్షణంలో అన్ని అరటి పళ్ళూ లాగించి గోడకి చేరగిలపడింది సూరమ్మ!

"హయితే హమ్మా! రాత్రికి ఏవేం చేస్తున్నావే?" నోట్లో లాలాజలం ఊరుతుంటే -రాత్రికి చేయబోయే శాకపాకాలగురించి ఊహించుకుంటూ అడిగాడు!

ఆ ప్రసక్తి రాగానే ఉత్సాహంగా లేచి కూర్చుంది సూరమ్మ. "నీకిష్టమని అరటిదూట ఆవపెట్టి కూరా, కందిపచ్చడి, సొరకాయ పులుసూ- వీటితోపాటు ఈ అయోమయంమేళం పాలు ఎక్కువ పోయించుకుందిగా- పెరుగు వుండిపోయింది. కొబ్బరి పెరుగు పచ్చడీ..."

ఉత్సాహంగా వింటున్న మాధవరావు బుంగమూతిపెట్టి "మరి అల్లప్పచ్చడో..." అన్నాడు.

ఫెడీల్మని నవ్వింది సూరమ్మ "నిజమే రోయ్! కందిపచ్చడికి తోడులేకపోతే ఎలా మరీ పాపం?"

వంట గురించి కనీసం పావుగంటసేపు మాట్లాడుతూ కూర్చున్నారు.

సాయంత్రం నాలుగవగానే- సూరమ్మ హడావిడిపడటం మొదలెట్టింది!

"ఇదిగో- అమ్మాయ్... అలా కూర్చుని లాభంలేదు- ముందర నువ్వు మడికట్టి-




నీళ్ళు తేవాలి- ఊ!" ఉత్సాహం చేస్తూ అన్నది!

నెమ్మదిగా చలిగాలి తిరుగుతోంది!

కృష్ణవేణికి ఎంత ఆపుకుందామన్నా ఆపుకో లేని నిట్టూర్పు తన్నుకువచ్చింది! ఇప్పుడు చన్నీళ్ళు పోసుకోవాలా?

తలచుకుంటేనే భయం వేస్తోంది! కృష్ణవేణి కి. చన్నీళ్లు అసలు సరిపడవు!

ఇంతలో గడపదగ్గర 'ఠంగ్' మంటూ శబ్దం అయింది!

తృళ్ళిపడి చూసింది!

చేతిలో బిందెతో నిలబడి ఉన్నాడు మాధవ రావు "ఇపుడే కదా అమ్మ చెప్పింది! ఏవిటా ఆలోచన? త్వరగా తెములు! నీకు పెళ్ళి అయిన మొదటిరోజే చెప్పినట్లు గుర్తు! మాకు మడీ ఆచారాలు ఎక్కువని! నిజానికి- నీళ్లు పోసేవాళ్ళు- ఈ ఊరిలో నలుగురయిదుగురు ఉన్నారు! కాని- మాకు పనికిరాదు! అర్థంఅ యింది కదా!"

అతని మాటల్లోని తీక్షణత, కృష్ణవేణిని సూ టిగా తాకింది!

ఇక ఆలోచించి ప్రయోజనం లేదన్నసంగతి కూడా తెలిసిపోయింది! మౌనంగా వెళ్ళి బావి గట్టుమీద నిలబడి ఒక్కక్షణం కళ్ళు మూసు కుంది! నెమ్మదిగా బొక్కెన బావిలోకి జారవి డిచి, నీళ్ళు తోడుతుంటే చేతులు వణికాయి!

బలవంతంగా బొక్కెన ఎత్తి, ధారగా నెత్తి మీద గుమ్మరించుకుంది! నెత్తిమీద నుండి గంగాప్రవాహంలా, చల్లగా, నరాలు జివ్వు మంటూ ధారలు కారుతున్న నీటి తుంపరల మధ్యనుండి గుమ్మందగ్గర నడుముమీద చే తులు పెట్టుకుని ఇటే చూస్తూన్న సూరమ్మ, మాధవరావు కన్పించారు! అయిదారు బొక్కెన లు పోసుకుంటే కాని చీర పూర్తిగా తడవలేదు! శరీరంలో నుండి సన్నగా వణుకుపుట్టింది!

వణుకుతూ వచ్చి నిల్చున్న కృష్ణవేణి చేతికి బిందె అందించాడు మాధవరావు! పెదవులు కంపిస్తుంటే- తడిగా అయిన ఎర్రటి కళ్ళెత్తి లిప్తపాటు భర్తవైపు చూసింది కృష్ణవేణి!

మాధవరావు నవ్వాడు అదోలా!

ఆ నవ్వు వెనక అర్థం, అర్థంకాలేదు ఆమెకు!

మౌనంగా తలవొంచుకుని- సందులోనుండి రోడ్డుమీదకి వచ్చింది! సంజెవేళ!

సూర్యుడు... పశ్చిమాద్రిన... కనకాంబరం రంగులో అస్తమించడానికి సిద్ధమవుతున్నా డు! తడిబట్ట కాళ్ళకు బంధాలు పడి నడక సాగడంలేదు! తలమీద నుండి నీళ్ళు ముఖం మీదుగా జారి పెదవులకు ఉప్పుగా తగులు తున్నాయి!

చీర శరీరానికి అతుక్కుపోయి చుట్టుకుపో యినట్లుగా ఉంది!

తనలాగే-బిందెలు చంకన పెట్టుకుని వెళు తున్న ఆడవాళ్ళు, కావిళ్ళు భుజంమీద పెట్టు కుని వెళ్లుతున్న మగవాళ్లు వింతగా చూస్తూ వెళుతున్నారు! పట్టిపట్టిచూస్తూ నడుస్తున్నా రు! నవ్వుకుంటున్నారు! జాలిగాచూస్తున్నారు! అదోలాంటి చూపులు విసురుతున్నారు!

మొదట్లో సిగ్గుతో చితికిపోయినట్లని పించింది! కాని క్రమంగా... అదోలాంటి భావం కమ్ముకురాసాగింది!

అది నిర్వికారం!

అలా ఆ స్థితిలోనే రెండు బిందెలు తీసుకు వచ్చింది!

ఈ లోపలే చీర సగం ఆరిపోయింది!

సూరమ్మ- కృష్ణవేణి కలిసి గంటలో వంట పూర్తిచేసి కాసేపటికి రెడీఅయి గుడికి బయ లుదేరారు!

గుళ్ళో ఎవరో స్వాములవారు కన్పిస్తే ఆయ నను శిష్యకోటితోసహా మర్నాడు భిక్షకి ఆహ్వా నించింది సూరమ్మ!

ఆ రాత్రి ఇంటికి వచ్చిన కృష్ణవేణి సగం నిస్త్రాణతో కళ్ళు తిరుగుతున్న అయోమయ పరిస్థితిలో అన్నం సరిగ్గా తినీ తినని స్థితిలో త్వరగానే గాఢనిద్రలోకి జారిపోయింది.

★ ★ ★

మర్నాడు ఉదయమే తలుపు చప్పుడుకి ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది కృష్ణవేణి. తలతి ప్పి చూస్తే భర్త మంచి నిద్రలో ఉన్నాడు!

లేచి గది తలుపు తీసుకుని హాల్లోకి వచ్చింది!

మంచంమీద పక్కకి ఒత్తిగిలిపడుకున్న నూరమ్మ తలకింద దిండుజారిపోయి నేల మీద పడింది! చెంగుజారిపోయిన గుండు మంచంకోడుకుదగ్గరలో ఉండి ఏ మాత్రం కదిలినా కోడు తగిలేలా ఉంది!

పాలగిన్నె తీసుకుని పాలు పోయించుకుని హాల్లోకి వచ్చేసరికి- మంచం నడిమధ్యభాగంలో పద్మాననంలో కూర్చుని ఉన్న నూరమ్మ, అదోలా కళ్లెగరేసి అడిగింది "ఎన్ని పోయించుకున్నావేమిటి పాలు?" చెప్పింది కృష్ణవేణి కొట్టుకునే గుండెలతో!

"హారి దేవుడోయ్!" కీచుగా అరిచింది నూరమ్మ ఈరోజు స్వాములవార్లు భిక్షకి వస్తున్నారని తెలిసే ఈ గుక్కెడు పాలుపోయించుకున్నావా? భిక్ష అంటే గుప్పెడు బియ్యం చెంగులో పోయడం అనుకున్నావా? ఇపుడెలా? ఆ పాల వెధవ వెళ్ళిపోయాడా?" హడావిడిగా లేచింది.

"హేవిటే పొద్దున్నే గోల" మత్తుగా వచ్చి గుమ్మం దగ్గర నిల్చున్నాడు మాధవరావు!

"హేవిటా? నాఖర్మ! ఏమీ తెలియని అయోమయంమొద్దు నా కోడలవుతుందనుకోలేదు! పాలు ఎన్ని పోయించుకోవాలని కూడా తెలియకపోతే ఎలా. ఆడపుటక పుట్టాక ఇలా అయితే మన పరువు ప్రతిష్ఠ హిదుగో... హింతే!" గాలిలో రివ్వున నున్నాలు చుట్టి, బయటకు పరుగెత్తింది!

బిక్కమొహం వేసుకుని నిలబడ్డ కృష్ణవేణిని చూసి విసుక్కున్నాడు మాధవరావు, "ఆ మాత్రం తెలీదూ? ఒకటికి పదిసార్లు చెప్పించుకోవాలా?"

వాకిట్లోకి పరిగెత్తిన నూరమ్మ "అన్నయ్యగారూ, అన్నయ్యగారూ" అంటూ పెద్దగా అరిచింది పక్కింటివైపు చూస్తూ!

లోపలనుండి తలుపు ధడేలున తెరుచుకుని వచ్చారు అవధానిగారు" ఏమిటి ఏమయింది?" అంటూ!

"ఏవిటా! నా ఖర్మ! తర్వాత చెబుతాను! ముందరా పాల వెధవ పక్కింట్లో ఉన్నాడేమో కాస్త పిలవండి!"

కృష్ణవేణి అదృష్టంకొద్దీ, ఆ పాల వెధవ మరికాసేపట్లోనే విష్ణుమూర్తిలా ప్రత్యక్షమయ్యాడు!

ఈసారి నూరమ్మే పాలు పోయించుకుని- పెరటి గుమ్మందగ్గర కూర్చుని ఆవసోపాలు పడసాగింది!

"కాళ్లు పీక్కుపోతున్నాయి దేవుడోయ్! ఇంత మందిని పిలిచానే? ఎలా నమర్థించుకురాను?"

కృష్ణవేణికి అర్థమయింది!

మౌనంగా తలస్నానంచేసి బిందె తీసుకుని రేవుకి బయలుదేరింది!

బిందె తీసుకుని తల వంచుకుని వెళుతున్న కృష్ణవేణిని జాలిగా చూస్తూ అవధానిగారు పిట్టగోడమీదనుండి నూరమ్మతో అన్నాడు!

"ఎందుకండీ! పాపం చిన్నపిల్ల, అలవాటు లేని పనులు? ఆ అమ్మాయిని తిప్పలుపెట్టే బదులు, మన మంగమ్మ పిన్ని ఉంది కదా? నెలకు పది రూపాయిలిస్తే, ఎన్ని బిందెలు కావాలంటే అన్ని బిందెలు పోస్తుంది!"

ఉరిమి చూసింది నూరమ్మ "ఎవరూ మొగుడొదిలేసిన ఆ పక్షా? దాని చేతి నీళ్ళు తాగేకంటే- కృష్ణలో మునిగి ఛావడం నయం"

"ఏమిటో మీ ఛాదస్తాలు కాని ఇంకా కట్టెల పొయ్యి, కుంపట్లు పట్టుకు వేళాడుతున్నారు. శుభ్రంగా గాను పొయ్యి, స్టవులూ ఉండగా కూడా"

ఇంకోసారి ఆ మాట నా దగ్గర అనమాకండి! హవ్వ! కిరస్తానీ పద్ధతులు మాయింటా వంటా లేవు! స్టవుల మీద వండిన వంట నైవేద్యం పెడితే నా యింటి దేవుడు స్వీకరిస్తాడనే? అసలు ఈ అగ్నిహోత్రుల నూరమ్మ అంటే ఏమిటనుకున్నారు? ఆ రోజుల్లో, ఆ మహారాజు బతికున్న రోజుల్లో, కృష్ణ ఒడ్డుకు వెళ్ళి, నరుగుడు కొమ్మలు కొట్టుకొస్తే, వాటిమీద కృష్ణ నీళ్ళతో వంట వండితే, కాని తినే వాళ్ళు కాదు! రోజులు ఇట్లా తగలడి స్టవులూ, గ్యాసులూ వచ్చాయి కాని, ఒకళ్ళని చూసి వాతలు పెట్టుకోవాల్సిన ఖర్మ మాకు పట్టలేదు! మా ఇంట ఆ నాటి నుండి ఈ నాటివరకు అదే అగ్నిహోత్రం అవే పద్ధతులూ, లేదంటే, నేనూ నా మడీ నా ఆచారం హిదుగో హింతే!" అవధాని



తలమీదుగా రయ్‌మంటూ సున్నా చుట్టి విన విసా లోపలికి వచ్చింది!

రోజూకంటే మూడు బిందెలు ఎక్కువే తెచ్చింది కృష్ణవేణి!

తల తుడుచుకుని పాడిబట్ట కట్టుకుని వచ్చేసరికి, సూరమ్మ కాఫీ కలిపి ఇచ్చింది!

కాఫీ గ్లాసు చేతిలో పట్టుకుని హాల్లోకి వచ్చి-మంచంమీద కూర్చుని, నెమ్మదిగా తాగసాగింది కృష్ణవేణి!

అదే సమయానికి ఏదో పనిమీద హాల్లోకి వచ్చిన సూరమ్మ కెవ్వు మంటూ అరిచి విరుచుకు పడబోతుంటే- పెరట్లోనుండి పరిగెత్తుకొచ్చిన మాధవరావు "ఏమిటి? ఏమయింది" అంటూ అడిగాడు ఖంగారుగా.

అటువైపు చూపించిది సూరమ్మ వేలుపెట్టి!

అది తనవైపేనన్న సంగతి గ్రహించి, ఎందుకో అర్థంకాక తడబడుతూ లేచి నిల్చుంది కృష్ణవేణి!

అర్థమయిన మాధవరావు కోపంగా అన్నాడు "మొద్దూ! ఆ మాత్రం తెలియదూ! భోజనమెంతో కాఫీ అంత! భోజనం మంచాలమీద కూర్చుని తింటామా? అంటు!"

కృష్ణవేణికి ఎందుకో హఠాత్తుగా భయంవేసింది!

ఏవిటీ మూఢత్వం? ఇంత వికృతంగా ఆలోచిస్తున్నారేమిటి?

మౌనంగా లేచివెళ్ళి గ్లాసు అంట్ల గిన్నెలమధ్య పడేసి వచ్చి కూర్చోబోతుంటే మళ్ళీ అరిచింది సూరమ్మ!

"ఓసి మొద్దా! కాఫీ తాగి చెయ్యి కడుక్కోవాలని తెలియదూ! అంటు చెయ్యి" మాధవరావు తల్లి ఫీలింగ్‌ని అనువదించాడు!

సూరమ్మ ఎంతో వింతగా, భయంభయంగా, అడివి మనిషిని చూసినట్లు కృష్ణవేణిని చూస్తూంటే-

కృష్ణవేణి కూడా ఖచ్చితంగా అదే భావాలతో సూరమ్మవైపు చూడసాగింది! కృష్ణవేణి ఇక అక్కడ ఉండదల్చుకోలేదు! గబగబా పెరట్లోకి నడవబోతుంటే వెనకనుండి మాధవరావు తల్లితో అంటున్నాడు "బాధపడమాకవే! ఏం చేస్తాం? మన ఖర్మ! కాసిని పసుపునీళ్ళు జల్లుదాం!"

కాసేపటికి సూరమ్మ,కృష్ణవేణి వంటపనిలో పడ్డారు!

స్వామివారి భిక్ష అని రకరకాలు చేసింది సూరమ్మ!

అంతా అయేసరికి పదకొండు అయింది! సూరమ్మ హాల్లో కూర్చుని ఎదురుచూడసాగింది!

ఈలోపల మాధవరావు తలస్నానం చేసి ఎర్రటి పట్టుబట్ట కట్టి సిద్ధంగా ఉన్నాడు!

ఆరోజు ఆఫీసుకి సెలవుపెట్టాడు!

మాధవరావు సెలవలన్నీ సాధారణంగా, ఇలా అభిషేకాలకనీ, ఉపవాసాలనీ, పూజలనీ వీటికే అయిపోతుంటాయి.

అరగంట గడిచింది.

అపుడు హఠాత్తుగా.

వాకిట్లోనుండి పెద్ద స్వరాలతో "హరోం-హర హర హర!" అంటూ విన్పించింది! సూరమ్మ ఒక్క ఉదుటున లేచి బయటకు పరిగెత్తింది. ఆ వెనకే మాధవరావు! వాకిట్లో- కాషాయాంబర ధారులయిన స్వాములవారు, దట్టంగా పెరిగిన గడ్డంచాటునుండి చిద్విలాసంగా నవ్వారు!

ఆ నవ్వుకే ఒళ్ళు పులకలెత్తిపోయింది సూరమ్మకి!

అమాంతం ఆయన పాదాలమీద సాష్టాంగ నమస్కారం పడింది! వెంటనే రియాక్షన్‌లో మాధవరావు కూడా దభేలుమని ఆయన పాదాలమీద పడ్డాడు!

స్వాములవారి వెనక దడికట్టినట్లుగా నిల్చున్న ఆరుగురు శిష్యపరమాణువులు మళ్ళీ "హరోం! హర హర" అంటూ అరిచారు!

నున్నగా గీయించుకున్న గుండు, మెడలు తాకుతున్న పొడవాటి పిలకలు, మెడలో నిండుగా రుద్రాక్షమాలలు, నుదుట దట్టంగా పట్టించిన వీబూధి రేకలు, పొడవాటి అంగీల్లాంటి కాషాయవస్త్రాలు- ఒకరి చేతిలో కంజీర, మరొకరి చేతిలో తబల, మరొకరి చేతిలో తంబురాతో స్వాములవారి శిష్యులు, ఒక్కసారిగా,





అంతసేపు నములుతున్న కిళ్ళీలను ఉమ్మేసి ఎర్రటి నోళ్లు తెరిచి, శూన్యంలోకి చూస్తూ, వాయిద్యాలు మోగిస్తూ స్వాములవారికి జేజేలు పలికారు. పులకరింతతో పరవశించిపోతున్న నూరమ్మ, మాధవరావులు లేచి ఆయన్ను లోపలికి ఆహ్వానించారు!

ఆయన తన కోసం ప్రత్యేకంగా వేసిన ఆసనంమీద ఆశీనులయ్యారు!

ఈలోపల నూరమ్మ ఆయన పాదాలవద్ద పెద్ద పళ్ళెం ఉంచగా, స్వాములవారు ఆ పళ్ళెంలో పాదాలు ఉంచారు!

మాధవరావు భక్తిగా నీళ్ళు పోస్తుంటే, నూరమ్మ ఆయన పాదాలు కడిగి, భక్తిగా ఆ నీటిని శిరస్సుమీద చిలకరించుకుంది! మాధవరావు దోసిలితో నీళ్ళు తీసుకుని నెత్తిమీద చిలకరించుకుంటూ ఉంటే నెమ్మదిగా అడిగింది నూరమ్మ "ఒరేయ్, నీ పెళ్ళామేదీ!"

వెంటనే వంటింటివైపు తొంగిచూస్తూ అరిచాడు మాధవరావు "ఇదిగో! ఒసేవ్! నిన్నే!"

అపుడు అడుగుపెట్టింది కృష్ణవేణి హాల్లోకి!

అంతసేపు ధ్యానముద్రలో ఉన్న స్వాములవారు దిగ్గున కళ్లు తెరిచారు.

ఎర్రటి కళ్ళనుండి బాణంలా దూసుకువచ్చిన ఆయన చూపులవాడికి, కృష్ణవేణి ఒళ్లు ఒక్కసారిగా జలదరించింది! వెన్నులో ఏదో జరజర పాకినట్లయింది!

మౌనంగా తలవంచుకుని, భుజాల నిండుగా పవిట కప్పుకుని నిల్చున్న కృష్ణవేణి భుజంమీద సన్నగా ఓ పోటు పొడిచి అన్నాడు మాధవరావు, "ఒసేవ్! వంగి వారి పాదస్పర్శచే పునీతమయిన ఆ నీటిని నెత్తిమీద జల్లుకో! ఊ!"

కృష్ణవేణి నెమ్మదిగా వంగింది!

పళ్ళెం నిండుగా, మురికిగా మట్టిరంగులో ఉన్న నీళ్ళలో... స్వామివారి పాదాలు. ఆ పాదాలమీద నల్లటి మచ్చలు... అక్కడక్కడా పొడలు,

గబుక్కున కళ్లు మూసుకుని, నీళ్ళలో చేతివేళ్ళు అంచులు ఉంచి, పైకి తీసి, నెత్తిమీద సన్నగా జల్లుకుంది!

వెనకనుండి నూరమ్మ అంటోంది గద్గద స్వరంతో "స్వామీ! ఒట్టి అయోమయం మనిషి ఏమీ తెలియని తనం! మంచి అనాలో తెలియదు! చెడు అనాలో తెలియదు! ఒక సంప్రదాయంలేదు! మడీ ఆచారాలు అసలేలేవు! కాస్త ఆ అమ్మాయికి జ్ఞానోదయం అయ్యేలా మీరే ఏదో ఒకటిచేసి పుణ్యం కట్టుకోండి! నా కొడుకు కాపురం నిలబెట్టండి!"

అంతసేపు కళ్లు పెద్దవిచేసి కృష్ణవేణి శరీరాన్ని ఎక్సరే చూపులతో తూట్లు పొడుస్తున్న స్వాములవారు హఠాత్తుగా బిగదీసుకుపోయి, కళ్లు మూసుకుని, ఏదో జపం చేస్తూ, జోలెలో చేతులు పెట్టారు!

తర్వాత ఆ చేతిని బయటకు తీసి, కళ్ళు తెరిచి, విశాలంచేసి, కృష్ణవేణి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ ముందుకు వంగమన్నట్లుగా సైగచేశారు!

వెనకనుండి వీపుమీద చేతితో నొక్కింది నూరమ్మ ముందుకు వంగమన్నట్లుగా! ముందుకి కొంచెం వంగిన కృష్ణవేణి కళ్ళ ముందు స్వాములవారి కళ్ళు సూటిగా ఇటే చూస్తూ, ఎర్రటి నాల్కలతో బుసకొడుతూ, వేడి నిట్టూర్పులు వదులుతూ.

శరీరం అప్రయత్నంగా కంపించింది కృష్ణవేణికి!

స్వాములవారు చెయ్యెత్తి, బొటనవేలుతో విబూధిని కృష్ణవేణి నుదుట పెట్టారు. అలా పెట్టిన బొటనవేలు రెండు క్షణాలవరకు కృష్ణవేణి నుదుటిమీదనే ఉన్నది.

ఎర్రటి భగభగ కాలుతున్న ఇనుపరాడ్ నుదుటిలో దిగబడుతున్న భావన కల్గింది ఆ క్షణంలో కృష్ణవేణికి!

ఆ స్పర్శకే శరీరమంతా కొలిమిలో కాలిపోతున్నట్లనిపించింది!

బొటనవేలు తీయగానే మరుక్షణం ఎవరో తరుముతున్నట్లు లోపలికి పరిగెత్తింది కృష్ణవేణి! అంతే కాదు నరాసరి బాత్‌రూమ్‌లోకి వెళ్లి ఒకటికి రెండుసార్లు ముఖం కడుక్కొంటే కాని మనసు శాంతించలేదు! గుండె చల్లారలేదు!

స్వాములవారికి, ఒకవైపు నుంచుని వినసకర్ర పట్టుకుని విసురుతున్న నూరమ్మ నెమ్మ

దిగా, భక్తిగా అడిగింది.

"స్వామీ, క్షీరంలాంటి ద్రవపదార్థమేద యినా సేవిస్తారా?"

వద్దన్నట్లుగా తలూపారు స్వాములవారు.

"ఓహెూహెూ! సాక్షాత్తు దైవస్వరూపులు" అని పులకరించిపోయిన సూరమ్మ మళ్ళీ అడిగింది పోనీ, నారికేళతీర్థమయినా"

మళ్ళీ అడ్డంగా తలూపారు.

"ఆహా హ! సాక్షాత్తు పరమేశ్వర స్వరూపులు!" కళ్ళల్లో నీళ్ళు ఊరుతుంటే తట్టుకోలేక చేతులెత్తి నమస్కారం చేస్తూ అడిగింది" 'కనీసం కృష్ణ తీర్థమయినా" స్వాములవారు చిరునవ్వుతో తల అటూ ఇటూ ఊపి నెమ్మదిగా జోలెలో నుండి ఓ పాకెట్ తీసి "మాకు ఇదే అలవాటు" అన్నారు!

"ఓహెూహెూ... సాక్షాత్తూ" ఇంకేదో అనబోయిన సూరమ్మ, క్షణంసేపు ఆ పాకెట్‌వైపు అనుమానంగా జూసి అస్సాం టీ పొడి పాకెట్ అని గుర్తించి ఏమనాలో తోచక "నిమిత్తమాత్రులు" అని పూర్తి చేసింది!

మాధవరావు హడావిడిపడిపోతూ "ఇదిగో ఒసేవ్ ఇలారా!" అంటూ కేక వేసాడు! కృష్ణవేణి హాల్లోకి వచ్చేసమయంలో స్వాములవారు మాధవరావుని అడుగుతున్నారు.

"ఎందుకు నాయనా! చక్కని నామధేయము ఉండగా... అలా పిలుస్తావు?" చప్పున కృష్ణవేణి భర్త మొహంవైపు చూసింది!

ఇది కూడా ఆచారం అంటారేమోనని భయపడింది కాని, అదృష్టవశాత్తూ "ఏదో అలవాటు" అని గొణిగాడు మాధవరావు.

కృష్ణవేణి రాగానే టీపాకెట్ ఆమె చేతిలో పెట్టి పురమాయించాడు! సూరమ్మ స్వాములవారివైపు తిరిగి అడిగింది "ఈ లోపల కాస్త- ఈ పాపిష్టి చెవుల్లో ఏదయినా జ్ఞానామృతాన్ని బోధించండి స్వామి!"

శిష్యులు వాయిద్యాలు బయటికి తీసారు!

కృష్ణవేణి టీ కలుపుకువచ్చే సమయానికి హాలులో పద్మాసనంలో కళ్ళు మూసుకుని కూర్చున్న స్వాములవారు ఆయనకు ఎదురుగా... కంజీర, తబల, మద్దెలా మోగిస్తూ గాలిలో అంతెత్తున గంతులువేస్తూ పెడబొబ్బలు పెడుతూ, ధారాపాతంగా కారే చెమటలతో శిష్యులు.

ఎంతో పరిశీలనగా వింటే తప్ప అది భజన అని అర్థంకాదు! సూరమ్మ అయితే భక్తిపారవశ్యంతో ఊగిపోతోంది! కళ్ళవెంబడి నీళ్ళు ధారాపాతంగా కారుతున్నాయి! నెత్తిమీది చెంగు జారిపోయినా గమనించలేదు! అసలు ఈ లోకంలోనే లేనట్లు ఉన్నది.

మాధవరావు పరిస్థితీ దాదాపు అదే!

టీ కప్పులు పెట్టిన ట్రేతో వచ్చిన కృష్ణవేణిని చూసిన స్వామిజీ చిరునవ్వు నవ్వి శిష్యులకి ఆపమన్నట్లుగా సైగచేసారు!

అందరూ చెమటలు కక్కుతూ ఆయాసపడుతూ టీ త్రాగారు!

మరో అరగంటలోనే భోజనాలు ఏర్పాటయాయి!

మడిగట్టుకుని సూరమ్మ, మాధవరావు వడ్డించారు! కృష్ణవేణిని ఆ ఛాయలకు కూడా రానీయలేదు!

చాలా హాయిగా సీలయింది కృష్ణవేణి!

* * *

కృష్ణవేణి కాపురానికి వచ్చి మూడు నెలలు దాటి నాలుగు వస్తోంది! ఎందుకో ఈమధ్యన మరీ మరీ అన్పిస్తోంది! ఒక్కసారి తమ ఊరికి వెళ్ళిరావాలనీ, అన్నయ్యను చూడాలనీ, బాబుగారిని పలకరించాలనీ, వేణుగోపాలుడిని దర్శించాలనీ, కృష్ణమ్మ చల్లటి స్పర్శను మనసుదీరా అనుభవించాలనీ, మనసు కొట్టుకుపోవడమంటే ఏమిటో అపుడు అర్థమవుతోంది కృష్ణవేణికి! అందరూ గుర్తుకొస్తుంటే పదేపదే కళ్లు చెమ్మగిల్లుతున్నాయి!

గదిలో కూర్చున్న కృష్ణవేణి బయటకు వచ్చి హాల్లోకి తొంగిచూసింది!

హాల్లో ఉయ్యాల బల్లమీద దిండు వేసుకుని, కాలుమీద కాలువేసుకుని హాయిగా ఊగుతున్నాడు మాధవరావు!

సాధారణంగా తన మాట భర్త కాదనడనే నమ్మకం ఉంది కృష్ణవేణికి! అయినా అడిగి ఒప్పించడం తన ధర్మం!




అడుగులు శబ్దంకాకుండా హాల్లోకి వచ్చింది!

కళ్ళెత్తి చూసిన మాధవరావు, చాలా రోజుల తర్వాత మనస్ఫూర్తిగా నవ్వి ఏమిటన్నట్లు కనుబొమలెగరేసాడు!

వాకిట్లో పిట్టగోడ దగ్గర సూరమ్మ- అటువైపు నుండి అవధానిగారు -ఏవో కబుర్లు చెప్పు కుంటున్నారు!

మాధవరావు పక్కనే మొహమాటంగా నిల్చున్న కృష్ణవేణికి ఆ దృశ్యం కిటికీలోనుండి కన్పిస్తోంది!

సూరమ్మ ఎందుకో పడీపడీ నవ్వుతోంది! తలబాదుకొంటోంది! రయ్‌రయ్‌మంటూ అవ ధానిగారి తలమీదుగా సున్నాలు చుడుతోంది!

ఆయన కూడా నవ్వుతూ ఏదో అంటున్నారు, నడుము మీద చేతులు పెట్టుకుని!

హఠాత్తుగా గుర్తుకువచ్చినట్లుగా అన్నాడు మాధవరావు "ఒసేవ్! మంచినీళ్ళు తీసు కురా!"

నిజానికి దాహం వేసిందో లేదో తెలియదు, కాని ఎదురుగా భార్య కన్పించగానే ఏదో ఒకటి ఆజ్ఞాపించాలనిపించినట్లుంది.

ఇది చాలాసార్లు గమనించింది కృష్ణవేణి!

కాస్త ఖాళీగా కన్పిస్తే చాలు ఏదో ఒక పని పురమాయిస్తాడు!

పోనీ- దాహం కదా అని మంచినీళ్లు తీసు కువెళితే, ఒక్క గుక్కడు తాగి పక్కన పెట్టేస్తా డు!

భర్తగా, భార్యని ఆజ్ఞాపించడం, అజమా యిషీ చేయడం లాంటివి మాధవరావుకి చాలా యిష్టం అని మొదటి వారంలోనే గమ నించింది కృష్ణవేణి!

ముఖ్యంగా ఆ సంబోధన!

"కృష్ణా! కృష్ణవేణీ! అమ్మా కృష్ణవేణీ!" లాంటి పిలువులికి అలవాటుపడ్డ కృష్ణవేణి ఇలా "ఒసేవ్! ఏమేవ్! ఇదిగో!" లాంటి పిలుపులకు అలవాటుపడటానికి చాలా కష్టప డాల్సివస్తోంది!

అలా పిలవడంలో మాధవరావు చాలా గొ ప్పగా ఫీలవుతుంటాడు!

కృష్ణవేణి గ్లానుతో మంచినీళ్లు తీసుకుని హాల్లోకి వచ్చేసరికి, అపుడు సూరమ్మ కూడా లోపలికి వస్తోంది పెద్దగా అడుగుల శబ్దం చేసుకుంటూ, ముఖం ఎందుకో ధుమధుమలా డుతోంది!

కృష్ణవేణి ఆశ్చర్యపోయింది!

అదేమిటి? ఇపుడేగా తను, ఆమెని పడీపడీ నవ్వుతున్న దృశ్యం చూసింది! ఇంతలో ఏమ యింది?

తల్లి ముఖాన్ని చూసిన మాధవరావు ఉయ్యాలబల్లమీద లేచి కూర్చుని అడిగాడు

"ఏవయిందే?"

ఠపీమని నుదురుమీద కొట్టుకుని చెప్పింది సూరమ్మ "చెప్పడానికీ- చెప్పుకోడానికీ ఏముందీ నా ఖర్మ! పక్కన అవధానిగారి కోడలు, కాపురానికివచ్చి రెండు, రెండంటే రెండు నెలలయింది! అపుడే దానికి రెండోనె లట! హు! అదృష్టం ఉండాలి దేనికయినా! నట్టింట ఓ పిల్లా, ఓ జెల్లా"

కృష్ణవేణికి అర్థంఅయింది!

నెలరోజులనుండి పిల్లిమీదపెట్టి, కాకిమీద పెట్టి ఈ విషయంలో ఏదో గునుస్తూనే ఉంది సూరమ్మ!

అడగదల్చుకున్న విషయం ఎప్పుడో గాలికి ఎగిరిపోయింది. మాధవరావు దవడ ఎముక బిగించి పావుగంటసేపు ఏదో సీరియస్‌గా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

తర్వాత చరచరా గదిలోకి వచ్చి అక్కడ మంచంమీద ముడుచుకుని కూర్చున్న కృష్ణవే ణివైపు చూస్తూ అన్నాడు "ఇదిగో ఎందుక యినా మంచిది! ఓసారి సిటీ వెళ్ళి డాక్టరుద గ్గర పరీక్ష చేయించుకుందాం! త్వరగా రెడీ అవ్వు"

కట్టుకున్న పాత లుంగీ ఉండలుగా చుట్టి భార్యమీదకి విసిరేశాడు. అంటే దానిని ఉతకా లని అర్థం. మాధవరావు సౌమ్యంగా ఏదీ చేతికి ఇవ్వడు. అన్నీ ధాష్టికంగానే చేస్తాడు. తర్వాత కాస్త మంచి లుంగీ కట్టుకుని భు జంమీద టవల్ కప్పుకుని బయటకు వెళుతూ చెప్పాడు "నేను షేవింగ్‌కి వెళుతున్నాను నీళ్ళు రెడీచేయి!"

మాధవరావుకి ఇంట్లో షేవింగ్ చేసుకోవడం ఎప్పుడూ ఇష్టంలేదు.

అదొక సీను.

అక్కడినుండి రాగానే డైరెక్టుగా సందులో నుండి పెరట్లోకి వస్తాడు. తర్వాత భుజంమీద కప్పుకున్న టవల్ నడుముకి చుట్టుకుని నడుముకి కట్టుకున్న లుంగీ విప్పి దానిని బావి గట్టుమీద పెడితే, సూరమ్మ ఒక పొడవాటి కర్రతో శవంమీది గుడ్డని తీసినట్లు దానిని కర్రతో లేపి అదే డైరెక్షన్‌లో తీసుకెళ్ళి బాత్‌రూమ్‌లో బొక్కెనలో పడేస్తుంది. తర్వాత తడిగుడ్డతో ఆ లుంగీని ఆరేస్తుంది.

పెళ్ళి అయ్యాక ఆ కార్యక్రమం కృష్ణవేణి నెత్తిమీద పడింది. కర్రతో లుంగీని జారిపోకుండా పట్టుకుని తీసుకువెళ్ళడం సర్కస్‌ఫీట్ చేస్తున్నట్లుగా అన్పిస్తుంది.

ఓ ఇరవయి నిముషాలలో నున్నగా గీయించుకున్న గడ్డం, మీసంతో నిగనిగలాడుతూ వచ్చాడు మాధవరావు.

స్నానకార్యక్రమం అయింతర్వాత ఇద్దరూ రెడీ అయ్యేసరికి దాదాపు పదిగంటలయింది.

ఇద్దరూ బయలుదేరాక బయట గేటువరకు వచ్చింది సూరమ్మ.

ఇద్దరూ రేవుకెళ్ళే దారికి వచ్చారు.

కనీసం అప్పుడయినా ఫ్రీగా, స్వేచ్ఛగా మాట్లాడతాడేమో అనుకుంది కృష్ణవేణి. మాధవరావు సీరియస్‌గా ముఖంపెట్టుకుని ఎటో చూస్తూ నడుస్తున్నాడు. అంతలో ఏదో గుర్తుకొచ్చినట్లు భార్యవైపు తిరిగి ముఖం చిట్లించి అన్నాడు "ఏయ్! బుద్ధిలేదూ! ఏమిటా చీర కట్టుకోవడం? పవిట నిండుగా వేసుకోవాలని తెలియదూ! చూడు అందరూ నిన్నే చూస్తున్నారు! ఛీఛీ"

హఠాత్తుగా కృష్ణవేణి ముఖం పాలిపోయింది ఆ మాటలకి. నిజానికి గుండెలమీదకి పూలు వచ్చేట్లుగా డిజైన్ చేసిన ఈ చీరను అందరూ ప్రశంసించారు. చిన్నబోయిన ముఖంమీదకి బలవంతాన చిరునవ్వు పులిమి, భుజాలమీదుగా నిండుగా కప్పుకుని తల వంచుకుని మాధవరావుకి ఒక అడుగు వెనకగా నడుస్తూవుంటేకాని మాధవరావు తృప్తిగా ఫీలవలేదు.

రేవులో పడవ సిద్ధంగా ఉంది. ఇద్దరూ ఎక్కి కూర్చున్నారు. అవతల ఒడ్డు సిటీ చేరేటప్పటికి అరగంట పట్టింది. ఈసారి మాధవరావు హెచ్చరించకుండానే పమిట జాగ్రత్తగా నిండుగా కప్పుకుని రోడ్డుమీదకి నడిచింది.

రోడ్డుమీదకి రాగానే సిటీ బస్ వచ్చింది. ఇద్దరూ ఎక్కారు. రద్దీగా ఉన్న ఆ సిటీబస్‌లో నిల్చున్న భార్యకి దడి కట్టినట్లుగా రెండువైపులా చేతులు వేసి నిల్చున్న మాధవరావు మిగతావాళ్ళ ఊపిరి స్పర్శకూడా భార్యమీద పడకుండా ఆపడానికి నానా ప్రయాసలు పడాల్సివచ్చింది.

కనుబొమలమధ్య బొటనవేలు పరిమాణంలో మెత్తిన కుంకుమ చెమటకు ముక్కుమీదుగా కారుతున్నా లెక్కచేయక కృష్ణవేణికి ఒక దడిలా నిలబడ్డ మాధవరావుని పక్కవాళ్ళు చూసి నవ్వుకుంటుంటే కృష్ణవేణికి సిగ్గుతో చచ్చిపోయినంత పనయింది.

ఇంతలో ఎవరో స్టూడెంట్ రయ్‌మంటూ దూకుడుగా ఇద్దరిమధ్యనుంచి దూసుకుంటూ వెళ్ళాడు.

మాధవరావు కృష్ణవేణివైపు ఉరిమిచూసి అన్నాడు "ఏవిటా పూసుకోడాలు! సరిగ్గా నిలుచుంటే మన జోలికి ఎవరూ రారు! తెల్సిందా?"

కృష్ణవేణికి ఏడుపు ఒక్కటే తక్కువ!

అతి కష్టంమీద హాస్పిటల్ స్టాప్ వచ్చింది.

ట్రాఫిక్‌ని ఆపేసినట్లుగా వెనక ప్రయాణికులనందరిని చేతులు అడ్డుపెట్టి ఆపి ముందు కృష్ణవేణి దిగగానే వెనక మాధవరావు దిగాడు గట్టిగా ఊపిరి పీలుస్తూ.

వెనక ఎవరో ఏదో కామెంట్ చేశారు చిన్నగా నవ్వుతూ. మాధవరావు పట్టించుకోలేదుగాని కృష్ణవేణికిమాత్రం ఆ క్షణంలో ఎవ్వరికీ ముఖం కన్పించకుండా ఎక్కడికయినా పారిపోవాలనిపించింది.

హాస్పిటల్‌లో-

లేడీ డాక్టర్‌తో పెద్ద గొంతుతో ప్రాబ్లెమ్ గురించి సవివరంగా మాధవరావు వివరిస్తూ ఉంటే కృష్ణవేణి తలెత్తడానికి కూడా సిగ్గని





పించి కూరుకుపోయినట్లుగా కూర్చుండిపోయింది.

చిరునవ్వుతో విన్న డాక్టర్ కృష్ణవేణిని లోపలికి తీసుకువెళ్ళి టెస్ట్‌చేసింది. పావుగంట తర్వాత ఇద్దరూ బయటపడి గబగబా నడవసాగారు.

మధ్యమధ్యలో సినిమా హాల్స్‌ముందు పెద్ద పెద్ద బానర్స్, కటౌట్స్‌ముందు కాస్త నిదానంగా నడుస్తున్న కృష్ణవేణిని విసుగ్గా చూసేవాడు.

మాధవరావు దృష్టిలో ఇవన్నీ పోకిరీ, అలగా సినిమాలు. పెళ్ళి అయిన తర్వాత అతి కష్టంమీద ఒక్క సినిమాకి వెళ్ళాడు భార్యతో. అదీ 'అష్టలక్ష్మీ వైభవం' కాబట్టి! లేకపోతే అసలు చూడడు!

పెద్దపెద్ద షాప్స్‌వైపు కనీసం కన్నెత్తి కూడా చూడకుండా వెళుతున్న భర్తని తలచుకుని నిట్టూర్చింది కృష్ణవేణి.

'సినిమాలు, షికార్లు, షాపింగ్‌లులాంటి పదాలు ఆయన డిక్షనరీలో లేనేలేవు అనే ఫీలింగ్‌కి తనమీద తనకే జాలి వేస్తోంది.

ఇంతలో ఎవరో తనని పిలుస్తున్నట్లుగా అన్పించి ఆగింది కృష్ణవేణి!

"ఏయ్ కృష్ణవేణీ! నిన్నే!" తనవైపే వస్తున్న ఆ నడివయసావిడని చప్పున గుర్తుపట్టింది కృష్ణవేణి. రాధాదేవి....

వాళ్ళకి కాస్తదూరంలో విసుగ్గా నిల్చున్నాడు మాధవరావు.

"కృష్ణా! నువ్వేనా? ఏమిటీ అవతారం? అన్నం తింటున్నావా? గాలి భోంచేస్తున్నావా? ఏమిటి ఇలా చిక్కిశల్యమయిపోయావు? నల్ల బొగ్గయిపోయావు? అన్నయ్యమీద దిగులా ఏమిటీ ఖర్మ? అన్నట్లు... గిరి ఏమంటున్నాడు. ఇప్పటికయినా పెళ్ళి చేసుకుంటానంటున్నాడా? అంటే చెప్పు! రాజకుమారిల్లాంటి సంబంధాలున్నాయి!"

గలగలా మాట్లాడుతున్న రాధాదేవి ప్రశ్నలకు చిరునవ్వుతోనే సమాధానాలిచ్చింది కృష్ణవేణి.

రెండు నిముషాల తర్వాత రాధాదేవే వదిలిపెడుతూ అన్నది "అదిగో మీవారు వెయిట్‌చేస్తున్నట్లున్నారు. మరి నే వస్తాను" అని ముందుకునడిచి జనంలో కలిసిపోయింది.

కొంతదూరం వెళ్ళాక అనుమానంగా అడిగాడు మాధవరావు "ఎవరామె? ఈ సిటీలో నీకెలా పరిచయం?"

"రాధాదేవి అని మా అత్తయ్యవాళ్ళద్వారా పరిచయం! ఎక్కువగా పెళ్ళిసంబంధాలు అవీ చూస్తూ ఉంటుంది! నాకు కూడా నాలుగయిదు సంబంధాలు ఆవిడే చెప్పింది పాపం. ఇప్పుడు మా అన్నయ్యకి అడుగుతోంది!"

మనసులోనే క్షణంసేపు ఉలిక్కిపడ్డాడు మాధవరావు. అయితే దానిని కప్పిపుచ్చి అడిగాడు "అయితే మనపెళ్ళికి ముందు నలుగురు చూశారా?"

"ఆఁ!"

"మరి ఎందుకు కుదరలేదు?" గుచ్చిగుచ్చి అడిగాడు.

"ఏమో! నేనే వాళ్ళకి నచ్చినట్లు లేదు!" అప్పటికి కృష్ణవేణి ఇంకా భర్త ముఖం చూడలేదు. చూసివుంటే మాధవరావు కళ్ళల్లో మెరమెరలాడుతున్న భావాల్ని పసిగట్టి ఉండేది!

మామూలుగా తలొంచుకుని నడుస్తూ చెబుతోంది.

"అయితే పెళ్ళిచూపుల్లో ఇద్దరూ మాట్లాడుకున్నారా? విడిగా గదిలోకి వెళ్ళి ఒంటరిగా చర్చించుకున్నారా?"

అప్పుడు తలెత్తింది కృష్ణవేణి.

తన పెళ్ళికి పూర్వం నలుగురయిదుగురు మగపెళ్ళివాళ్ళు కృష్ణవేణిని నఖశిఖ పర్యంతం పరిశీలించారనే ఆలోచనతోనే మాధవరావు ముఖం ఎర్రబడింది. భార్య ఇంకా ఏదో దాస్తోందనిపిస్తోంది. లేకపోతే ఆ మౌనమెందుకు?

కృష్ణవేణికి ఆ క్షణంలో భర్తని చూస్తుంటే కోపం రాలేదు. మొట్టమొదటసారిగా జాలివేసింది.

సమాధానం చెప్పకుండా ముందుకు నడిచింది.

బస్సులో, పడవలో కూడా మాధవరావు అసంతృప్తిగా ఏదో పోగొట్టుకున్నవాడిలా ముభావంగా ఉన్నాడు.

ఇద్దరూ మౌనంగా ఇంటికి వెళ్ళారు. ఇంట్లో అడుగుపెడుతూనే వాతావరణంలో మార్పు గమనించింది కృష్ణవేణి. మళ్ళీ ఏదో ఉపద్రవం వచ్చిపడింది. లేకపోతే అలా చెంగు మండిగంమీద పరచుకుని ఏమీ పట్టనట్లు అలా పడుకోదు సూరమ్మ.

వీళ్ళని చూడగానే ఛ్రున లేచి విసవిసా పెరట్లోకి వెళ్ళి ఛర్రుమంటూ చీది లోపలికి వచ్చింది. ఎందుకో కళ్ళు ఎర్రగా ఉబ్బివున్నాయి.

అసలు కారణం కాసేపటికి కాని తెలియలేదు కృష్ణవేణికి. హాల్లో ఉయ్యాల బల్లమీద కూర్చున్న మాధవరావు ఎదురుగా కళ్ళొత్తుకుంటూ మధ్యమధ్యలో చీదుతూ ఎగబీలుస్తూ చెబుతోంది సూరమ్మ.

"ఏదో పెద్దముండని! మీ శ్రేయస్సు కోరి డాక్టరు దగ్గరకు వెళ్ళిరమ్మని చెప్పి సాగనంపడానికి గేటువరకూ వచ్చానే! హయ్యో! 'వెళ్ళొస్తాను అత్తయ్యా!' అని ఒక్క ముక్క అన్నదా? ఏం? ముత్యాలు రాలిపోతాయా? బయటపడిందే తడవుగా టింగురంగా అంటూ మొగుడితో వెళ్ళకపోతే వెనక్కి తిరిగి ఒక్క మాట! హు! ఏం మనిషో! అవునులే! తప్పు ఒకళ్ళది కాదు! ఇలాంటి సంబంధం చేసుకున్న మనది! పక్కన అవధానిగారి కోడలు స్నానానికి వెళుతున్నా చెప్పి వెళుతుంది. భోజనానికి కూర్చున్నా మామగారి అనుమతి తీసుకుంటుంది. మన ఖర్మ ఇదంతా!"

కృష్ణవేణికి నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు. ఇంత చిన్నవిషయానికి అంత పెద్ద రాద్ధాంతమా? ఆ రాత్రి ఆకలి లేదని అన్నం తినకుండానే పడుకుంది కృష్ణవేణి.

★ ★ ★

మాధవరావు భోజనం తొమ్మిదింటికల్లా అయిపోతుంది. వెంటనే ఆఫీసుకి వెళ్ళిపోతాడు. మాధవరావు అటు వెళ్ళగానే కృష్ణవేణి ఎప్పటినుండో అనుకుంటున్న ఆ ఆలోచన ఆచరణలో పెట్టాలనుకున్నది. రేవుకి మంచినీళ్ళకోసం వెళ్ళేటప్పుడు రోజూ చూసేది జిల్లా గ్రంథాలయం. మధ్యాహ్నం పూట కాలక్షేపానికి పుస్తకాలు చదివి చాలా రోజులయింది. వెంటనే లేచి గబగబా పర్సులో డిపాజిట్‌కోసం అని డబ్బు పెట్టుకుని, సూరమ్మకి చెప్పడానికి వెళ్ళబోతుంటే వంటింట్లోనుండి సూరమ్మే ఎదురువచ్చింది.

కోడలు ఎక్కడికో బయలుదేరడానికి సిద్ధమయిందని సూరమ్మ చురుకయిన బుర్ర వెంటనే పసిగట్టింది. కృష్ణవేణి విషయం చెప్పింది.

మరుక్షణం - వెర్రిగా కీచుకేక పెట్టి వెనక్కి విరుచుకుపడబోయిన సూరమ్మ అతి కష్టంమీద గుమ్మం ఆసరాగా నిలదొక్కుకుని కోడలివేపు గుడ్లురిమిచూస్తూ అన్నది

"ఏమిటీ... లైబ్రరీకా? ఇక రోజూ మొగుడటు వెళ్ళగానే పోకు చేసుకుని నువ్విటు పుస్తకాలకోసమని లైబ్రరీకి బయలుదేరతావా? ఇంకానయం? ముందుగా చెప్పావు ఆ సంగతి! ఈ ఊరి లైబ్రరీ అంటే ఏమనుకుంటున్నావు నువ్వు? ఒకవైపు గ్రామపెద్దలు వచ్చి రాజకీయాలు చర్చిస్తూ వుంటారు. మరోవైపు పోకిరీ కుర్రాళ్ళు కూర్చుని సినిమా పుస్తకాలు తిరగేస్తుంటారు. వాళ్ళమధ్యకి అగ్నిహోత్రులవారింటి కోడలివయిన నువ్వు వెళతాననడానికి నీకు నోరెలా వచ్చిందే!"

అప్పటికే కృష్ణవేణికి ఎక్కడలేని నీరసం కమ్ముకువచ్చింది.

దిగాలుపడినట్లుగా అయిన కృష్ణవేణిని చూసి సూరమ్మ చిద్విలాసంగా నవ్వి అన్నది "ఎందుకలా దిగులుపడతావు? పిచ్చిపిల్లా? పుస్తకాలు కావాలంటే నీకు లైబ్రరీవే కావాలా? మనింట్లో లేవనా? నన్నడిగితే ఇవ్వనూ?"

ఉలిక్కిపడింది కృష్ణవేణి! ఈ యింట్లో పుస్తకాలు కూడానా? తల్లకిందులయినట్లుగా చూస్తున్న కృష్ణవేణిని చూసి మళ్ళీ నవ్వింది సూరమ్మ. చెయ్యి పట్టుకుని వంటింటికి ఆనుకుని ఉన్న స్టోర్‌రూమ్‌లాంటి చిన్న గదిలోకి తీసుకెళ్ళి ఓ పాతకాలంనాటి భోషాణంముందు నిలబడింది.

'చూశావా? పుస్తక భాండాగారం!' అన్నట్లుగా కోడలివైపు ఒక్కక్షణం చూసి ఆ భోషాణం తీసింది.

అంతే...!

ఇంతెత్తున లేచిన దుమ్ముధూళితో రెండు




నిముషాలవరకూ ఉక్కిరిబిక్కిరయిపోయింది కృష్ణవేణి. ఆగకుండా పది తుమ్ములు వచ్చాయి. తుమ్మి తుమ్మి చెవులనుండి ముక్కువరకూ ఎర్రబడిపోయాయి.

తర్వాత సూరమ్మ లోపలికి చేయిపెట్టి ఒక పుస్తకాల దొంతర పైకితీసింది. లక్ష్మణస్వామి మూర్ఛ, సీతమ్మవారి వామనగుంటల ఆట, నలకుమార చరిత్రము, అయిదుగురు పతివ్రతలు, ఇరవయి ఎనిమిది వ్రత కథలు, సతీసుమతి, సతీ అనసూయ...

పుస్తకాలు చూడటం మొదలెట్టిన మరుక్షణం కృష్ణవేణి ఆముదం తాగినట్లుగా మొహంపెట్టింది.

సూరమ్మ చెబుతోంది. "చూడు! మహామహా గ్రంథాలు! నిత్యపారాయణ గ్రంథాలు. హాయిగా చదువుకో! కనీసం అపుడయినా మంచి జ్ఞానం కలుగుతుందేమో!"

కృష్ణవేణి చేతిలోని పుస్తకాలు అక్కడే పడేసి హాల్లోకి వస్తుంటే విస్తుపోయిన సూరమ్మ వెంటనే ముఖం ఎర్రనచేసుకుని కోపంగా అన్నది "అవునులే! నీకెందుకు నచ్చుతాయి? ఆ లైబ్రరీలోని పోకిరీ పుస్తకాలయితే ఎగబడి చదువుతావుగాని ఇవెందుకు ఆనతాయి! ఏవిటో నా పిచ్చిగాని ఓ మంచా? ఓ చెడనా...?" వాక్ప్రవాహం సాగిపోతూనే ఉన్నది. కృష్ణవేణి విన్పించుకోలేదు. వెళ్ళి గదిలో పడుకుంది చాలాసేపటివరకూ. మధ్యాహ్నం ఒంటిగంట ఆ ప్రాంతాల్లో బయట సైకిల్ బెల్ విన్పిస్తే గదిలోనుండి కృష్ణవేణి హాల్లో పడుకున్న సూరమ్మ బయటకు తొంగిచూశారు.

మాధవరావు సైకిల్ లోపల పెడుతుంటే సూరమ్మ అన్నది "అబ్బాయి అప్పుడే వచ్చేశాడేమిటి?"

లోపలికి వచ్చిన మాధవరావు అలాగే మంచం వాల్చుకుని వాలిపోయాడు! ముఖం గాండ్రించినట్లుగా ఉబ్బరించి ఉన్నది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. స్వల్పంగా వణుకుతున్నాడు.

"హయ్యయ్యో! జ్వరం వచ్చినట్లుంది!" ఖంగారుపడసాగింది సూరమ్మ!

ఈలోపల కృష్ణవేణి వెంటనే పిట్టగోడమీద నుండి అవధానిగారిని కేకవేసింది. ఆయన వెంటనే గోడదూకి వచ్చారు.

జలుబులు, జ్వరాలవరకూ అవధానిగారే వైద్యంచేస్తూ ఉంటారు. వస్తూనే ఆయన మాధవరావు చెయ్యి పట్టుకుని చూసి తర్వాత చెప్పారు "ఖంగారుపడాల్సిన పనేమీ లేదు. జలుబుమీద జ్వరం! అయినా మాధవరావూ! కాస్త నువ్వు ఆ నాల్గురోజులకొకసారి ఉపవాసాలు, రెండురోజులకొకసారి ఆ తలస్నానాలు తగ్గించవయ్యా!" అని కృష్ణవేణివైపు చూసి "అమ్మాయ్! నాతో కూడారా! మందు ఇస్తాను" అని బయలుదేరారు. ఆయనవెనకే వెళ్ళిన కృష్ణవేణి మందు తెచ్చేసరికి మాధవరావు దుప్పటి ముసుగుపెట్టాడు. కృష్ణవేణి గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి అవధానిగారు ఇచ్చిన మందు వేసి వెళ్ళి సూరమ్మ పక్కన నిల్చుంది.

ఓ పావుగంట తర్వాత మాధవరావు శరీరానికి చెమటలుపట్టి జ్వరం కూడా తగ్గింది.

సూరమ్మ గుమ్మందగ్గర నిలబడి అంటోంది "హయ్యో! పిల్లాడు మసిలిపోతున్నాడు. కాస్త కాళ్ళు పడదామనిగాని, తల పడదామనిగాని ఆలోచనే రాదేం? గుండ్రాయల్లే అలా నిలబడుతుందే తప్ప హు! అయినా ఆ పతివ్రతల పుస్తకాలు ఏవయినా చదివితే మొగుడుకి ఎలా సేవ చేసుకోవాలో అర్థం అవుతుంది! అయినా ఒకరిని అనుకుని ఏం లాభం! నా ఖర్మ!" విరక్తిగా అంటుంటే వెంటనే మాధవరావు ఏదో సిగ్నల్ అందినట్లు ఒక్కసారిగా అరుపులు మొదలెట్టాడు.

"అమ్మో! కాళ్ళు లాక్కుపోతున్నాయి! పాదాలు పీక్కుపోతున్నాయి! హబ్బా! హయ్యో! హీ! హూ!" కాళ్ళు ఝాడిస్తూ, చేతులు విసురుతూ, ఓవర్‌యాక్షన్‌తో మెలికలు తిరుగుతున్న మాధవరావుని చూస్తుంటే కృష్ణవేణికి నిజంగానే విరక్తి అనిపించింది.

కృష్ణవేణివైపు చూస్తూ "హమ్మా! హబ్బా!" అంటూ అరవసాగాడు.

సాధారణమయిన జ్వరానికి అలా అరుపులు, కేకలు పెడుతున్న మగవాడిని చూడటం అదే ప్రథమం!

"హయ్యో! బిడ్డడు అలా అల్లాడిపోతుంటే గుడ్లు మిటకరించి చూస్తూ కూర్చుంటావే...

వెళ్ళు కాళ్ళుపట్టు!'' సూరమ్మ కృష్ణవేణి భుజంమీద చెయ్యివేసి ముందుకి తోసింది.

స్వల్పంగా ముందుకు తూలిన కృష్ణవేణి సంబాళించుకుని నెమ్మదిగా మాధవరావు కాళ్ళ దగ్గరకు చేరింది.

మాధవరావు దుప్పటిలోనుండి కాళ్ళు బయటకు పెట్టి, కృష్ణవేణికి అందించాడు. నెమ్మదిగా కాళ్ళు వత్తసాగింది.

''హమ్మా! పైకి... పిక్కలు... పాదాలు కూడా! దేవుడా! ఇంకా గట్టిగా!'' అరవసాగాడు.

పాదాలు, పిక్కలు, కాళ్ళు వత్తసాగింది. ఎడమకాలు అవగానే కుడికాలు, మళ్ళీ ఎడంకాలు. మాధవరావు పగపట్టినట్లు, కసి తీర్చుకుంటున్నట్లు ప్రవర్తించసాగాడు.

కృష్ణవేణి భుజాలు లాగసాగాయి. వేళ్ళు పీక్కుపోతున్నాయి. చేతులు నొప్పులు పుట్టసాగాయి. దాదాపు అరగంటపైనే వత్తింది. అయినా కన్నీరు రాలేదు! గుండె రాయిచేసుకున్నట్లు మౌనంగా, శిలలా చూస్తూ మెషీన్‌లా కాళ్ళు పట్టసాగింది.

మాధవరావు విజయగర్వంతో తృప్తిగా నిట్టూర్చాడు. అతనిలోని అహం శాంతించింది.

కాసేపటికి నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాడు. కృష్ణవేణి లేచి దుప్పటి సరిచేసి గదివైపు వెళ్ళబోతుంటే సూరమ్మ పిలిచింది ''ఇదిగో ఇలారా!''

కృష్ణవేణి వంటింట్లోకి వెళ్ళింది.

''ముందర నువ్వు తలారా స్నానంచేసి చీర మార్చుకురా!'' ఆజ్ఞాపించింది.

''ఇప్పుడెందుకు స్నానం?'' ఆశ్చర్యపోతూ అడిగింది కృష్ణవేణి.

''చెబుతాగా! ముందర చెప్పిన పని చేయి!'' సూరమ్మ ముఖంలో సీరియస్‌గా కదలాడుతున్న భావాలను చూసి కృష్ణవేణి రెట్టించలేదు. మౌనంగా బాత్‌రూమ్‌లోకి వెళ్ళి తలస్నానం చేసి, చీర మార్చుకు వచ్చేసరికి సూరమ్మ దేవుడి గూటిదగ్గర కూర్చుని ఉన్నది.

కృష్ణవేణిని రమ్మన్నట్లుగా సైగచేసింది.

కృష్ణవేణి వెళ్లి ఆమె పక్కనే కూర్చుంది.

''దీపారాధన చేయి ముందు!'' ధ్యానంలో ఉన్న సూరమ్మ అన్నది నెమ్మదిగా. కృష్ణవేణి దీపారాధన చేసింది.

సూరమ్మ చేతిలో పసుపులో తడిపిన గుడ్డ ఉన్నది. దానిలో అక్షింతలు వున్నాయి. కృష్ణవేణికి చప్పున అర్థంకాలేదు. ఇప్పుడా ముడుపు కట్టాల్సిన అవసరం ఏవిటో?

సూరమ్మ చెప్పిన ప్రకారం పది నిముషాల అనంతరం... సూరమ్మ కళ్ళు విప్పి కృష్ణవేణి వైపు తిరిగి అన్నది ''కళ్ళు మూసుకుని మన కులదైవం ఈ యింటి కులదైవం వెంకటేశ్వర స్వామిని ధ్యానంచేస్తూ నేను చెప్పినట్లుగా చెప్పు!''

కృష్ణవేణి అలాగేనని తలూపి కళ్ళు మూసుకున్నది!

''స్వామీ! శ్రీనివాసా!''

''స్వామీ! శ్రీనివాసా!'' కృష్ణవేణి చెప్పింది.

''నా భర్త మాధవరావుకి ఈ మాయదారి జ్వరం తగ్గి కాళ్ళనొప్పులు తగ్గితే...'' కృష్ణవేణి వల్లించింది.

''దంపతులమిద్దరం నీ కొండకు నడిచివచ్చి ఇద్దరం తలనీలాలు సమర్పించుకొని...''

''నో...!'' వెర్రిదానిలా అరిచింది కృష్ణవేణి! ఒక్కసారిగా విసురుగా లేచి నిల్చుంది. ''లేదు... లేదు... కాదు! నావల్ల కాదు!'' వణికిపోతూ అన్నది.

ఆ అరుపుకి అదిరిపడిన సూరమ్మ అలాగే చేతులు వెనక్కి పెట్టుకుని చూస్తూ ఉండిపోయింది.

చేతిలో పసుపుగుడ్డలో ఉన్న అక్షింతలు చెల్లాచెదురుగా పడ్డాయి.

''అత్తయ్యగారూ! క్షమించండి! ఏ మొక్కులు మొక్కమన్నా మొక్కుతాను! ముడుపులు కడతాను... కాని... కాని... ఇది నావల్లకాదు''

నోరు తెరుచుకుని స్థాణువులా అలాగే ఉండిపోయిన సూరమ్మ కళ్ళు నెమ్మదిగా ఎర్రబారుతూ క్రమేపీ మంకెనపూలవలె తయారయ్యాయి.

ముక్కుపుటాలు ఎగిరెగిరి పడసాగాయి. ఊపిరి బరువుగా పీల్చి వదులుతూ ఉండ




టంవలన వెచ్చని ఆవిరి వస్తోంది.

ఆమెకి ఇది ఊహించని సంఘటన. కలలో కూడా ఎదురుకాని సన్నివేశం. తమ కుల దైవం... తమ ఇంటిదైవం వెంకటేశ్వరస్వామిని అవమానించడం... ఎదురుగా... అఖండజ్యోతుల్లా వెలుగుతున్న దీపారాధన వెలుగులో వెంకటేశ్వరస్వామి నవ్వుతున్నాడు. ప్రశ్నిస్తున్నాడు... పరీక్షిస్తున్నాడు!

సూరమ్మకి క్షణంసేపు ప్రపంచమంతా గిర్రున తిరిగినట్లయింది. శరీరమంతా భగభగ మండుతూ సెగలూ పొగలూ కక్కుతున్నట్లయింది. కళ్ళు జ్యోతుల్లా ప్రజ్వరిల్లుతూవుంటే ఆవేశంతో బిగిసిన రెండు గుప్పెళ్లతో అక్కడే నేలమీద కొడుతూ ఒక వెర్రికేక వేసింది "ఒరేయ్..."

గదిలో మంచంమీద పడుకున్న మాధవరావు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. క్షణంసేపు ఏం జరిగిందో అర్థంకాలేదు. దిగ్గున లేచి వంటింట్లోకి రాబోయాడు. అదే సమయానికి అతనికి అభిముఖంగా హాల్లోకి రాబోయిన కృష్ణవేణి అతనిని తాకుతూ రివ్వున గదిలోకి పరిగెత్తింది నోటికి చెంగు అడ్డంపెట్టుకుని.

మాధవరావు అర్థంకానివాడిలా వంటింట్లోకి చూస్తూనే అక్కడి దృశ్యం చూసి ప్రాన్పడిపోయాడు.

సూరమ్మ తల గోడకేసి బాదుకుంటోంది. గుండెలవిసేలా ఏడుస్తోంది. పొగిలి పొగిలి ఏడుస్తోంది. "అమ్మా!" గభాల్న వెళ్ళి ఆమెని పొదివిపట్టుకున్నాడు.

"ఒద్దు! నేను ఉండలేను! చచ్చిపోతాను!" విడిపించుకుంటూ అన్నది.

"అమ్మా!"

"నా దైవానికి అవమానం జరిగినచోట నేను ఉండలేను. చచ్చిపోతాను! ఒరేయ్ మాధవా! నా వెంకటేశ్వరుడు, నా శ్రీనివాసుడు అవమానించబడ్డాడురా!" హిస్టీరియా వచ్చినదానిలా ఏడుస్తున్న తల్లిని సముదాయిస్తూ అడిగాడు

"అసలేమయింది?"

ఏడుస్తూ వెక్కిళ్ళమధ్యన చెప్పింది. మరుక్షణం - మాధవరావు దవడ ఎముక బిగిసింది. కళ్ళు భగభగా మండాయి. దేవుడి మొక్కుబడి కాదనడం సంగతి అలా ఉంచి, తల్లి గోడకేసి తల బాదుకుంటూ ఏడుస్తున్న దృశ్యమే అతని గుండెలని కలచివేస్తోంది. తన తల్లి అంతగా ఎప్పుడూ రోదించలేదు.

తల్లి భుజాలని అప్రయత్నంగా వదిలేశాడు. వెంటనే చరచరా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ గది దగ్గరకు వచ్చి గుమ్మంమీద రెండు చేతులు వేసి కఠినంగా చూస్తూ అన్నాడు "నువ్వు... నువ్వు ఏం చేశావో నీకు తెలుసా?"

అంతసేపు మంచంమీద ముడుచుకుని పడుకున్న కృష్ణవేణి ఒక్క అంగలో మంచందిగి రెండు చేతులూ జోడించి అన్నది "నన్ను క్షమించండి! ఉపవాసాలు ఉండమంటే ఉంటాను! కొండ ఎక్కి దిగమంటే దిగుతాను! కాని... కాని ఇది నావల్ల కాదు! నన్ను అర్థంచేసుకోండి!"

ఏడుస్తూ చెబుతున్న కృష్ణవేణిని చూస్తుంటే మాధవరావు మరీ మరీ రెచ్చిపోసాగాడు. "ఎంత పొగరే నీకు? ఎంత అహంకారమే నీకు? దేవుడంటే అంత నిర్లక్ష్యమా? ఏం చూసుకుని అంత మిడిసిపాటు!" అంటూ రివ్వున వెళ్ళి కృష్ణవేణి జడని గుంజినట్లుగా ఒక్క లాగు లాగి "ఇదేమన్నా కృష్ణపాయా అంత గొప్పగా మిడిసిపడుతున్నావు? బో...డి...ముం...డా..."

ఆ అదురుకు కెవ్వున అరిచింది కృష్ణవేణి! మాధవరావు మెలివేసినట్లుగా జడని మెలితిప్పుతుంటే బాధతో గిలగిలలాడుతున్న కృష్ణవేణి చెవులకు పిట్టగోడ దగ్గర దభిల్లున దూకిన శబ్దం విన్పించింది.

మరుక్షణం అవధాన్లుగారు కంగారుగా పరిగెత్తుకొచ్చి "ఆ! ఆ! ఏమిటీ అఘాయిత్యం!" అంటూ మాధవరావు చేతిలోనుండి కృష్ణవేణి జడని విడిపించాడు.

కృష్ణవేణి ముందరకి తూలి మంచంమీద పడింది.

మాధవరావు కచ్చగా చూస్తూ ఉండిపోయాడు. లోపలనుండి సూరమ్మ వచ్చి నిల్చుంది.

అవధాన్లుగారు చెడామడా తిట్టారు. "ఏమయ్యా! అయినింటివాడు చేయాల్సిన పనేనా



ఇది? ఆ పిల్ల ఏం తప్పుచేసిందని?''

"ఏం చేయాలి ఇంకా?'' సూరమ్మ విసురుగా అరిచి, కారణం చెప్పింది.

"ఏవమ్మా! పెద్దదానివి. నువ్వు చేయాల్సిన పనేనా ఇది! ఇదేమన్నా మహమ్మారి జ్వరమా? ఇంకేదయినానా? మామూలు జ్వరానికింత హంగామానా? ముడుపులు, మొక్కుబడుల పేరుతో ఎందుకయ్యా ఆ అమ్మాయిని హింసిస్తారు? ఆ అమ్మాయి ఏం తప్పుచేసిందని? మీరు చెప్పినదానికల్లా గంగిగోవులా తల ఊపుతోందనా ఇలా బలవంతపు ముడుపులు కట్టిస్తున్నారు? అంత మొక్కుబడులే కావాలనుకుంటే మీ తల్లీకొడుకులు నెలనెలా మోపిదేవి వెళ్ళి గుండు చేయించుకురండి. అంతేగాని ఇదెక్కడ అఘాయిత్యం.. ఏమయ్యా మాధవరావూ? చదువుకున్నవాడివి... దేవుడు, భక్తి ఉండవచ్చు. కాని ఇంత ఛాదస్తం పనికిరాదు!''

సూరమ్మ ముఖం మాడ్చుకుని విసవిసా నడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది. మాధవరావు సీరియస్‌గా చూస్తూ 'హు!' అని వెళ్ళి మంచంమీద పడుకుని మునుగుతన్నాడు.

ఒంటరిగా ఏడుస్తూ మిగిలిపోయిన కృష్ణవేణిని చూస్తుంటే అవధాన్లుగారికి గుండె తరుక్కుపోయింది.

దగ్గరగా వెళ్ళి సముదాయిస్తూ అన్నారు "ఊర్కో తల్లీ! తండ్రిలాంటివాడిని! భయపడకు! పక్కన నేను ఉండగా నీకేమీ అపకారం జరగదు! నన్ను నమ్ము!'' అని ధైర్యంచెప్పి కాసేపు కూర్చొని అవధాన్లుగారు వెళ్ళిపోయారు.

ఆ రాత్రి ఎవరిమధ్యా మాటలు లేకుండా నిశ్శబ్దంగా గడిచిపోయింది.

★ ★ ★

కాపురానికి వచ్చి ఎనిమిది నెలలవుతోంది. కాని అలా అనిపించడంలేదు. ఎన్నో సంవత్సరాలు గడిచినట్లనిపిస్తోంది.

మధ్యలో రెండుమూడుసార్లు గిరి వచ్చి వెళ్ళాడు. రోజులు బరువుగా గడుస్తున్నాయి.

పెళ్ళి అంటే ఎంతో మధురంగా ఉంటుందంటారు. కానీ తన జీవితం ఇలా ఇంత చేదుగా ఉందేమిటి?

హాలులో కూర్చుని తీరికగా ఆలోచిస్తున్న కృష్ణవేణి కళ్ళల్లోనుండి అప్రయత్నంగా కన్నీళ్ళు జాలువారాయి.

వంటింట్లో సూరమ్మ భోజనం చేయడానికి ఉపక్రమించబోతోంది. ఇంతక్రితమే తనది అయింది. సాధారణంగా మాధవరావు వెళ్ళిపోయాక అత్తాకోడళ్ళు ఇద్దరూ కూర్చుని భోజనం చేస్తారు. ఈరోజు సూరమ్మ ఎందుకో కాస్త ఆలస్యంగా చేస్తానన్నది.

ఏరోజయినా భర్త సరదాకయినా తనతో కూర్చుని భోజనం చేయమంటాడేమోనని చాలాసార్లు ఎదురుచూసింది కృష్ణవేణి.

కనీసం అసలా ఆలోచనే లేనివాడిలా జన్మలో అంత అందమయిన ఊహయినా రానివాడిలా హాయిగా తృప్తిగా ఒక్కడే తిని వెళ్ళిపోతాడు.

కొత్తల్లో మొగుడు తిన్న కంచంలో తినమని గొడవచేసేది సూరమ్మ. అది పతివ్రతా ధర్మమట! పుణ్యంట!

చీకిచీకి వదిలేసిన ములక్కాడ ముక్కలు, అవీ పక్కకు పెట్టి మళ్ళీ అదే కంచంలో తినాలంటే కడుపులో దేవినట్లయ్యేది కృష్ణవేణికి.

అందుకే సూరమ్మ మళ్ళీ నోరెత్తకుండా సంప్రదాయబద్ధమయిన అరిటాకులో తినడం మొదలెట్టింది.

భర్త చదువుకున్నవాడు! ఉద్యోగం చేస్తున్నాడు! కాని ఆలోచనలు ఇంత మూఢత్వంగా ఎందుకు ఉంటున్నాయో అర్థంకావడంలేదు. లేక తెలిసీ తల్లిని నొప్పించడం ఇష్టంలేక ఇలా ప్రవర్తిస్తున్నాడా?

ఎంత చిత్రం!

ఇదొక చీకటికోణం! బయటకు కన్పించని చిక్కని సాలెగూడు. సాంప్రదాయ ముసుగులో, అజ్ఞానపు తొడుగులో జరుపబడుతున్న వేధింపు! సాధింపు!

వరకట్నపు జ్వాలలకు ఆహుతయిన అమాయకపు సమిధ!!

కట్నం తేలేదని కిరసనాయిల్ పోసి తగలె




ట్టిన భర్త, అత్తగారు!

తాగి వచ్చి మైకంలో భార్యను చంపిన భర్త!

శాడిస్టు మొగుళ్ళ చేతుల్లో పెళ్ళాల బాధలు!

ఇవన్నీ నిత్యం జరుగుతున్న సంఘటనలు! కాని తనది... వీటికి అతీతమయినది. చెప్పినా అర్థంకానిది. చెప్పుకున్నా సానుభూతి లభించనిది. ఆచారం, సాంప్రదాయాల బంధాలతో దట్టంగా అల్లుకున్న ముళ్ళతీగలాంటి జీవితాలు. కాని... దీనికి పరిష్కారం, అంతం, ఎక్కడ!

వీళ్ళ ఆలోచనాపరిధిలో మార్పు ఉండదా? అసలా ఆలోచనే రాదా? ఈ మూఢత్వం, మూర్ఖత్వాలనుండి ఎప్పుడు బయటపడతారు?

తమదే అసలయిన ప్రపంచమనుకునే వీరికి మిగతాలోకం గురించి ఎలా తెలుస్తుంది? మిగతా మనుషులు కూడా తమలాగే ఒకే జాతి అని ఎప్పుడు అర్థంచేసుకుంటారు?

ఆలోచనల మధ్యనపడి కొట్టుకుపోతున్న కృష్ణవేణి బయటి గేటు కిర్రుమని శబ్దం చేస్తూ తెరుచుకోవడం గమనించలేదు!

తలుపు తెరుచుకుని లోపలికి వచ్చిన వ్యక్తి సందులోగుండా పెరట్లోకి వచ్చి వంటింటివైపు చూస్తూ "అమ్మాయిగారూ!" అని పిలిచాడు!

అపుడు ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది కృష్ణవేణి!

అది తనకి సుపరిచితమయిన స్వరం! కన్నయ్యది!

ఒక్క ఉదుటున లేచి పెరట్లోకి వచ్చింది!

కన్నయ్య చేతిలోని కూరగాయల బుట్ట గట్టుమీద పెడుతూ అన్నాడు!

"బాగున్నావా తల్లీ! ముచ్చెంకాయలు నీకిష్టమని అన్నయ్య పంపించాడు!" ఇంతలో వంటింట్లో దభేలున కంచం, గ్లాసులు ఎత్తిపడేసిన శబ్దం అయింది! మరుక్షణం కృష్ణవేణి మనసు పసిగట్టింది ఏదో జరగకూడని అనర్థం జరిగిందని!

ఎదురుగా కన్నయ్య!

ఉండమనాలా? ఏం మాట్లాడకుండా పంపించేయాలా? ఉండమంటే ఆమెకి ఏం కోపం వస్తుందో? వెళ్ళమంటే తనవాడు రాక రాక వచ్చాడు! ఈ సందిగ్ధావస్థలో కొట్టుమిట్టాడుతుండగా కన్నయ్య రక్షించాడు. "నే వస్తానమ్మాయిగారూ! పడవ లంగరేసి వచ్చాను!" అని కదిలి మళ్ళీ ఏదో గుర్తుకొచ్చినట్లు ఆగి చెప్పాడు, అన్నట్లు పట్నంలో మీ రుక్మిణి అత్తయ్యగారికి బాగుండక హాస్పిటల్‌లో జేర్పించారట! వెళ్ళి పలకరించి రమ్మని గిరిబాబు మరీమరీ చెప్పమన్నాడమ్మా!"

కృష్ణవేణి నత్తిగా అన్నది, "అది సరే! కనీసం కాఫీ అయినా తాగి వెళ్ళకుండా"

"లేదమ్మా! రేవులో ఎదురుచూస్తుంటారు! వస్తాను" అంటూ పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు!

కన్నయ్య అటు వెళ్ళగానే దీర్ఘంగా నిట్టూర్చి వంటింట్లోకి వచ్చింది!

లోపల,

సూరమ్మ అన్నం తింటున్న కంచం నిండా నీళ్ళు తేలుతున్నాయి. చుట్టూ గిన్నెలు అన్నీ చెల్లాచెదురుగా పడి ఉన్నాయి!

తెగ శాపనార్థాలు పెడుతోంది! "హయ్యో! పెద్ద ముండ! మడీ ఆచారాలు ఉన్న మనిషి-లోపల భోజనం చేస్తోందే! లోపలికి ఎవడు వస్తున్నాడు, ఎవరు పోతున్నాడు చూడకుండా, కళ్లు మూసుకుని కూర్చుంటే, హిదిగో... హింతే... నాఖర్మ... ఇష్టమని ఆవపెట్టి ఆనపకాయ కూర చేసుకున్నాను. ఆ వెధవ ఇపుడే రావాలా, ఇప్పుడే నా కంట పడాలా?"

అర్థమయింది కృష్ణవేణికి!

భోజనం చేస్తూఉండగా అన్యకులస్థుడు కంటపడితే, ఇక అన్నం ముట్టదు! వెంటనే చెయ్యి కడిగేస్తుంది!

రెండిళ్ళ అవతలవారి పనిమనిషి విషయంలో ఇలాంటి ఒకటి రెండు సంఘటనలు జరగడం కృష్ణవేణి గమనించింది!

కృష్ణవేణి మౌనంగా గదిలోకి వెళ్ళిపోయింది!

ఆ సాయంత్రం మాధవరావు వచ్చేంత వరకూ సూరమ్మ శాపనార్థాలు పెడుతూనే ఉన్నది!

ఆ సాయంత్రం భర్తకి, రుక్మిణి అత్తయ్య విషయం చెప్పగానే ఏ కళనున్నాడో వెంటనే ఒప్పుకున్నాడు!

మర్నాడు తను ఆఫీసుకి వెళ్లేటపుడు తనతో పాటు తీసుకెళ్ళి వాళ్ళింట్లో దించి, మళ్ళీ వచ్చేటపుడు తీసుకువస్తానన్నాడు!

చాలా రోజుల తర్వాత మనసులో సంతోషించింది కృష్ణవేణి!

మర్నాడు,

పెళ్లయిన తర్వాత మొదటిసారిగా ఇద్దరూ కలిసి భోజనం చేసి బయలుదేరబోతుండగా, సూరమ్మ సంచీ తీసుకువచ్చి కొడుకు చేతిలో పెట్టి అన్నది! "ఒరేయ్ మాధవూ! రెండు మానికల మినప్పప్పు తీసుకురా వచ్చేటపుడు!"

"ఇపుడంతెందుకమ్మా! వండగా? పబ్బమా?" ఆశ్చర్యపోతూ అడిగాడు!

చిన్నగా మందహాసం చేసింది, "రెండూ కాదురా! ఎప్పటినుండో అనుకుంటూ వాయిదా వేస్తూ వచ్చాను. నందికేశుని నోములో మిగిలిపోయిన పిండివంట, గారెలు చేయడానికి రా! మన అవధాన్లుగారు ఎల్లుండి ముహూర్తం పెట్టారు!"

ఆ మాట వినగానే మాధవరావు కళ్ళు మెరిశాయి!

"అలాగా! మరి చెప్పవేం? అయితే ఎల్లుండి సెలవు పెట్టాలన్న మాట!" అని బయలుదేరాడు!

ఈసారి మర్చిపోకుండా కృష్ణవేణి, "అత్తయ్యగారూ వెళ్ళొస్తాను" అంటూ చెప్పి బయలుదేరింది!

నోము ఊపులో ఉన్న సూరమ్మ పెద్దగా పట్టించుకోలేదు!

ఇద్దరూ గబగబా నడిచి రేవుకి వచ్చారు! మాధవరావు సైకిల్ కూడా పడవలో ఎక్కించి కూర్చున్నాడు! అతని ఎదురుగా పవిట నిండుగా కప్పుకుని తల వంచుకుని కూర్చుంది కృష్ణవేణి!

వాళ్ళు సిటీలో అడుగు పెట్టేసరికి వాతావరణం మారింది!

మబ్బుపట్టి వానగాలి వీస్తోంది!

మాధవరావు సైకిల్ పట్టుకుని నడుస్తుంటే పక్కనే నడుస్తున్న కృష్ణవేణి వచ్చే పోయే మనుషులను పరిశీలిస్తూ అడుగులు వేస్తోంది!

ఎన్నో జంటలు! చకచకా నడిచి వెళ్ళిపోతున్నారు!

భార్యను ముందర రాడ్ మీద ఎక్కించుకుని ఏవో కబుర్లు చెప్పుకుంటూ- నవ్వుకుంటూ సైకిల్ మీద వెళుతున్న జంటలు కనబడగానే కృష్ణవేణి చప్పున తల ఎత్తి భర్తవైపు చూసేది!

కాని మాధవరావు అసలు వారిని చూడనట్లే సీరియస్‌గా మనుషుల తలలపైనుండి ఎటో దూరంగా చూస్తూ నడుస్తున్నాడు!

చిన్నగా నిట్టూర్చింది! ఈ మనిషికి ఎలాంటి స్పందనలూ లేవా అనిపించింది!

కృష్ణవేణి చెప్పిన అడ్రెస్ ప్రకారం ఆ యింటి ముందరకిరాగానే అన్నది!

"మీరు కూడా రాకూడదు! పలకరించి వెళ్ళచ్చు!"

హఠాత్తుగా హడావిడిపడిపోతూ అన్నాడు, "హెబ్బెబ్బె! నాకు ఆఫీసు టైమ్ అయింది వెళ్లాలి!" అంటు సైకిల్ ఎక్కి వెళ్ళబోతూ మళ్ళీ అన్నాడు!

"సాయంత్రం- నాలుగింటికల్లా రెడీగా ఉండు"

ఒకసారి ఎపుడో మాటల సందర్భంలో మాధవరావు తల్లితో అన్నమాటలు గుర్తుకొచ్చాయి! "ఎపుడు పడితే అపుడు అత్తవారింటికి కాని వాళ్ళ తరఫు బంధువుల ఇంటికిగాని వెళ్ళకూడదే! వెడితే తేలికయిపోము! ఎప్పటికీ బెట్టుగానే ఉండాలి!"

ఆ ప్రభావమే అనుకుని ముందుకు నడిచింది కృష్ణవేణి.

గేటు తీసుకొని లోపలికి వెళ్ళబోతుంటే - అపుడే లోపలనుండి బయటకు వస్తున్నాడు ఓ పద్ధెనిమిదేళ్ళ కుర్రాడు.

కృష్ణవేణిని చూస్తునే, "హాయ్! వదినా!" అంటూ విష్ చేసాడు!

జీన్స్‌లోకి టక్ చేసిన షర్ట్, పైకి ఎగదువ్విన జుట్టు సన్నగా పొడవుగా ఉన్న శరీరం, తెల్లటి తెలుపు ఎపుడూ సరదాగా, హుషారుగా ఉండే





అతను రుక్మిణి కొడుకు పాంచజన్య!

"రా! రా లోపలికి. ఇప్పుడేనా రావడం!" మళ్లీ తాళం తీయబోతూ అన్నాడు.

"అదేమిటీ! అత్తయ్య ఇంకా ఇంటికి రాలేదూ! ఏమయిందసలు?" ఆదుర్దాగా అడిగింది.

"టైఫాయిడ్ వదినా! తగ్గిపోయిందనుకో! రేపో ఎల్లుండో హాస్పిటల్‌నుండి వచ్చేస్తుంది! డాడీ నిన్నటివరకూ లీవ్‌లోనే ఉన్నారు! ఈ రోజే- ఇపుడే ఆఫీసుకు వెళ్ళారు! నేను హాస్పిటల్‌కే బయలుదేరబోతున్నాను.!" చెప్పాడు పాంచజన్య!

"అయితే పద! నేనూ అందుకే వచ్చింది!"

సందులోనుండి సైకిల్ తీస్తూ, "వదినా అభ్యంతరం లేదుగా!" అన్నాడు! లేదన్నట్లుగా నవ్వుతూ తలూపింది కృష్ణవేణి.ఇంత క్రితం గిరి,కృష్ణవేణి సిటీకి రుక్మిణి అత్తయ్యగారింటికి వచ్చినపుడు పాంచజన్య- కృష్ణవేణిని సైకిల్‌మీద ఎక్కించుకుని చాలాసార్లు బజారుకి, సినిమాలకీ తీసుకెళ్ళేవాడు! ఇప్పటికీ వారిమధ్యన ఆ చనువు ఉన్నది!

పాంచజన్య సైకిల్‌మీద ఎక్కి హాండిల్ పట్టుకుంటే కృష్ణవేణి ముందరి రాడ్‌మీద కూర్చుంది!

"వదినా- జాగ్రత్త" అంటూ ముందరకి పోనిచ్చాడు!

గాలి బాగా వీస్తోంది! ఏక్షణాన్నయినా వాన వచ్చేలా ఉంది! చూస్తుండగానే చీకట్లు కమ్ముకొస్తున్నాయి.

మెయిన్ సెంటర్‌లో సైకిల్ ముందు రాడ్ మీద కూర్చుని పాంచజన్య వేసిన జోక్‌కి చాలా రోజులతర్వాత హాయిగా, మనస్ఫూర్తిగా నవ్వింది కృష్ణవేణి.

కాని ఆ వీధి మలుపునుండి తననే చూస్తున్న రెండు చితినెగళ్లను గమనించనేలేదు. భగభగ జ్వలిస్తూ విస్ఫులింగాలను వెదజల్లుతున్న ఆ కళ్ళు మాధరావువి! ఆఫీసుకు వెళ్ళబోతూ- దారిలోనే పచారీ షాపుదగ్గర ఆగి మినప్పప్పు తీసుకుని ఆ సంచీ సైకిల్ హేండిల్‌కి తగిలిస్తూ యధాలాపంగా అటువైపు చూసిన మాధవరావు భృకుటి అనుమానంగా ముడుచుకుంది!

ఆ వీధిమలుపు తిరుగుతున్న సైకిల్ మీద కూర్చున్నది ఎవరూ కృష్ణవేణి కదూ! ఆ కుర్రాడి ఛాతీకి కృష్ణవేణి భుజాలు తగులుతున్నాయి! ఇద్దరూ పకపక నవ్వుతున్నారు! కృష్ణవేణి అయితే ఈలోకంలో లేనట్లు అతనికి చేరువగా హత్తుకుని కూర్చుని ఉన్నది!

మాధవరావు కళ్ళముందునుండే ఆ సైకిల్ దుమ్మురేపుకుంటూ వెళ్ళిపోయింది. మాధవరావు మెదడు పనిచేయడం మానేసింది! హఠాత్తుగా గుండెల్లో ఓ మూల సన్నటి బాధ మొదలయింది! గుండెని పట్టుకుని కాసేపు అలాగే ఉండిపోయాడు!

పరాయి మగవాడిముందు తన భార్య తల కూడా ఎత్తడానికి ఇష్టపడని అతనికి ఇది గొప్ప షాక్!

ఆఫీసుకి ఎలా వెళ్ళాడో తెలియదు! ఏం చేస్తున్నాడో తెలియని పరిస్థితిలో సాయంత్రం మూడింటి వరకూ గడిపాడు! ఈ లోపల కనీసం పదిసార్లయినా కాఫీ తాగి ఉంటాడు!

★ ★ ★

పదినిముషాలలోనే సైకిల్ హాస్పిటల్ ముందు ఆగింది! లోపలికి వెళ్ళిన కృష్ణవేణి రుక్మిణి అత్తయ్యను పలకరించింది! "ఎలా ఉన్నావు అత్తయ్యా!"

"నేను సరే! బాగానే రికవర య్యాను! నువ్వేవిటీ ఇలా అస్థిపంజరంలా అయిపోయావు? అసలు అన్నం తింటున్నావా?" భుజంమీద ఆప్యాయంగా చెయ్యి వేసి నిమురుతూ అడుగుతుంటే కృష్ణవేణి కళ్లల్లో అప్రయత్నంగా నీళ్ళు చిప్పిల్లాయి!

"కృష్ణా! ఒక్క పావుగంట క్రితం వచ్చి ఉంటే ఎంత బాగుండేది? ఇపుడే గిరి వచ్చి వెళ్ళాడు! ఆ ఉన్న కాసేపటిలోనే నీకోసం ఎన్నిసార్లు అనుకున్నాడో తెలుసా? ఏమిటి- అసలు పుట్టింటికి వెళ్ళడం మానేశావా?"

కృష్ణవేణి సమాధానం చెప్పలేనట్లు తల వంచుకుంది!

ఈ లోపల పాంచజన్య ఫ్లాస్క్ తీసుకుని బయటకు వెళ్ళబోతుంటే రుక్మిణి అడిగింది

"ఏరా? కృష్ణవేణి భోజనం చేసిందో లేదో కనుక్కొన్నావా?"

అపుడే గుర్తొచ్చినట్లు పాంచజన్య నెత్తిమీద మొట్టుకుని "సారీ మమ్మీ! అడగలేదు!" అని కృష్ణవేణివైపు తిరిగి "వదినా వెళదాం వస్తావా! నేను భోజనం చేయలేదింకా!"

కృష్ణవేణి నవ్వుతూ చెప్పింది "నేను చేసే వచ్చాను! నువ్వు చేసి త్వరగా వస్తే మళ్ళీ బయలుదేరాలి!"

పాంచజన్య అలాగేనని తలూపి బయటకు వెళ్ళిపోయాడు!

ఈలోపల కృష్ణవేణి రుక్మిణి అత్తయ్యతో మాట్లాడుతూ కూర్చుంది! అంతసేపూ రుక్మిణి గిరి పెళ్ళి గురించే మాట్లాడింది! చాలా సంబంధాలొస్తున్నాయట! గిరి ఇపుడిపుడే ఒప్పుకొనేలా లేడు!

చూస్తుండగానే మూడు అవస్తోంది!

బయట జల్లు జల్లుగా వాన పడుతోంది! చల్లటివాన గాలి వీస్తోంది!

పాంచజన్య సైకిల్ మీద కూర్చున్నాడు! కృష్ణవేణి వానకి తడవకుండా నెత్తిమీదకి చెంగు లాక్కుని కూర్చుంది!

నేలంతా బురద బురదగా ఉన్నది! ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా స్లిప్ అయేలా ఉంది!

అదీకాక ఎదురుగాలి వీస్తూ ఉండటంతో సైకిల్ అంత ఈజీగా ముందుకు వెళ్ళడంలేదు.

"వదినా! జాగ్రత్త!" అంటూనే ఆ నందు మలుపు తిరగబోతున్నాడు.

ఎదురుగా ఓ సైకిల్ రిక్షావస్తోంది! పక్కకు హేండిల్ తిప్పబోయిన పాంచజన్య ఎందుకో తబ్బిబ్బు అయ్యాడు! గుంటలు గుంటలుగా ఉన్న రోడ్డుమీద "పక్కకి కోయాలి!" అనుకుంటూనే ఉన్నాడు! అప్పటికే ముందు గుంటలోకి దూసుకుపోయినట్లుగా పడి పక్కకు పడిపోయింది సైకిల్!

అలా పడటంలో అమాంతం పక్కకు ఒరిగిపోయిన కృష్ణవేణి వెల్లికిలా బురదగుంటలో పడింది! ఆమెమీదకి ఎగిరినట్లుగా తూలిపడిపోయాడు పాంచజన్య! సైకిల్ చక్రం గిర్రున తిరుగుతూ పక్కకు పడిపోయింది! కనురెప్పపాటులో జరిగిపోయిందా సంఘటన!

ఒక్కసారిగా చుట్టుపక్కలనుండి జనం పరిగెత్తుకొచ్చి పాంచజన్యని పైకి లేవదీసారు!

ఎవరో చేయిపట్టుకు లేవదీస్తే అపుడు లేచి కూర్చోగలిగింది కృష్ణవేణి! ఏం జరిగిందో కాసేపటివరకూ తెలియనంత షాక్‌లోకి వెళ్ళిపోయింది! నందు మలుపు తిరిగేటపుడు హేండిల్ కంగారుగా అటూ ఇటూ ఊగటం తెలుసు! అంతే!

చీరంతా బురదమరకలు! పవిట జారిపోయి ఒడిలో పడింది! గుండెలమీద, జాకెట్టు మీద బురద చిలకరించినట్లుగా పడింది! జుట్టంతా తడిసిపోయింది!

ఏం జరిగింది? ఏం జరుగుతోందసలు?

మెదడంతా స్థబ్దంగా అయిపోయింది! చెవుల్లోంచి అదోలాంటి హోరు! పక్కనుండి జనం ఏదో అంటున్నారు! మాట్లాడుతున్నారు. కానీ ఏమీ వినబడటం లేదు! అసలు అర్థంకావడంలేదు!

పిచ్చిదానిలా తల తిప్పబోయిన కృష్ణవేణి నెత్తిమీద పిడుగుపడ్డట్లు గడగడా వణికిపోయింది!

చుట్టూ దడి కట్టినట్లుగా నిల్చున్న మనుష్యుల కాళ్ళమధ్యనుండి ఎదురుగా సైకిల్ స్టాండ్‌లో సైకిల్ పట్టుకుని ఇటే చూస్తున్నాడు మాధవరావు! దహించుకుపోతున్న అగ్నికీలవలే ఉన్నాడు.

అతని కళ్ళకి ఆ దృశ్యమే కనబడుతోంది!

కృష్ణవేణి మీద పడిన పాంచజన్యని ఎవరో లేవదీయటం, తర్వాత పవిట జారిపోయి ఏ ఆచ్ఛాదనాలేని గుండెలతో... తన భార్య... కృష్ణవేణి... ఆ బురద గుంటలో... నడిరోడ్డుమీద పది మందీ మధ్యన!

ఆ టెన్షన్‌కి నరాలు ఏక్షణాన్నయినా తెగిపోతాయేమోనని పిస్తోంది! గట్టిగా కళ్ళు మూసుకుని రెండు క్షణాలు అలాగే ఉండిపోయాడు. తర్వాత నెమ్మదిగా కళ్ళు తెరిచాడు! మంకెన పూలవలె ఉన్నాయి అతని కళ్ళు! ఇక ఒక్క క్షణం అక్కడ ఉండలేదు! సైకిల్ ఎక్కి ముందుకు సాగాడు!

కాసేపటికి పవిట సర్దుకుని నెమ్మదిగా లేచింది కృష్ణవేణి!

మాధవరావు, రేవువైపువెళ్ళే రోడ్డువైపు వెళ్ళడం గమనించింది!

పాంచజన్య నెమ్మదిగా సైకిల్ లేవదీసాడు, "సారీ వదినా! క్షమించు! కంట్రోల్ కాలేదు!"

కృష్ణవేణి మాట్లాడకుండా ముందుకు అడుగువేస్తూ అన్నది "ఇక ఇంటికి అనవసరం, ఆయన వచ్చి వెళ్లి ఉంటారు, డైరెక్టుగా రేవుకి వెళ్లిపోతాను!" పాంచజన్య మౌనంగా తలూపి కృష్ణవేణితోపాటు రేవువరకూ నడిచి వచ్చాడు. వెళ్ళబోతూ అన్నాడు "వదినా! ఈ సంగతి అమ్మా వాళ్ళతో చెప్పకు! తెలిస్తే ఛంపేస్తారు!"

కృష్ణవేణి అలాగేనని తలూపి ముందుకు నడిచింది!

అపుడే కదలడానికి సిద్ధంఅవుతున్న పడవ దూరాన్నుండే కృష్ణవేణిని చూసి ఆగింది!

గబగబా నడిచి పడవ ఎక్కిన కృష్ణవేణి కళ్ళకు పడవ మధ్యలో సీరియస్‌గా పెదవి కొరుకుతూ కూర్చున్న మాధవరావు కన్పించాడు!

రేవులో దిగగానే ఏం మాట్లాడలేదు!

మౌనంగా తలవంచుకుని అతని వెనకే బయలుదేరింది!

ఇంటికి వచ్చి- గేటు తెరిచి హాల్లోకి అడుగు పెట్టబోతోంది! వెనకే వచ్చిన మాధవరావు సైకిల్ స్టాండ్ వేసి వెనకే వస్తున్నాడనుకుంది!

కాని ఆమె ఊహించని విధంగా మాధవరావు బలిష్టమయిన చెయ్యిబలంగా కృష్ణవేణిని ముందుకు విసురుగా తోసింది!

ఆ అఘాతుకి అమాంతం ముందుకు తూలిన కృష్ణవేణి గడపకు కాలుకొట్టుకుని, ఉయ్యాలబల్ల అంచుమీద పడింది!

"అమ్మా!" అన్న ఆర్తనాదం వెలువడింది వెంటనే!

లోపలనుండి సూరమ్మ ఖంగారుగా పరిగెత్తుకొచ్చింది!

మాధవరావు దృష్టి ఉయ్యాలబల్ల గొలుసుల మధ్య ఇరుక్కున్న కృష్ణవేణి చేతిమీద పడింది!

ఒక్కసారిగా అతనిలోని కసి బుసకొట్టింది!

కచ్చగా గొలుసులు పట్టుకుని మెలితిప్పాడు!

"అమ్మా! అమ్మా!" కెవ్వుమంటూ అరిచిన కృష్ణవేణి కాసేపటివరకూ గడగడా వణికిపోతూనే ఉంది! గొలుసులమధ్య నలిబిలి అయిపోయిన చెయ్యి ఎర్రగా కందిపోయింది! గాజులు పగిలి ముక్కలు ముక్కలయి చెల్లాచెదురుగా పడ్డాయి!

అట్లాగే బిగించి పట్టుకుని అన్నాడు "చెప్పవే? ఎవడేవాడు! ఏమిటి మీమధ్యన ఉన్న అంత గొప్ప సంబంధం! చెప్పవే!"

సూరమ్మ భయంభయంగా చూడసాగింది! ఆమెకి ఏమీ అర్థంకాలేదు!

కృష్ణవేణి అరుపులకు పిట్టగోడమీదనుండి అవధానిగారు పరిగెత్తుకొచ్చారు. అప్పుడు కృష్ణవేణి, నోరు బలవంతంగా పెకలించుకుని చెబుతోంది "నన్ను నమ్మండి! పాంచజన్య నాకు తమ్ముడితో సమానం! ఎలాంటి సంబంధంలేదు. అమ్...మ్...మ్మా!"

అవధాని వెంటనే మాధవరావుని విసురుగా ఇవతలకి లాగి కృష్ణవేణి చెయ్యి గొలుసులమధ్యనుండి విడతీసాడు!

నిస్త్రాణగా పక్కకి వాలిపోయిన కృష్ణవేణి కాసేపటికి నెమ్మదిగా వెక్కిళ్ళమధ్య జరిగిన సంగతి చెబుతుంటే-

గుడ్లు మిటకరించి సూరమ్మ, బుసకొడుతూ మాధవరావు, జాలిగా అవధానిగారు చూస్తుండిపోయారు.

అవధానిగారు ఊర్కోలేదు. వెంటనే అందుకున్నారు "ఏవయ్యా! సిగ్గు ఉందా? ఎంత ఛండాలంగా ఆలోచించావయ్యా! అసలు నీవయసువాడికి ఉండవలసిన ఆలోచనలేనా ఇవి? అసలు పెళ్ళి ఎందుకు చేసుకున్నావయ్యా? ఆ పిల్ల ఏం పాపం చేసిందని? ఏనాడయినా సరదాగా మాట్లాడావా? సినిమాకి తీసుకెళ్ళావా? షికారుకి తిప్పావా? సైకిల్ మీద కూర్చుందని అంత భరించలేక పోతున్నావే! పోనీ నువ్వేం నిర్వాకం చేసావు? పరాయిదేం కాదు, అర్థాంగి, సైకిల్‌మీద కూర్చోపెట్టుకుని వెళ్ళడానికి నామోషీ అయిందా? పెళ్ళాం




అంటే మడికట్టుకుని వంట చేసి పెట్టడమే అనుకున్నావా? ఆమెకీ ఆశలు, కోర్కెలు, సరదాలు ఉంటాయని తెలియదా? ఆమె కూడా నీలాంటి, అందరి లాంటి మనిషేనన్న సంగతి నీ ఊహకు రాలేదా? సాంప్రదాయం, ఆచారం ఉండటం మంచిదే! కాదనను! కాని, ఇంత వికృతంగానా? ఎందుకయ్యా? లేని పోని ఛాదస్తాలతో ఆ అమ్మాయిని హింసిస్తావు? నీతోటి వాళ్ళని చూసి నేర్చుకో! నీ వయసువాళ్ళను చూసి నేర్చుకో! ఎంత హాయిగా ఎంత ఆనందంగా ఉండాల్సిన జీవితం! మూఢాచారాలతో పిచ్చి నమ్మకాలతో సవాలక్ష సందేహాలతో కుమిలిపోయే నీకు పెళ్ళి ఎందుకయ్యా! మాధవరావూ! పెద్దవాడిని చెబుతున్నాను! నీ నమ్మకాలను కాదనను, కాని ఎదుటివాళ్ళని వాటికి బలిచేయకు! కనీసం ఇప్పటినుండయినా పద్ధతులు మార్చుకో, బాగుపడేది నీ జీవితమే! వేరే వాళ్ళదికాదు''

కృష్ణవేణిని చేయి పట్టుకుని లేపి ''వెళ్ళి స్నానం చేసి రా కృష్ణవేణీ! ఇవేమీ మనసులో పెట్టుకోమాకు!'' అంటూ పెరట్లోకి పంపించారు!

ఆ రాత్రి కృష్ణవేణి కంటిమీద కునుకులేదు!

మాధవరావు కూడా ఆ కాసేపూ రగిలిపోయినా, మరి కాసేపటికి నిద్రపోయాడు! నూరమ్మ కూడా ఏం మాట్లాడలేదు. పెదవి విప్పలేదు! మౌనంగా పనులు చేసుకుంటూ ఉండిపోయింది!

రెండు రోజులు మాధవరావు ముభావంగానే ఉన్నాడు.

* * *

ఆరోజే నందికేశుని నోము! తెల్లవారు ఝామునే లేపింది నూరమ్మ కృష్ణవేణిని! ఆ క్రితం రోజు రాత్రినుండే వాతావరణం అంత తెరిపిగాలేదు, మబ్బు పట్టడం, కాసేపు జల్లు పడిపోవడం అలా సాగుతోంది!

ఇపుడు వానగాలి బాగా ఉధృతంగా ఉన్నది! ఆ కటకటలాడే చలిలోనే కృష్ణవేణి మంచినీళ్ళు తీసుకొచ్చిపోసింది!

నూరమ్మ పనులైతే చేస్తోంది కాని మనసులో మథనపడుతూనే ఉన్నది. ''హయ్యో! అనవసరంగా పోయిపోయి ఇపుడు పెట్టుకున్నానే! ఈ వానలో అందరూ వచ్చేనా? చేసినవన్నీ చెల్లేనా? ప్రతిఫలం దక్కేనా? నాయనా నందికేశా, ఏం పరీక్ష పెట్టావురా తండ్రీ!''

ఈ నోముకింద ఒక నిర్దిష్టమయిన కొలతల ప్రకారం పిండి వంటలు చేసి, దేముడికి నైవేద్యంపెట్టి, అందరినీ పిలిచి వండిన పదార్థాలు పెడతారు! అందులో నిబంధనలు చాలా ఉన్నాయి! ఆ కొలత చాలా ఎక్కువ పరిమాణంలోనే ఉంటుంది కాబట్టి అవి చెల్లుబాటు చేయడం కొంచెం కష్టమే! అదీ కాక అవి అన్యకులస్థులు తినడానికి అనర్హులు! ఆ రోజులోనే అయిపోవాలి! బయటికి తీసుకెళ్ళి తినకూడదు! నోము పట్టిన వారింట్లోనే తినాలి! చెల్లుబాటుకాక మిగిలితే ఆవుకు పెట్టడమో, లేదా గొయితీసి పాతయినా పెడతారు కాని మరొకరు తినకూడదు!

నూరమ్మ దాని గురించే భయపడుతోంది! దరిదాపుల్లో ఉన్న చుట్టాలు, బంధువులు అందరిని పిలిపించింది. పక్క ఊరిలో ఉన్న వారికి కబురు పెట్టింది!

కాని ఈ వానలో ఎంత మంది వస్తారనేది అనుమానమే!

చూస్తుండగానే పది దాటింది! అలాగే వాన కూడా ఉధృతం అవసాగింది! నెమ్మదిగా చుట్టుపక్కల వాళ్ళు రాసాగారు!

అవధానిగారు మచిలీపట్నంలో పని ఉందని, ముందరే తిని వెళ్ళిపోయారు. వస్తున్న వాళ్ళను చూసి, నూరమ్మ ముఖంలో కాస్త కళ వచ్చింది!

అందరికీ హాల్లోనే వరసగా బాదం ఆకులు వేసి వండిన గారెలు తనే మడిగా వడ్డించింది!

''ఒరేయ్ కామేశం తినరా! ఏమిటా నాజూకు తిండి!''

''హయ్యో రామా! ఈ మాత్రం హరాయించుకోలేకపోతే ఎలారా చిట్టీ! హితవుగా ఉంటుందని అల్లప్పచ్చడి కూడా చేసాను మరి నాలుగేయించుకోరా నుబ్బా!''

ఇలా కబుర్లు చెబుతూ- వాళ్ళు వద్దన్నకొద్దీ బలవంతంగా మరీ మరీ వడ్డించసాగింది!

భుక్తాయాసంతో త్రేన్పుతూ బలవంతంగా లోపలికి కుక్కసాగారు. ఎందుకంటే వేసినవి పారేయకూడదనే మరో నిబంధన ఉన్నది. వంటింట్లోనుండి ఇదంతా చూస్తున్న కృష్ణవేణి కి విరక్తి అనిపించింది! 'ఎందుకు అంత బలవంతంగా లోపలికి తోయడం? ఆకలితో మలమలా మాడేవారు బయట ఎంతోమంది ఉన్నారే? వారికే తలా నాలుగు ఇస్తే ఎంత సంతోషిస్తారు? నిజమయిన పుణ్యం- అంటే అదేనేమో!

నోము పేరుతో ఎందుకీ తేడాలు? తనవారే తినాలనే నిబంధన ఎందుకు. సరదాగా అంద రినీ పిలిచి పెడితే వ్రతఫలం దక్కదా?

అందరూ బలవంతాన లేచి, ఆయాసపడు తూ- భారంగా నడుస్తూ వెళ్ళిపోయిన తర్వాత సూరమ్మ వండినవాటివైపు దిగులుగా చూసి అన్నది.

"పక్క ఊరినుండి ఎవరూ రానేలేదే! అన్నీ అలాగే మిగిలిపోయాయి! హయ్యో! ఈ పాడు వాన కూడా ఇపుడే రావాలా?"

కాసేపు ఆలోచించి- తర్వాత కృష్ణవేణిని పక్కకు పిలిచి చెప్పింది!

"అమ్మాయ్! ముందర నువ్వు అర్జెంటుగా బయలుదేరు- ఈ వీధి చివరనే వీధి బడి ఉంది. వెళ్ళి మనవాళ్ళ పిల్లలను పిలుచు కురా!"

కృష్ణవేణి గొంతుకేదో అడ్డుపడ్డట్లయింది!

వీళ్ళ బుద్ధి ఎపుడు వికసిస్తుంది? ఎంత నీచమయిన ఆలోచన? ఆ పసిపిల్లల మధ్యలో నుండి వేరువేరుచేసి తన వాళ్ళనే పిలుచుకు వచ్చి భక్ష్యాలుపెట్టి వంపించడమనేది ఎంత నికృష్టపు ఆలోచన?

"నిన్నే! కదులు!" ఉరిమిచూస్తూ అన్నది.

కృష్ణవేణికి సుతరామూ ఇష్టంలేదు! కాని కదిలింది! తను కాకపోతే మాధవరావునయినా పంపిస్తుంది! ఎటొచ్చీ మాట వినలేదని నింద లూ, శాపనార్థాలు మిగిలేది తనకి!

వాకిట్లోకి వచ్చేసరికి వాన జోరుగా కురు స్తోంది!

నెత్తిమీదికి మునుగు లాక్కొని పరుగు లాంటి నడకతో వీధిబడికి వచ్చి పంతులుగారి దగ్గరకు వెళ్ళింది.

కృష్ణవేణిని గుర్తుపట్టి అడిగారాయన "ఏవ మ్మాయి? ఏమిటి సంగతి?"

కృష్ణవేణికి ఆ విషయం ఎలా చెప్పాలో తెలియలేదు!

వెనకాల బెంచీలమీద వరసలుగా కూర్చు న్న చిన్నచిన్నపిల్లలు చదవడం ఆపి పెద్దపె ద్ద కళ్ళు చేసుకుని చెవులు దోరలు చేసి వినసాగారు.

చిన్నగా చెప్పింది" మా అత్తగారు నందికే శుని నోము!"

అర్థమయినట్లుగా ఫెడీల్మని నవ్వారు పంతులుగారు! "ఓస్ అదా! మరి చెప్పవే- ఇప్పుడే పంపిస్తానుండు మన పిల్లల్ని! వాళ్ళు రాగానే నేను కూడా వస్తానని చెప్పమ్మాయి మీ అత్తగారితో. ఇంతక్రితం అయిదారుసార్లు మన బడిపిల్లల్నే తోలాను!" అని వేలుపెట్టి చూ పించి ఆమూలనుండి ఈ మూలనుండి, మధ్యలోనుండి పిల్లల్ని లేపి పెద్దగా అన్నారు. "ఒరేయ్! ఎందుకో అర్థమయిందిగా!"

"ఓ!" ఉత్సాహంగా అని ముందుకి కదిలా రు ఆ ఎన్నిక చేసిన కుర్రాళ్ళు. మిగతా పిల్లలు నోరు తెరుచుకుని చూస్తుండిపోయా రు! వారిలో ఓ చిన్నపిల్లాడు నోట్లో లాలాజలం ఊరుతుంటే పక్కవాడిని మోచేత్తో పొడిచి అన్నాడు "మనల్ని పిలవలేదేం?"

"ఏమోరా!" బిక్కమొహంతో చెప్పాడు వాడు.

"ఒరేయ్! నాకూ తినాలనిపిస్తోందిరా! వెళ దామా?"

"అమ్మో! మాష్టారుగారికి తెలిస్తే ఛంపేస్తా రు! ఊరుకో!"

కృష్ణవేణితోపాటు వెళుతున్న పిల్లలవైపు కొందరు ఆశగా, కొందరు కసిగా, కొందరు ఈర్ష్యగా నోళ్ళు తెరుచుకుని చూస్తూ ఉండిపో యారు!

కృష్ణవేణికయితే ప్రాణం చచ్చిపోయినట్ల యింది! పుణ్యం కాదు తాము మూటకట్టు కుంటోంది! మహాపాపం! పసిపిల్లల ఆకలికీ వారి ఆశలకి కులం పేరుతో అడ్డుకట్టవేసే ఈ





నోములు చేస్తే ఏం? చేయకపోతే ఏం?

కృష్ణవేణికంటే ముందరగా పరిగెత్తి వెళ్లారు పిల్లలు!

వెనకగా నడుస్తూ వచ్చి ఇంట్లోకి అడుగుపెట్టబోతున్న కృష్ణవేణి హఠాత్తుగా ఆగిపోయింది!

వాకిట్లో- ఎత్తు అరుగు కిందనుండి సన్నటి మూలుగు వస్తోంది!

వానకి తడవకుండా ఆ అరుగుకింద తల దాచుకున్న ఆ ముసలితల్లిని కృష్ణవేణి ఎలా మరిచిపోగలదు?

రోజూ మంచినీళ్ళకోసం రేవుకి వెళ్ళే కృష్ణవేణికి ఆమె అక్కడే నది ఒడ్డున రాయిమీద కూర్చుని వణుకుతున్న శరీరం స్వాధీనం చేసుకుంటూ, కంపిస్తున్న చేతులెత్తి కళ్ళపై పెట్టుకుని దూరంగా సుదూరంగా నదిమీద రాబోయే తన కొడుకుకోసం వాడు తెచ్చే ఆహారంకోసం ఎదురుచూసే జాలరి జ్ఞానమ్మ!

జ్ఞానమ్మ కూడా కృష్ణవేణిని గుర్తుపట్టి నీరసంగా అన్నది "తల్లీ నువ్వా! నదిమీద పోయిన బిడ్డడు ఇంకా రానేలేదు! ఈ గాలివానలో వస్తాడో తెలియదు! రాడో తెలియదు! తల్లీ! కాస్త చద్దన్నం ఉంటే పెట్టించు అమ్మా! ప్రాణం కడగట్టిపోతోంది! భోజనం చేసి రెండు రోజులయింది! కాస్త పుణ్యం కట్టుకో తల్లీ!"

కృష్ణవేణికి గుండె చిక్కపట్టినట్లయింది! అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. వెంటనే సమాధానం చెప్పలేదు! గబగబా లోపలికి నడిచింది! హాల్లో ఒకవైపు పిల్లలు, మరోవైపు ఇంకో బ్యాచ్ కూర్చుని తింటున్నారు. సూరమ్మ హడావిడిగా ఉంది. మాధవరావు గదిలో పడుకున్నాడు. వంటింట్లోకి అడుగుపెట్టిన కృష్ణవేణి ఒక్కక్షణం ఊపిరి గట్టిగా పీల్చి వదిలింది!

ఎదురుగా బుట్టలో నిండుగా ఉన్న గారెలు!

హాల్లోకి తొంగిచూసింది! బ్రేవ్-బ్రేవ్ మని త్రేన్పుతూ బలవంతాన లాగిస్తున్నారు అక్కడివారు!

రెండు క్షణాలు ఆలోచించిన కృష్ణవేణి- కాసేపటికి గట్టి నిర్ణయానికి వచ్చింది. నెమ్మదిగా వంగి, చప్పుడుకాకుండా చేతికి వచ్చిన గారెలు తీసుకుని, చెంగులో కట్టుకుని సందులోకి వచ్చింది చప్పుడు కాకుండా! అంతే! తరుముతున్నట్లుగా పరుగులాంటి నడకతో వాకిట్లోకి వచ్చి, జ్ఞానమ్మ దగ్గరకు వచ్చి అన్నది "జ్ఞానమ్మా! తీసుకో! వెళ్ళు! ఇంటికి వెళ్ళి తిను! పో"

కంగారుగా చెంగులోని గారెలు జ్ఞానమ్మ కొంగులో పోసిన కృష్ణవేణిని అనుమానంగా చూస్తూ అడిగింది జ్ఞానమ్మ "తల్లీ! ఏమిటవి?"

"ప్రసాదం! దేవుడి ప్రసాదం! వెళ్ళు జ్ఞానమ్మా!"

"చాలా సంతోషం తల్లీ! వస్తానమ్మా!" కర్ర ఆసరాగా లేచిన జ్ఞానమ్మ- నెమ్మదిగా నడుచుకుంటు వానలో కలిసిపోయింది!

ఈ దృశ్యాన్ని-

ఏ పాపిష్టి కళ్ళు చూసాయో, తెలీదు కాని మరుక్షణంలో బాంబులా హాల్లో పేలిందా వార్త!

అంతే!

తాపీగా తింటున్న వాళ్ళు గబగబ తినేసి వెళ్ళిపోయారు! సూరమ్మ సంగతి తెలిసిన వాళ్ళు ఎలాంటి దృశ్యాలు చూడాల్సివస్తుందో నని భయపడుతూ నెమ్మదిగా జారుతున్నారు!

కాని-

ఇవేమీ గమనించని పరిస్థితిలో ఉంది సూరమ్మ! ఆ వార్త వింటూనే గుండె పట్టుకుని విరుచుకుపడిపోయింది! గదిలోనుండి మాధవరావు పరిగెత్తుకొచ్చాడు!

అలాంటి భయంకరమయిన వాతావరణంమధ్య నిశ్శబ్దంగా తలొంచుకొని హాల్లో అడుగుపెట్టింది కృష్ణవేణి.

తుఫాను ముందరి ప్రశాంతతలా ఉంది వాతావరణం! కాసేపటికి తేరుకున్న సూరమ్మ అక్కడే కూలబడి రోదించసాగింది "నేనేం పాపం చేశానని నాకీ శిక్ష! చెప్పవే! చెప్పు! నా వ్రతఫలం అంతా ఆ జాలరిదానికి ధారపోశావు కదటే పాపిష్టిదానా! లేదు! నేను బతకను! చచ్చిపోతాను! ఇంత ఘోరం జరిగాక ఇంకా ఎలా జీవించి ఉండను! ఈ అగ్నిహోత్రుల సూరమ్మ ఆచారంమీద, పరువు ప్రతిష్టలమీద అందరూ ఉమ్ములేస్తారే! ఈ సంగతి

తెలిస్తే అందరూ కథలు కథలుగా చెప్పు కుంటారే! అయ్యో!''

మాధవరావుకి తల్లి మాటలు విన్పించ డంలేదు. అతని కళ్లు సూటిగా కృష్ణవేణినే చూస్తున్నాయి.

బరువుగా రెండు అడుగులు ముందుకు వేశాడు!

అంతే? రెండు చెంపలు అదిరిపోయేలా ఛెళ్ళుమనిపించాడు.

కందిపోయిన బుగ్గలతో స్థాణువులా, పెదవి విప్పకుండా, అలాగే నిలబడిపోయింది కృష్ణవే ణి!

మౌనంగా, బొమ్మలా అలాగే నిల్చున్న కృష్ణ వేణిని చూసేకొద్దీ రెచ్చిపోతున్నాడు మాధవ రావు! ఇంతక్రితం జరిగిన సంఘటలన్ని అతని మెదడులో డైనమైట్లలా పేలసాగాయి.

''ఎంత ధైర్యం నీకు? వద్దు! వెళ్లిపో! ఈ ఇంటినుండి వెళ్ళిపో'' వెర్రివాడిలా అరిచాడు!

ఎక్కడో పిడుగుపడిన శబ్దం! గాలి హోరు మంటూ వీస్తోంది. చీకటులు కమ్ముకొస్తున్న ఆ వాతావరణం ప్రళయానికి నాందీ ప్రస్తావనలా ఉంది.

అప్పుడు రక్షించడానికి ఏ అవధానీ రాలే దు.

కృష్ణవేణి మౌనంగా వెనుతిరిగి బయటకు అడుగేసింది. వెనకే పెద్ద శబ్దంతో తలుపు దభేలున మూసుకున్నది.

కుండపోతలా కురుస్తున్న వర్షం మధ్య నిల్చున్న కృష్ణవేణి- ఆకాశంలోకి తలెత్తి చూ సింది.

ఎర్రటి కెంపు మెరుపు మెరిసి క్షణంలో మాయమయిపోయింది. మరుక్షణం ఎక్కడో పిడుగు పడిన శబ్దానికి భూమి కంపించిపో యింది. అంతకంతకు ఉధృతమవుతున్న ఆ గాలివానలో సజీవప్రతిమలా ముందుకు నడిచి రేవుకు చేరుకుంది.

ఆ గాలివానలో ఆ భయంకరమయిన వాతా వరణంలో అలా ఎంతసేపు కూర్చుందో తనకే తెలియదు.

''అమ్మాయిగారూ!'' పిలుపుకు ఉలిక్కిపడి వెనుతిరిగి చూసింది!

జ్ఞానమ్మ కొడుకు! తెల్లబోతూ అడిగాడు, ''ఇక్కడ ఒంటరిగా. ఈ గాలివానలో ఏం చేస్తున్నారమ్మాయిగారూ''

''మా ఊరికి పడవ కడతావా?''

''అమ్మాయిగారూ! ఇప్పుడా! ఈ వేళలోనా? ఈ వాతావరణంలోనా? ఏమాత్రం గాలి ఎదు రుతిరిగినా పడవ గల్లంతవుతుంది. నాకయితే ఫరవాలేదు. ఈత వచ్చు కాని మీరు?''

''అదే నయం'' అనుకుంది మనసులో. ''వెళ్ళాలి... ఈ క్షణమే వెళ్ళాలి'' స్థిరంగా చెబుతున్న కృష్ణవేణివైపు వింతగా చూసిన జ్ఞానమ్మ కొడుకు ఇక మాట్లాడలేకపోయాడు.

చిక్కటి చీకటి అలుముకున్న ఆ సమ యంలో గాలిహోరు మధ్యన నురగలు కక్కు తూ పరుగులు తీస్తున్న కృష్ణా తరంగాలమీద ఎగిరెగిరి పడుతూ ప్రయాణిస్తున్న కృష్ణవేణి కళ్లకు.

ఆకాశంలో ఫ్లాష్‌లా మెరిసిన మెరుపు వెలు గులో- తన ఊరి వేణుగోపాలస్వామి ఆలయగో పుర శిఖరం కన్పించింది అస్పష్టంగా!



చల్లటిగాలి శరీరాల్ని స్పృశిస్తూ వెళ్లిపో యింది. ప్రకృతి సైతం నిశ్శబ్దమైపోయి, కృష్ణ వేణి తరంగాల సవ్వడిని మౌనంగా, దీనంగా వినసాగింది. ధ్వజస్తంభంమీది చిరుగంటలు చిన్నగా గలగల శబ్దం చేయసాగాయి.

.............

దీర్ఘంగా నిట్టూర్చాడు గిరిధర్!




అతని ఎదురుగా- గోడకి ఆనుకుని కూర్చున్న కృష్ణమాచార్యులుగారు కాసేపటివరకూ మాటలు రానట్లుగా మౌనంగా, మూగగా ఉండిపోయారు.

ఎవరో భక్తుడు వచ్చి జేగంట మ్రోగించేటంతవరకూ ఆయన ఈ లోకంలో లేనట్లుగానే ఉండిపోయారు.

ఆచార్యులుగారు లేస్తుంటే గిరిధర్ కూడా లేచినిల్చున్నాడు.

"గిరీ! రాత్రికి మా ఇంటికి రాకూడదూ!"

"అలాగే బాబుగారూ!" అంటూ సెలవు తీసుకుని మెట్లుదిగి వెళ్ళిపోయాడు గిరి. అంతవరకూ గిరి చెబుతున్న సంఘటనలను ఊపిరి బిగపట్టి వింటూ, ప్రజ్వరిల్లుతున్న హృదయంతో రెండడుగుల అవతల ఉన్న స్తంభం చాటున ఉన్న వేణు నిశ్శబ్దంగా పక్కకి తప్పుకోవడం ఇరువురూ గమనించలేదు.

ఆ రాత్రి-

వాకిట్లో మంచంమీద కూర్చుని ఉన్నారు. ఆయన ఎదురుగా గట్టుమీద గిరి కూర్చున్నాడు.

రెండు నిమిషాలు మౌనం తర్వాత కదిలి అడిగారు ఆచార్యులుగారు.

"ఊ! అయితే ఏం ఆలోచించావు?"

"ఇందులో ఆలోచించడానికి ఏమున్నది? హాయిగా ఇక్కడే ఉంటుంది" నివ్వెరపోయారు ఆచార్యులుగారు. "ఆఖరుకి ఇదా నీ నిర్ణయం?"

ఆవేశంతో గుప్పిళ్లు బిగించి అన్నాడు గిరి "మరి? తెలిసీ చూస్తూ చూస్తూ మళ్ళీ ఆ నరకకూపంలో తోయమంటారా? నా వల్ల కాదు"

"గిరీ! కాస్త ఆవేశం తగ్గించి నిదానంగా ఆలోచించు!"

నిస్సహాయంగా అన్నాడు. "ఆవేశం కాదు బాబూగారూ! ఆవేదన! నా చెల్లిని ఇన్ని రకాలుగా చిత్రహింసలకు గురిచేసిన వాళ్ళ చేతుల్లోకే మళ్లీ నెట్టమంటారా?"

"గిరీ! ఒక్కటి ఆలోచించు! నిజమే! నువ్వు చెప్పినదీ నిజమే! ఇలా ఎన్నిరోజులు? మంచి జరిగినా- చెడు జరిగినా ఆడపిల్లకలవాళ్ళం మనకే దెబ్బ! నలుగురూ నాలుగు విధాలుగా అనుకునేది మనగురించే! పుట్టింట్లోనే ఉండిపోయిందని నింద మినహా ఒరిగేది ఏమిలేదు. మన సమాజం గురించి తెలియని దేనున్నది? ఉన్నన్నాళ్లు బాగానే ఉంటుంది. ఏ కాస్త లోపం వచ్చినా వేలెత్తి చూపిస్తుంది. అంతవరకూ ఎందుకు? రేపు నీకు పెళ్ళయితే వచ్చే నీ భార్య ఒప్పుకుంటుందా? రెండురోజులు భరిస్తుంది. నాలుగురోజులు భరిస్తుంది. అంతే కాని జీవితాంతం భరిస్తుందా? కృష్ణవేణి భవిష్యత్‌లో ఎన్ని నిందలు భరించాల్సివస్తుందో ఆలోచించు! బయటకు తలెత్తుకుని కూడా తిరగలేని పరిస్థితి రావచ్చు! కష్టమయినా, నిష్ఠూరమయినా ఆడదానికి అత్తవారిల్లే అనుకూలం గిరీ! ఇక మనుమలు, మనస్థత్వాలు అంటావా? నూరమ్మ ఎల్లకాలం ఉండబోదు. మాధవరావు ఎప్పటికయినా మారకపోడు! కాలమే అన్నింటికీ మందు. గుణపాఠం గిరీ! ఏదయినా తెగేటంతవరకూ లాగడం ఎవరికీ శ్రేయస్కరం కాదు! ఆలోచించు!"

"కాని... అక్కడకు అడుగుపెట్టాలంటేనే అసహ్యం వేస్తోంది! ఒళ్ళు తెలియని కోపం వస్తోంది? ఎలా ఒంటరిగా పంపమంటారు?"

"పిచ్చివాడా! నేనున్నాను కదయ్యా" నవ్వుతూ అన్నారు ఆచార్యులుగారు!

"మీరా?" ఆశ్చర్యంతో అడిగాడు గిరి!

"అవును నేనే! కృష్ణవేణిని తీసుకెళ్ళి అత్తవారింట్లో దించివస్తాను! ఇది పద్ధతి కాదని తల్లీ కొడుకులను మందలించి మరీ వస్తాను. సరా!" గిరి మాట్లాడలేదు.

ఆచార్యులుగారు గిరి భుజంమీద చెయ్యి వేసి అన్నారు. "గిరీ-నువ్వేం ఆలోచనలు పెట్టుకోకు. కాలమే అన్ని సమస్యలను పరిష్కరిస్తుంది. నిశ్చింతగా వెళ్ళిరా!"

గిరి మౌనంగా లేచి చీకట్లో కలిసిపోయాడు.

మర్నాడు ఉదయమే.

కృష్ణమాచార్యులుగారు ఆ ఊళ్ళోనే ఉన్న సోమశేఖరశాస్త్రిగారికి ఆరోజు అర్చక బాధ్యత అప్పగించి కృష్ణవేణిని తీసుకుని పడవలో బయలుదేరారు.

గువ్వపిట్టలా ఒదిగికూర్చున్న కృష్ణవేణికి

కన్పించేటంతవరకూ చెయ్యి ఊపుతూనే ఉన్నాడు గిరిధర్!

కృష్ణమాచార్యులుగారు కృష్ణవేణిని తీసుకుని ముందరగా నూరమ్మ ఇంటికి వెళ్ళాడు.

నూరమ్మ బుడిబుడిరాగాలు, మాధవరావు కారాలు మిరియాల నూర్పిళ్లు- అయ్యేటంతవరకూ భరించి- చెప్పవలసిన విధంగా చెప్పి కృష్ణవేణిని బెంగపడవద్దని హెచ్చరించి మరీ వెనుతిరిగారు.

ఎందుకో వచ్చేస్తుంటే అమాయకంగా మాటిమాటికీ నీళ్ళు కారుతున్న కృష్ణవేణి కళ్ళే గుర్తుకొచ్చాయి. పులిబోనులో లేడిపిల్లను వదిలి వస్తున్నట్లనిపించింది. వస్తూ పక్కరేవులోనే ఉన్న తోడల్లుడు శ్రీనివాసాచార్యులుగారింటికి వెళ్ళి అక్కడొక గంటసేపు కూర్చున్నారు.

వస్తుంటే ఆయన భార్య ఆండాళమ్మకి ఇష్టమని చెప్పి ఇరవయివరకూ మంచి మిగల ముగ్గి, కమ్మటివానన వస్తున్న వెలగపళ్ళను బుట్టనిండా పెట్టి ఇచ్చింది! ఆచార్యులుగారు ఆ బుట్ట తీసుకుని రేవు ఒడ్డుకువచ్చారు.

పడవకి లంగరు విప్పబోతున్న రంగడు ఆచార్యులుగారిని చూస్తూనే నమస్కారంచేసి అడిగాడు ''ఏం సామీ! అమ్మాయిగారిని అత్తవారింట్లో దింపివస్తున్నారేటీ''

పడవ కదలకుండా పట్టుకున్నాడు.

''అవునురా'' అంటూ చేతిలోని బుట్ట రంగడికిచ్చారు. రంగడు ఆ బుట్టను, జాగ్రత్తగా ఎత్తి పడవ మధ్యగా పెట్టి, అప్పటికి పడవలో ఎక్కిన ప్రయాణికులను పక్కకుసర్ది ''రండి సామీ!'' అంటూ ఆయన ఎక్కబోతుంటే పడవ అటూ ఇటూ ఊగకుండా గట్టిగా చేతులతో అదిమిపెట్టి నించున్నాడు.

వెంటనే బయలుదేరింది పడవ! వయ్యారంగా ఊగుతూ!

టైము పది అయింది. సూర్యుడు బాగాపైకి వచ్చాడు. ఎండకూడా బాగా ఉండటంతో నెత్తి మాడుతున్నట్లుగా ఉంది. నదిమీదనుండి చల్లటి గాలి వీస్తున్నా స్వల్పంగా చెమటలు పడుతున్నాయి.

చిరాకుగా భుజంమీద ఉత్తరీయం తీసుకుని, నుదురు తుడుచుకుంటూ తల తిప్పబోతున్న కృష్ణమాచార్యులుగారి దృష్టి అప్పుడు పడింది.

దూరంగా దాదాపు నలభయి అడుగులదూరంలో తమ ఊరివైపే వస్తున్న పడవమీద, ఆ పడవ అంచుమీద, అనుకున్నట్లుగా కూర్చుని వున్నాడు వేణు. అతని పక్కగా తట్టలు పేర్చి ఉన్నాయి. సిటీనుండి వస్తున్నట్లున్నాడు. పూలు సిటీకి సప్లయిచేసి వస్తున్నట్లున్నాడు. ఈ రోజు బాగా ఆలస్యం అయింది ఎందుకో!

నీటిప్రవాహాన్ని కోస్తూ వేగంగా దూసుకువెడుతోంది ఆ పడవ.

ఎందుకో కృష్ణమాచార్యులుగారి హృదయం సన్నగా మూలిగింది. మనసు రెపరెపలాడింది. హృదయంలో ఏమూలో సన్నగా రెపరెప లాడుతున్నట్లుగా మొదలయిన పరితాపం తీవ్రతరమై, గుండెల్ని కోస్తూ... బయటపడింది అప్రయత్నంగా ఆయన అన్న ''గోపాలా! వేణుగోపాలా!'' అన్నమాటల ద్వారా!

లయబద్ధంగా అటూ ఇటూ ఊగుతున్న పడవతోపాటు, ఆయన శరీరం కూడా ఊగుతోంది.

కిష్టయ్య, రంగడు ఏవో పాటలు పాడుతున్నారు. కాని ఆయనకి అవేమీ విన్పించడంలేదు.

స్వల్పంగా శరీరం కంపించినట్లయింది. చప్పున కళ్ళు మూసుకున్నాడు.

అప్పుడాయన మదిలో మెదిలింది.

చిరునవ్వులు చిందిస్తూ... పిల్లనగ్రోవి ఊదుతూ నిత్యం ఆయన కొలిచే అల్లరి వేణుగోపాలుడు కాదు.

చేతులు కట్టుకుని గంభీరంగా ముందుకు చూస్తూ, దూసుకుపోతున్న పడవలో ఉన్న వేణు!

నెమ్మదిగా కళ్లు విప్పారు.

కాసింత దూరంలోనే కన్పించింది వేణుగోపాలస్వామి ఆలయం!

లీలగా... ఆలయంలోని జేగంటలు వినబడుతున్నాయి.

ఎత్తుగా ధ్వజస్తంభం కనబడుతోంది. రేవు





ఒడ్డున నాలుగయిదు పడవలు ఇటువైపుకి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాయి. అందులో సగంమంది సిటీలో ఆడుతున్న 'ఉదయం ఆట' సినిమా చూడటానికి వెళుతున్నవాళ్ళే.

రేవులో జనం చాలామంది ఉన్నారు.

చూస్తుండగానే ఒడ్డుకుచేరింది పడవ. రంగడు ఛెంగున పడవలోనుండి దూకి లాగినట్లుగా పట్టుకుని లంగరేశాడు.

ప్రయాణికులు ఒక్కొక్కరే దిగిపోయిన తర్వాత, ఆఖరున కృష్ణమాచార్యులుగారు దిగారు.

రంగడే వెలగవళ్ళ బుట్ట తీసి ఆయన చేతికి అందించి "ఉంటాను సామి" అంటూ దండంపెట్టి తన పనిలో పడిపోయాడు.

కృష్ణమాచార్యులుగారు నరానరి ఇంటికి బయలుదేరారు. మధ్యమార్గంలో సోమశేఖరశాస్త్రిగారు కన్పించి చెప్పారు. "మీకోసం గిరి వచ్చి వెళ్ళాడు. ఇప్పుడే పావుగంటక్రితం"

"ఆ! ఆ! నేనూ ఇప్పుడే వస్తున్నాను. మధ్యలో మా తోడల్లుడు వాళ్ళింటికి వెళ్ళివస్తున్నాను. అందుకే కాస్త ఆలస్యం అయింది. గిరి సాయంత్రం మళ్ళీ కలుస్తాడులే"

"వెళ్ళిన పని అయిందా? అందరూ కులాసానా?" సోమశేఖరశాస్త్రికి ఆయన ఎందుకు వెళ్ళారో చూచాయగా తెలుసు!

"ఆహా! అందరూ క్షేమం!" మాటల్ని తుంచేస్తూ గబగబా ముందుకు నడిచారు. మధ్యలో ఏదో గుర్తుకొచ్చినట్లుగా బుట్టలోనుండి రెండు వెలగవళ్లుతీసి ఆయన చేతిలో పెట్టారు.

కృష్ణమాచార్యులుగారు ఇంటికి వచ్చేసరికి. హాల్లో, గోడకి ఆనుకుని కూర్చుని, తీరికగా త్యాగరాజ కీర్తన రాగంతీస్తూ, వత్తులు చేసుకుంటోంది ఆండాళమ్మగారు. ఆమె పక్కనే ఇంత విడదీసిన వత్తి, వీబూధిపండు ఉన్నాయి. చేసిన వత్తులు లెక్కపెట్టి పక్కనే ఉన్న సీసాలో వేస్తోంది.

భర్తని చూడగానే, లేచి, చేతులో ఉన్న వత్తిని వక్కనపెట్టి పెరట్లోకి వెళ్ళి ఇత్తడి చెంబుతో కాళ్లు కడుక్కోడానికి నీళ్లు తెచ్చి ఇచ్చి ఆయన చేతిలోని బుట్ట తీసుకుని లోపల పెట్టింది.

ఆయన కాళ్లు కడుక్కుని, నోట్లో నీళ్లు పోసుకుని పుక్కిలించి ఉమ్మేసి ఇసుక అంటిన కాళ్ళను శుభ్రంగా తుడుచుకొని లోపలికివచ్చారు.

ఆయనకి తువ్వాలు అందిస్తూ అడిగింది ఆండాళమ్మ "అందరూ బాగున్నారా!

కృష్ణ వాళ్ళ అత్తగారు, వాళ్ల ఆయనా ఉన్నారా? ఏమన్నారు? ఏమయినా గొడవ చేశారా?"

కృష్ణమాచార్యులుగారు వెంటనే సమాధానం చెప్పలేదు. ఏదో దీర్ఘాలోచనలో ఉన్నట్లుగా ఉన్న భర్తని చూసి ఆండాళమ్మ మరి రెట్టించలేదు. రాత్రికి, భోజనాలు అయినాక, ఆరుబయట మంచం వేసుకుని తీరికగా అన్ని కబుర్లు, విశేషాలు అడగకుండానే ఆయనే చెబుతారు. ఈ లోపల తను ఆత్రపడటం దేనికి?

"భోజనానికి రండి! వడ్డిస్తున్నాను" భోజనం వడ్డించి పిలిచింది.

భోజనానికి కూర్చున్నా ఆయన పెద్దగా మాట్లాడలేదు. పరాకుగానే భోజనం కానిచ్చి, గదిలోకి వెళ్ళి పట్టెమంచంమీద నడుం వాల్చారు.

రోజూ భోజనం చేయగానే కాసేపు పడుకుని కాస్త కునుకు తీయడం ఆయనకు అలవాటు. ఆయన కాస్త కునుకు తీసేలోపల, ఆండాళమ్మ తన భోజనం పూర్తిచేసి, వంటిల్లు సర్ది, ముందుగదిలోనే నేలమీద, పవిటచెంగు పరచి, మండిగంమీద తలపెట్టుకుని కాసేపు ఆమె కూడా చిన్న నిద్రతీస్తారు. రాత్రిపూట ఇద్దరూ కలసి భోజనం చేస్తారు.

ఎందుకో ఈరోజు ఆచార్యులుగారికి నిద్రరావడంలేదు. ఏ అదృశ్య హస్తమో భుజాన్ని తట్టి చెబుతున్నట్లుగా ఉంది. తెరలు తెరలుగా ఆలోచనలు ఈగల్లా ముసురుతున్నాయి. అనుక్షణం వేణుగోపాల నామస్మరణతో ప్రశాంతంగా ఉండే ఆయన మనసు... అలజడిగా ఉంది. నిర్మలంగా ఉన్న నదిలో చిన్నరాయి వేస్తే... వచ్చే నీటితరంగాలకిమల్లే ఆయన హృద

యంలో అర్థంకాని ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

మొట్టమొదటిసారిగా మనసులో అనుకున్నారాయన.

ఆరోజు తను తొందరపడలేదుకదా?

తొందరపడి తప్పు చేయలేదుకదా?

స్వల్పంగా ఆయన పెదవులు కంపించాయి. అసహనంగా పక్కకి తిరిగినట్లుగా దొర్లారు.

ఆయన మనోనేత్రం ముందు రకరకాల తెరలు తొలగిపోతున్నాయి గత కాలపు దృశ్యాల యవనికను ముందుకి పొరలు, పొరలుగా తెస్తూ...

..................

అదే సమయానికి ఒళ్ళు బడలికతో కొంచెం జ్వరంగా ఉండడంతో గదిలో పడుకుని ఉన్న కృష్ణవేణి మనసు పరిపరివిధాల పరిగెడుతోంది.

ఎందుకో తెలియని అలజడి మొదలయింది. మెదడులో ఏవేవో ఆలోచనలు చెల్లాచెదురుగా కదిలిపోతున్నాయి.

ఏవో ఊహలు గుసగుసలాడుతున్నాయి. రకరకాల దృశ్యాలు కళ్ళముందు కదలాడిపోతున్నాయి.

కిటికీలోనుండి కన్పిస్తున్న సన్నజాజితీగ ఏవో ఊసులను చెప్పాలని ప్రయత్నిస్తోంది. ఆలోచిస్తూ అప్రయత్నంగా వెనక్కివాలిన కృష్ణవేణి చెవులను సుదూరతీరాలనుండి వేణుగానసరవళి సోకింది.

తనకు తెలియకుండానే గుండె స్పందించసాగింది.

ఆ వేణుగానం గతకాలపు స్మృతులకు తెరతీయసాగింది.

..................

సన్నజాజి పందిరికింద మంచంమీద పడుకుని ఉన్న వేణు పరిస్థితి కూడా గందరగోళంగా ఉంది.

ఏదో తెలియని భావోద్వేగం!

ఎందుకో గుండెలు ఆవేశంతో ఎగిరెగిరి పడసాగాయి.

కంట్రోల్ చేసుకుంటూ కళ్లు మూసుకున్న వేణు కళ్ళముందు రకరకాల దృశ్యాలు కదిలిపోసాగాయి.

..................

ఈ ముగ్గురికీ ఆలోచనలు మిళితం చేసుకుని కాలం గతంలోకి పరిగెత్తింది వేగంగా!

మరుగున పడిపోయిన సంఘటనలకు మెరుగుపెడుతూ

★ ★ ★

ఎడంచేత్తో గంటమ్రోగిస్తూ కుడిచేత్తో హారతి పళ్లెం పట్టుకుని, వేణుగోపాలస్వామికి కర్పూర నీరాజనాన్ని సమర్పిస్తున్న కృష్ణమాచార్యులగారికి ముఖ మండపంలోనుండి ఆగకుండా మ్రోగిస్తున జేగంట మోత విన్పించింది.

తలతిప్పి చూశారు.

వేణు!

వేణు చేతిలో పెద్ద గులాబీదండ ఉంది! అప్పుడే విచ్చుకుంటూ, స్వచ్ఛంగా ఉన్న లేత గులాబీ పూలమీద అక్కడక్కడా మంచు బిందువుల తడి ఇంకా ఆరనేలేదు.

ఎంతో అందంగా నిండుగా ఉన్న ఆ దండ తాలూకు పరిమళం ఆ ప్రాంగణమంతా వ్యాపించిపోయింది.

"ఆమధ్యన బెంగుళూరునుండి తెప్పించానని చెప్పాను. గుర్తుందా బాబాయ్! ఆ గులాబి మొక్కలకు పూసిన పూలు! మొట్టమొదటగా ఈరోజే కోశాను. అందుకే ఈ మాల స్వామికే సమర్పిద్దామని వచ్చాను" ఆయన చేతిలో పెడుతూ చెప్పాడు వేణు. కృష్ణమాచార్యులుగారు ఆ దండని తీసుకుని రేకలు రాలిపోకుండా జాగ్రత్తగా రెండు చేతులతో కందిపోతుందేమో నన్నంత భద్రంగా పట్టుకుని వేణుగోపాలస్వామి మెడలో అలంకరించారు.

స్వామి కంఠాన్ని అలంకరించిన ఆ మాల మోకాలివరకు వచ్చి ఎంతో నిండుగా ఉంది.

ఒక్కక్షణం కన్నార్పకుండా, చూసి తృప్తిగా నిట్టూర్చారు కృష్ణమాచార్యులుగారు గులాబీ పూల హారంలో ఎంత అందంగా ఉన్నాడని ఆ




వేణుగోపాలుడు. గర్భగుడిలోనుండి బయటకు వచ్చి అడిగారాయన. "ఏరా వేణూ! సిటీకి బయలుదేరబోతున్నావా?"

"అవును బాబాయ్ వస్తాను. పూలబుట్టల న్నీ పడవకి ఎక్కించేశాను" అంటూ, దేవుడి వైపు తిరిగి ఒక్కక్షణం కళ్లు మూసుకుని దణ్ణం పెట్టుకుని వెనుతిరిగి హడావిడిగా మెట్లు దిగుతూ వెళ్ళిపోయాడు.

ఇంకా భక్తులు ఎవరూ రాలేదు.

అప్పుడే తెలతెలవారుతోంది.

అటువైపే చూస్తూ నించున్న ఆచార్యులుగారు, వేణు పూర్తిగా మెట్లు అన్నీ దిగి, రేవు వైపుకి వెళ్ళగానే తానుకూడా గుడి ముఖ మండపంలో ఉత్తరంవైపునున్న పిట్టగోడ దగ్గరకు నడిచారు.

అక్కడినుండి చూస్తే రేవు ఒడ్డు అంతా కన్పిస్తుంది.

అప్పటికే, కూరలు, పళ్లు ఉన్న బుట్టలతో పడవలు ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాయి.

వాళ్ళ మధ్యనే గిరిధర్ కూడా ఉన్నాడు. చేతిలో ఏదో చిన్న పుస్తకం పట్టుకుని బుట్టలను చూపిస్తూ గబగబా ఏవో నోట్ చేసుకుంటున్నాడు.

ఆ సమయంలో సాధారణంగా రేవు మంచి సందడిగా ఉంటుంది. కొంచెం అవతలగా చేపలు పట్టడానికి వెళ్లే పడవలు కూడా నదిలోకి ప్రవేశిస్తూ అక్కడ కూడా సందడిగా ఉంటుంది.

దూరంగా నదిలో అక్కడ కూడా పడవలు ఊగుతున్నట్లుగా కన్పిస్తున్నాయి. ఆకాశం క్రమంగా కనకాంబరం రంగుని కోల్పోయి ధవళ కాంతికి తిరుగుతోంది. పూర్తిగా వెలుగు వచ్చేవరకు, ఆచార్యులుగారు అక్కడే నించున్నారు.

గంటశబ్దానికి ఉలిక్కిపడ్డట్లుగా అయి వెనక్కి తిరిగిచూశారు.

కృష్ణవేణి!

అప్పుడే తలస్నానంచేసి వచ్చినట్లుంది. కడిగిన ముత్యంలా, రేకులు విప్పని గులాబీ మొగ్గలా ముగ్ధలా నించుని వుంది. చేతిలో వైరుతో అల్లిన పూలబుట్టలో తులసీదళాలతో కట్టిన మాల ఉంది.

కృష్ణమాచార్యులుగారు పలకరింపుగా నవ్వి ఆ మాల తీసుకుని వేణుగోపాలుని మెడలో గులాబీదండ మీదుగా సర్ది జాగ్రత్తగా వేశారు.

"ఏం కృష్ణా! ఏమిటి విశేషం. కొత్తగా ఉన్నావు" అడిగాడాయన.

సిగ్గుపడ్డట్లుగా నవ్వింది. "ఇవ్వాళ నా పుట్టినరోజు! అన్నయ్యేమో ఎంత చెప్పినా, పని ఉందంటూ రాలేదు. సాయంత్రం మిమ్మల్ని కలుస్తానని చెప్పమన్నాడు"

"శుభం! శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తూ" చెయ్యెత్తి దీవిస్తూ అన్నారాయన.

చిన్నగా నవ్వింది.

"ఏమిటో! అన్నయ్య కూడా ఎక్కువగా ఉండటంలేదు. పెళ్ళిళ్ళ సీజన్‌కదా! బాగా హడావిడిగా ఉంటున్నాడు. నాకూ ఏమీ తోచడంలేదు. అసలు తోటవైపే రావద్దంటాడు అన్నయ్య! ఇన్నాళ్లూ ఏదో పనిచేస్తూ హఠాత్తుగా మానేసి ఇల్లు కదలొద్దు అంటే... ఎవరికి మాత్రం ఏం తోస్తుంది? మీరే చెప్పండి" ఫిర్యాదు చేస్తున్నట్లుగా చెప్పింది.

నవ్వి అన్నారాయన "మరి ఇంకా ఎప్పుడూ ఇదివరకులా తోటపని అంటూ వెళ్తే ఎలా అనుకున్నావు. పైగా ఈడొచ్చిన పిల్లవి"

"పోనీ! మీరే చెప్పండి. మీమాట కాదనడు"

"ఏమని చెప్పమంటావు?"

"మీ ఇష్టం. ఏదో ఒకటి, కాని నేను మాత్రం ఎలాగయినా పనిచేయాలి"

"సరే! చెప్పి చూస్తాను" సాలోచనగా అన్నారాయన.

కాసేపు అటూ ఇటూ తిరిగి, పిట్టగోడ దగ్గర కాసేపు నించుని ఇంటికి వెళ్లిపోయింది కృష్ణవేణి.

మధ్య మధ్యలో నలుగురయిదుగురు భక్తులు వచ్చివెళ్ళారు.

హఠాత్తుగా గుర్తుకొచ్చాయి ఆచార్యులుగారికి, నాలుగురోజుల క్రితం వేణు చెప్పిన మాటలు! "బాబాయ్! మీకు బాగా తెలిసినవాళ్ళు ఎవరయినా ఉంటే చెప్పండి. నాకయితే అసలు తీరిక ఉండటంలేదు. పూల మాల కట్టి

ఇవ్వాలి. దాదాపు రోజుకి రెండు మూడు బుట్టలమాల సాయంత్రం టైముకి సిటీకి పంపించాలి. అంటే మధ్యాహ్నానికల్లా నేను ఇంటికి తీసుకొచ్చి ఇస్తాను పూలు. మళ్లీ సాయంత్రం నాలుగింటికి వెళ్లి కట్టినమాల తీసుకుంటాను. మూరకి ఇంత అని డబ్బు ఇస్తాను. నలుగురు ఒప్పుకున్నారు. కనీసం ఇంకా ఒకరిద్దరు కావాలి. పెళ్ళిళ్ళ సీజను కూడాను. కట్టిన మాలలకు మంచి గిరాకీ ఉంటుంది''

ఏవో పనుల వత్తిడిలో ఆమాట మర్చిపోయారు తాత్కాలికంగా. హఠాత్తుగా, ఇప్పుడు గుర్తుకువచ్చింది.

''కృష్ణవేణికి కొంతవని అప్పజెప్తే?'' అన్న ఆలోచన వచ్చిందాయనకు.

డబ్బుకోసం కాకపోయినా కాలక్షేపం కోసం!

ఆ సాయంత్రం గిరి కలిసినప్పుడు అదే మాట అన్నారాయన.

''దాని మొహం'' నవ్వేస్తూ అన్నాడు గిరి.

''పాపం! ఇంటి దగ్గర ఏమీ తోస్తున్నట్లు లేదు. పోనీ... ఇంటి దగ్గర కూర్చుని చేసేపనే కదా! బయటకు వెళ్ళేవనిలేదు. పైగా పెద్ద కష్టసాధ్యమయిన పనికూడా కాదు. ఏవంటావ్! మన వేణుకు చెప్పమంటావా?''

''కృష్ణవేణి ఇష్టం! నా అభ్యంతరం ఏమిలేదు''

కాసేపు ఇద్దరిమధ్యా మౌనం! కాసేపటికి కృష్ణమాచార్యులుగారు అడిగారు.

''ఏం గిరీ! ఏమిటి వనిమీద వెళ్ళినట్లున్నావు?''

క్షణంసేపు మౌనంగా ఉండి చెప్పాడు గిరి!

''అవును బాబుగారూ! ఈమధ్యన నా స్నేహితుడొకడు కన్పిస్తే చూచాయగా చెప్పాను. కృష్ణవేణికి ఏదయినా మంచి సంబంధం ఉంటే చూడమని! వాడు కబురుచేస్తే వెళ్ళాను. ఏవో రెండు మూడు చెప్పాడు. ఒక మాదిరిగా ఉన్నాయి. మావాడు చెప్పిన మాటల్ని బట్టి రెండు సంబంధాల తాలూకు కుర్రవాళ్ళకు అంత మంచి అలవాట్లు ఉన్నట్లుగా అన్పించలేదు. ఆ సంగతి నా స్నేహితుడే చెప్పాడు. ఇద్దరూ హైదరాబాద్‌లో మంచి ప్రయివేటు కంపెనీలలో చేస్తున్నారట. నేను ఏ సంగతీ తేల్చి చెప్పలేదు.

గంభీరంగా అన్నారు కృష్ణమాచార్యులుగారు.

''నిజమే గిరీ! ఈ రోజుల్లో పెళ్లి విషయంలో తొందరపడటం మాత్రం అంత మంచిదికాదు! పిల్లవాడు ఎక్కడో హైదరాబాద్‌లో అంటున్నావు. ఏమో! ఎలాంటి అలవాట్లు ఉన్నాయో! మనకి తెలియదు. బస్తీ వాతావరణమంటే ఈ రోజుల్లో కుర్రవాళ్లు తొందరగా చెడులక్షణాలకి గురి అవుతున్నారు. పల్లెటూరివాళ్ళల్లో చెడులక్షణాలు గలవాళ్లు ఉండరా అంటే, ఉంటారు. కాని వీళ్ళకి అవకాశం, అందుబాటు, తక్కువ. అదీగాక మరీ దూరాభార సంబంధాలు మనకి తెలిసీ తెలియని సంబంధాలు చూడటం కూడా అంత మంచిదికాదురా గిరీ! రోజూ ఎన్ని ఘోరాలు వింటున్నామో? ఎవరు ఎలాంటివాళ్లో తెలియదు. అలాగని సంబంధాలు వెతకకుండా మానమనుకో! సాధ్యమయినంతవరకు మనకు తెలిసి మంచి సంప్రదాయం కలిగి, దగ్గరలో ఉండే సంబంధాలు చూడటం మంచిది. ఏమంటావ్? అన్నట్లు అమ్మాయి పుట్టినరోజని చెప్పింది''

''అవును బాబూగారూ! అందుకే నా తొందర!''

''అదిగో! పెళ్లి విషయంలో ఆ తొందరే వద్దంటాను. నీ కెందుకు? ఆ టైము వస్తే నువ్వు ఆగమన్నా ఆగదు! సరేనా! నేనూ చూస్తూవుంటాను. నువ్వు పెద్దగా దిగులుపడకు''

కాసేపు కూర్చుని వస్తానంటూ లేచాడు గిరి!

ఆ సాయంత్రం వేణు కలిసినప్పుడు కృష్ణవేణికి పూలమాల కట్టేపని అప్పగించవచ్చని చెప్పారు అచార్యులుగారు.

మర్నాడు మధ్యాహ్నం పన్నెండు గంటల వేళ!

వాకిట్లో రోడ్డుమీద ఆగకుండా మోగుతోంది సైకిలు బెల్లు.

ఈ టైములో ఎవరూ అనుకుంటూ తలుపు తీసుకుని వచ్చిన కృష్ణవేణి, సైకిల్ హేండిల్‌కి




అటూ ఇటూ నిండుగా పూలతో ఉన్న బుట్టలు తగిలించుకుని ఉన్న వేణు కన్పించాడు.

''మీరా'' అంది తేలిగ్గా నవ్వేసి ''రండి'' అంటూ తలుపు పూర్తిగా తీసింది. లోపల ఎవరూ లేరు. గిరి తోటకు వెళ్ళాడు.

వేణు రెండు బుట్టలు లోపలికి తీసుకువచ్చి గదిలో కిందపెడుతూ ''బాబాయిగారు చెప్పారుగా'' అన్నాడు.

చెప్పారన్నట్లుగా తలూపింది కృష్ణవేణి.

ఒక బుట్టలో నిండుగా మల్లెపూలు, మరో బుట్టలో అడుగున అంతా మరువం, పైన విస్తరాకువేసి దానిలో కనకాంబరాలు ఉన్నాయి.

చెప్పాడు వేణు, ''ఇదిగో చూడండి. నాలుగు మల్లెపూల తర్వాత కనకాంబరం వేయండి. అలాగే... రెండు మల్లెపూల వరున తర్వాత మరువం వాడండి! పోతే మరీ గుత్తంగా మనం ఇంటి దగ్గర కట్టుకున్నట్లుగా కట్టవద్దు. కాస్త దూరం దూరంగానే కట్టండి. నెక్స్ట్, నేను సాయంత్రం ఏదీ... ఇవాళ సాయంత్రం, ఖచ్చితంగా నాలుగు గంటలకల్లా వస్తాను. కట్టిన మాల ఈ బుట్టలోనే సర్దిఉంచండి. అబ్బా! ఏం ఎండలండీ బాబూ! కాసిని మంచి నీళ్ళు ఇప్పిస్తారా?'' హడావిడిగా గబగబా పాఠం చెప్పినట్లుగా చెప్పేస్తున్న వేణుని చూస్తుంటే నవ్వు వచ్చింది కృష్ణవేణికి!

నవ్వితే బాగుండదని, కంట్రోల్ చేసుకుని మంచినీళ్ల కోసం లోపలికి వెళ్లింది.

మంచినీళ్ల గ్లాసు తెచ్చి ఇస్తూ,

అప్పుడు చూసింది వేణుని దగ్గరగా. చాలా దగ్గరగా.

అదే సమయానికి వేణు కూడా కృష్ణవేణి కళ్లలోకే చూస్తున్నాడు.

తడబడినట్లుగా తల తిప్పుకుంది కృష్ణవేణి.

ఎండలో రావడంవలన, చెమటలు దిగజారుతున్నట్లున్నా అతని కళ్లల్లో ఉన్న వెలుగుతో కూడిన ఉత్సాహం ఆమెని ఆ సాయంత్రం మళ్ళీ అతను వచ్చేవరకూ వెంటాడుతూనే వుంది. ఇంతక్రితం వేణుని దూరంనుండి చాలాసార్లు చూసింది. కాని అతిచేరువగా చూడటం ఇదే మొదటిసారి.

చిన్నప్పుడే తల్లిదండ్రులను పోగొట్టుకుని, ఎంతో కష్టపడి పైకివచ్చి, ఇప్పుడీ పూలవ్యాపారంలో బాగా నిలదొక్కుకున్నాడని వాళ్లూ వీళ్లూ చెప్పుకుంటుంటే విన్నది, అతని గురించి.

ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తోంది.

అన్నయ్య భోజనంచేసివెళ్ళాక, పూలు ముందర వేసుకుకూర్చుని మాలకడుతోంది. అప్పుడనిపించింది, వేణు గొంతు చాలా బాగుంటుందని.

చెప్పినట్లుగా సాయంత్రం నాలుగుగంటలకల్లా వాకిట్లో గణగణమంటూ సైకిలుబెల్లు విన్పించింది. తర్వాత సైకిలుకి స్టాండు వేసిన చప్పుడు!

తలుపుతీసిన కృష్ణవేణికి, ఎదురుగా గుమ్మంలో నించున్న వేణు కన్పించాడు.

''లోపలికిరండి'' ఫ్రేముకుర్చీ లాగుతూ అన్నది.

''ఆహహా! నాకు ఇప్పుడు టైములేదు. పూలన్నీ కట్టేశారా?'' కంగారుపడిపోతూ అడిగాడు.

''ఆహా!'' కనుబొమలు ఎగరేసి చెప్పింది. లోపలికి వెళ్లి, మాలలు పేర్చిన బుట్టలు రెండూ తెచ్చి ఇచ్చింది.

వేణు ఒక్కక్షణం ఆలోచిస్తున్నట్లుగా ఉండి, మళ్ళీ ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా, బుట్టలు రెండూ కిందపెట్టి, ఒక బుట్టలోనుండి మాలతీసి, కాస్త లాగిపెట్టి తుంచాడు.

గిరుక్కున వెనక్కి తిరిగి అన్నాడు. ''ఇలా అన్నానని వేరేగా అనుకోకండి కృష్ణవేణిగారూ! కృష్ణానదీ పాయలా మీ జడ చాలా బాగుంటుంది. ఆ జడలోకి ఈ కదంబం మరీ మరీ బాగుంటుంది''

చెయ్యి ఎప్పుడు చాచిందో, ఆ చేతిలో కదంబమాల ఎప్పుడు ఉంచాడో అంతా కలలా జరిగిపోయింది.

అంతా రెండు క్షణాల్లో జరిగిపోయింది. ఏదో లోకంలోనుండి ఊడిపడ్డట్లుగా, తల విదిలించి చూసేనరికి వేణు వెళ్లిపోయాడు.

ఎందుకో హఠాత్తుగా సిగ్గనిపించింది.

''కృష్ణా! అమ్మాయిగారూ'' ఇలాంటి పిలుపులకు అలవాటుపడ్డ ఆమెకి ''కృష్ణవేణిగారూ'' అనే పిలుపు కొత్తగా, గమ్మత్తుగా అన్పించింది.

ఆ సాయంత్రం గిరి ఇంటికి వచ్చేవరకూ, ఆలోచనలు నదీప్రవాహంలా పరిగెడుతూనే ఉన్నాయి.

* * *

కృష్ణవేణి రోజులు చాలా త్వరగా గడిచిపోతున్నట్లు అన్పిస్తోంది. తనకే తెలియని ఉత్సాహం రెక్కలు విప్పుకుంటున్న అనుభూతి.

సాయంత్రం నాలుగవుతోంది అనుకోగానే అప్రయత్నంగా చెవులు విన్పించబోయే సైకిల్ బెల్‌కోసం, కళ్ళు వేణు రాకకోసం నిరీక్షించడానికి అలవాటుపడ్డాయి.

మొదటినుండి ఒక విధమయిన గంభీరతతో కూడిన వాతావరణం, కష్టాలమధ్య పెరుగుతూ రావడంవలనేమో వేణులోని ఉత్సాహం, అతని మాటల్లోని హుషారు కొత్తలో కాలకు తలుపులు తీస్తున్నట్లుగా అన్పిస్తోంది.

తనని చూడగానే వేణు కళ్ళల్లో ఛెంగున తుళ్ళిపడే కాంతి తన కళ్ళనెలా దాటేస్తుంది.

ఆరోజు-

సాయంత్రం నాలుగవబోతోంది. కట్టిన మాల బుట్టలో సర్ది మాటిమాటికి బయటికి తొంగిచూస్తోంది కృష్ణవేణి కిటికీలోనుండి.

సైకిల్ బెల్ విన్పించలేదు. కాని తలుపు టకటక శబ్దమయింది. ఉత్సాహంగా పరిగెత్తుకురాబోయిన కృష్ణవేణి ఒక్కక్షణం ఆగిపోయి, తలుపు తీయకుండా కిటికీలోనుండి చూసింది.

బయట గట్టుమీద గుంజకి ఆనుకుని రోడ్డు వైపు చూస్తూ నిలబడ్డ వేణు సన్నగా ఈలపాట పాడుతున్నాడు.

క్షణంసేపు మైమరచినట్లయిపోయింది కృష్ణవేణి. ఎంత అందంగా, ఎంత హాయిగా పాడుతున్నాడు? ఇన్నాళ్ళు తనకి తెలియని అతనిలోని విద్య అతనికి తెలియకుండా బయటపడింది.

ఎందుకో అనుమానంగా తల తిప్పి చూసిన వేణుకి కళ్ళు విప్పార్చుకుని కిటికీలోనుండి తనవైపే చూస్తున్న కృష్ణవేణి కన్పించింది.

ఈలపాట ఆగిపోయింది. పట్టుబడినట్లుగా గబుక్కున కళ్ళు వాల్చేసి నెమ్మదిగా తలుపు తెరిచింది.

''అయితే ఉండి కూడా తలుపు తీయలేదన్నమాట!''

చిన్నగా నవ్వి తల వంచుకుని తర్వాత అన్నది ''మీరు ఎంత బాగా పాడారు ఈలపాట!''

''ఏదో గాలిపాట లెండి!''

''కాదు! లాలిపాట! ఆనందభైరవి రాగం!''

క్షణంసేపు కళ్ళెత్తి కృష్ణవేణివైపు చూసిన వేణు మార్దవంగా అన్నాడు ''ఏమో! నాకే తెలియదు. ఏదో రాగం. కృష్ణవేణిగారూ! నాకు మొదటినుండీ సంగీతమన్నా ప్రత్యేకించి వేణువు అన్నా ప్రాణం. కాని దురదృష్టమేమిటంటే సంగీతమూ నేర్చుకోలేదు, వేణువూ కొనలేదు. అన్నీ బాగుండి, అందరి జీవితాల్లా నా జీవితమూ సక్రమంగా ఉండివుంటే ఈపాటికి హరిప్రసాద్ చౌరాసియాగారి దగ్గర శిష్యరికం చేస్తూ వుండేవాడిని. ప్చ్! ఏవిటోలెండి! దేనికయినా రాసిపెట్టి వుండాలి!''

కృష్ణవేణి జాలిగా చూసింది!

వేణు తల విదిలించి అన్నాడు ''చూశారా! మాటల్లోపడితే టైమ్ తెలియదు! అవతల వడవకి పంపించాలి. బుట్టలు ఇలా ఇవ్వండి! సైకిల్ కూడా పంక్చరయింది!'' హడావిడిగా బుట్టలు తీసుకుని వెళ్ళిపోయాడు.

జాజిపూల వాన ఒక్కసారిగా వెలసినట్లయింది. మల్లెపూల సౌరభం ఒక్కసారిగా ఆగిపోయినట్లయింది.

మర్నాడు ఉదయం పదిగంటలవేళ బయట సైకిల్ బెల్ మోగింది. లోపల కూరలు నర్దుతున్న కృష్ణవేణి మనసు ఒక్కసారిగా పరవళ్ళు తొక్కినట్లయింది. అప్రయత్నంగా బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి తన్నుకొచ్చింది. చేతిలోని కూరలు వదిలేసి ముందుగదిలోకి వచ్చింది.

వేణు ఈరోజు ప్రత్యేకంగా ఉన్నాడు. తలంటి పోసుకున్న జుట్టు చెదిరి నుదుటిమీ




దకు పడుతోంది. గుడికి వెళ్ళివచ్చినట్లున్నా డు. కనుబొమలమధ్యన కుంకుమ పెట్టి ఉన్నది.

కృష్ణవేణిని చూస్తూనే నిండుగా నవ్వాడు. అంతసేపూ భద్రంగా జేబులో ఉంచుకున్న తెల్లగులాబీని తీసి కృష్ణవేణికి ఇస్తూ అన్నాడు "ఈరోజు నా పుట్టినరోజు! ఆ ఆనందాన్ని పంచుకోడానికి ఇన్నాళ్ళూ నాకెవరూ లేరు! కానీ ఈ సంవత్సరం అలా అనిపించలేదు. అందుకే... ఇది... మీ... కాదు... నీకోసం...!" తల వంచుకుని చిన్నగా అంటున్న వేణుని చూస్తుంటే గొంతుకేదో అడ్డుపడ్డట్లయింది. కళ్ళ ల్లో అస్పష్టంగా కన్నీటిపొర కదలాడబోతుంటే గబుక్కున వెనుతిరిగి లోపలికి వెళ్ళిన కృష్ణవే ణి ప్లేటులో స్వీట్ పెట్టుకుని తీసుకువచ్చి "తినండి! బొప్పాయి హల్వా!" అంది.

వేణు తిని "చాలా బాగుంది మీ మనసులా గానే!" అన్నాడు.

కృష్ణవేణి నవ్వి అన్నది "మీ పుట్టినరోజు సందర్భంగా మీ నోరు తీపిచేశాను. మరి నా మనసు కూడా తీపిచేయాలి!"

"నేనా? ఏమిచ్చి చేయగలను! నేను చాలా పేదవాడిని!"

నవ్వింది "నాకిష్టమయిన పాట - ఈలపాట పాడి!"

"కృష్ణవేణీ...?!"

"అవును! మీరు ఎప్పుడూ పాడే 'కొండగాలి తిరిగింది... గుండె ఊసులాడింది..." పాట నాకోసం పాడరూ!

వేణు క్షణంసేపు కృష్ణవేణి కళ్ళల్లోకి సూ టిగా చూసి, తర్వాత నెమ్మదిగా కదిలి కిటికీ వైపు బయటికి చూస్తూ పాడసాగాడు.

నిజంగా గాలి కొండని చుట్టి గుండెల్ని కూడా కట్టిపడేసినట్లయింది. ఇటు తిరిగాడు! వెంటనే కృష్ణవేణి "ఒక్కక్షణం" అంటూ లోప లికి పరిగెత్తుకెళ్ళి గుప్పిటతో ఏదో తీసుకొచ్చి "వేణూ! చేయిపట్టండి!" అన్నది.

ఆ పిలుపుకి అతనిలో ఏదో నిశ్శబ్ద తరంగం ఎగసిపడింది.

"ఏమిటి?" అంటూ చేయి చాచాడు. కృష్ణ వేణి చేతిలోనుండి నలిగి మడతలు పెట్టినట్లు న్న పది రూపాయల నోట్లు వేణుచేతిలో పడ్డాయి.

"వేణూ! నీ పుట్టినరోజు సందర్భంగా ఇది నా కానుక! ఇది పూర్తిగా నా స్వార్జితం. నేను కష్టపడి, పూలుకట్టి సంపాదించిన డబ్బు. దీనితో నువ్వు ఏం కొనాలో తెలుసా! వేణువు! వెదురు వేణువు!"

"కృష్ణా!" అప్రతిభుడయినట్లుగా, నోట మాటరానట్లుగా అయిపోయాడు వేణు!

ఆ చిన్న సంఘటనే వారి జీవితంలో బలీ యమయిన ప్రభావం చూపించింది. మనసు లను దగ్గిర చేసి, ఒకరంటే ఒకరు ఇష్టపడేల చేసింది.

రోజులో కలిసే ఆ అయిదు నిముషాలే ఎన్నో కబుర్లతో దొర్లిపోయేవి! మర్నాడు ఉద యంవరకూ ఆ మధురోహలతోనే రాత్రిళ్ళు గడిచిపోయేవి.

రోజులు వేగంగా, ప్రవాహంలా గడిచిపోతు న్నాయి. ఈ సంగతి ఆచార్యులుగారికిగాని, గిరికిగాని ఏమాత్రం తెలియలేదు. అసలు అనుమానమే రాలేదు. దాదాపు నెలరోజుల తర్వాత జరిగిందా సంఘటన.

కృష్ణవేణి మామూలుగానే ఉదయమే గుడి కి వచ్చింది. రోజూ ఆ సమయానికి సిటీలో ఉండే వేణు ఆరోజున ఆలస్యంగా పని పడ టంతో అదే సమయానికి తను కూడా వచ్చాడు.

వేణు చేతిలో నందివర్ధనాల్లా విచ్చుకున్న దొంతర మల్లెల దండ ఉన్నది. అది వేణుగోపా లునికి సమర్పించి చేతులు కట్టుకుని నించు న్నాడు.

లోపల గర్భగుడిలో స్వామికి దండ అలంక రించి, హారతి యిస్తూ గంట మ్రోగిస్తున్న ఆచార్యులగారి చెవులకి లీలగా, అస్పష్టంగా విన్పించాయి ఆ మాటలు, జేగంటల శబ్దంమ ధ్యన.

వేణు అంటున్నాడు "ఆరోజు మనకి కూడా ఇలాంటి దండలే స్వయంగా నేనే తయారుచే స్తాను... నిలువెత్తు దండలు పాదాలని తా కేలా..."

నెత్తిమీద పిడుగు పడ్డట్లు వణికిపోయారు ఆచార్యులుగారు. చేతిలో వున్న హారతిపళ్ళెం



వణికింది. ఉలిక్కిపడిన ఆయన మనసు ఇంకా తేరుకోకముందే అర్థంకాని వారిలా, అయోమయంగా తలతిప్పి బయటకు చూశారు.

వేణు నవ్వుతూ ఏదో అంటున్నాడు. కృష్ణవేణి సిగ్గుపడుతూ, తను కూడా నవ్వుతోంది.

గర్భగుడిలోనుండి చూస్తుంటే ఇద్దరూ చాలా చేరువగా కన్పిస్తున్నారు. ఆచార్యులుగారు వెనక్కి తిరిగి చూడగానే వేణు చప్పున నవ్వడం ఆపి, నిశ్శబ్దం అయిపోయి దణ్ణంపెట్టుకుంటున్నట్లుగా చేతులు జోడించాడు. అది చూసి కృష్ణవేణి కూడా దణ్ణంపెట్టింది.

కృష్ణమాచార్యులుగారు కాసేపు ఏమీ మాట్లాడలేకపోయారు. అవే మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. వాళ్ళమధ్య వున్న చనువు, ఆ నవ్వుకోవడాలు, ఆ సాన్నిహిత్యం... ఏవో సందేహాలను రేపుతున్నాయి... అనుమానాలను ఎగదోస్తున్నాయి.

"మనకి" అనేటంత సాన్నిహిత్యమేర్పడిందా ఇద్దరిమధ్యనా? ఈ సంగతి గిరికి తెలుసా?

ఆయన మనసు పరిపరివిధాల పరుగులు పెడుతోంది. యాంత్రికంగా శఠగోపం తీసుకు వచ్చి, ఇద్దరి నెత్తినా పెట్టి, నిశ్శబ్దంగా అక్షింతలు వేశారు ఇద్దరి తలలమీదా!

ఇద్దరినీ అలా పక్కపక్కన నించోపెట్టి, అక్షింతలు జల్లుతుంటే చప్పున మరోభావం స్ఫురించింది ఆయనకు.

వేణు, కృష్ణవేణి ఆయన దగ్గర సెలవు తీసుకుని, కలిసి మెట్లు దిగి, వేణు రేవువైపుకి, కృష్ణవేణి ఇంటి దారివైపు వెళ్ళారు.

అటే చూస్తుండిపోయారు కృష్ణమాచార్యులుగారు.

ఏం జరుగుతోంది? ఎవరూ ఊహించని... చనువు ఎలా ఏర్పడింది? ఇంట్లో సాధారణంగా గిరి ఉండడు! ఆ ఏకాంతం వాళ్ళమధ్యన సాన్నిహిత్యాన్ని పెంచి ఇంతదూరం తీసుకువచ్చిందా?

ఆలోచనలు నొక్కిపెట్టి కనుబొమలు ముడిచి పక్కకు తిరగబోయిన ఆయనకు అప్పుడు కన్పించాయి... ఉత్తరాకాశంలో నల్లగా... కారుచీకటిలా... తరుముకువస్తున్న కారుమేఘాలు! ఆయన మనసు ఏదో కీడు శంకిస్తోంది. పెద్దగా ఉరుము ఉరిమిన శబ్దం విన్పించింది. చూస్తుండగానే సన్నగా జల్లు ప్రారంభమయి, పెద్ద వాన కురవసాగింది. భక్తులెవరూ రాలేదు. చూడబోతే వర్షం ఇప్పుడిప్పుడే తగ్గేలా లేదు. పదకొండింటికల్లా స్వామికి నైవేద్యం పెట్టి, గుడికి తాళంవేసి ఇంటికి బయలుదేరారు.



రెండురోజుల అనంతరం...

మధ్యాహ్నం ఒంటిగంట సమయం!!

కృష్ణమాచార్యులుగారు భోజనం చేసి, అప్పుడే మంచంమీద నడుము వాల్చారు. "బాబుగారూ! బాబుగారూ!" అంటూ బయట నుండి గిరి గొంతు విన్పిస్తోంది. మగతగా వస్తున్న నిద్రను ఆపుకుంటూ లేచి వచ్చారు కృష్ణమాచార్యులుగారు. వాకిట్లో గిరి, అతని వెనకే కృష్ణవేణి నించునివున్నారు.

గిరి ముఖంలో కొంచెం ఆదుర్దా కన్పిస్తోంది. గిరి రెండు చేతుల్లో, రెండు పూలబుట్టలు ఉన్నాయి. ఒకదాంట్లో కాగడా మల్లెలు, మరొక దాంట్లో మాచిపత్రి ఉంది.

అన్నాచెల్లెళ్ళిద్దరూ ఈ సమయంలో వచ్చారేమిటా! అని ఆండాళమ్మ కూడా వంటింటిలో నుండి పని మధ్యలో వదిలేసి చేతులు తుడుచుకుంటూ బయటకు వచ్చింది.

గిరి చెప్పాడు "బాబుగారూ! గోపాలం మామయ్యకి హార్ట్ ఎటాక్ వచ్చి హాస్పిటల్లో జేర్పించారట. ఇప్పుడే సిటీనుండి అత్తయ్య కబురు చేసింది. ఉన్నపళంగా రమ్మని. కృష్ణవేణి, నేను బయలుదేరి పోతున్నాము. అరగంటక్రితమే వేణు వచ్చి ఈ పూలబుట్టలు ఇచ్చి వెళ్ళాడు. ఈ ఆదుర్దాలో కృష్ణవేణి ఇంకా ఏమీ మొదలెట్టలేదు. ఇంక కట్టడానికి కూడా కుదరదు! మీరు ఎలాగైనా, వేణుకి కబురుచేసి ఈ బుట్టలు అతనికి అందజేస్తే, వేరే ఎవరితోనయినా మాల కట్టించుకుంటాడు. బహుశా మేము మళ్ళీ వెంటనే ఈరోజే తిరిగి రావడానికి కుదరదేమో!"

కృష్ణమాచార్యులుగారు అతని చేతిలోని బుట్టలు అందుకుని పక్కన గోడవారగా పెట్టి, "అరెరె! అయితే త్వరగా బయలుదేరండి! రుక్మిణిని కంగారుపడొద్దని చెప్పు! వీలుచూసుకొని నేనూ సాయంత్రమో, రేపు ఉదయమో వస్తాను! సరే! ఇవి వేణుకి అందజేస్తాను. త్వరగా బయలుదేరండిమరి!" హడావిడిపడుతూ అన్నారు.

గోపాలం మామయ్య అంటే... గిరికి బంధువు! పక్కనే సిటీలో కాలేజీలో లెక్చరర్‌గా చేస్తూవుంటాడు. ఆయన భార్య రుక్మిణి! గిరి సిటీకి వెళ్ళినప్పుడల్లా సాధ్యమయినంత ఎక్కువ సమయం వాళ్ళదగ్గరే గడుపుతాడు. వాళ్ళకి పిల్లలు లేకపోవడంతో గిరిని ఎంతో ఆప్యాయంగా, సొంత పిల్లవాడివలె చూసుకుంటారు. గిరికి కూడా వాళ్ళంటే అంతే ఇష్టం.

గిరి, కృష్ణవేణి వెళ్ళిపోగానే 'వేణుకి కబురు





చేయాలి!' అనుకుంటూ ఆచార్యులుగారు పూలబుట్టలు రెంటిని పక్కనే వున్న గదిలో మంచంపక్కనే ఉన్న టేబుల్‌మీద పెట్టి, బద్ధకంగా ఆవులిస్తూ మంచంమీద పడుకున్నారు. పక్కనే వున్న బుట్టలోని మాచిపత్రి... మంచి పరిమళాన్ని వెదజల్లుతోంది. పక్కకు వత్తిగిల్లి బుట్టలవైపు చూసిన ఆయన భృకుటి క్షణ కాలం ముడిపడింది.

కాగడా మల్లెలు ఉన్నది వైరుబుట్ట కావడంతో పక్కనుండి ఖాళీసందుల్లోనుండి మల్లెల అరిటాకువచ్చ కాడలు బయటకు పొడుచుకువచ్చాయి. ఆయన దృష్టిపడింది వాటిమీద కాదు. అరిటాకువచ్చ కాడలమధ్య... కన్పించీ కన్పించనట్లుగా... తెల్లటి మల్లెపూల రంగులో కలిసిపోయి... మల్లెపూలను పక్కకు వత్తినట్లుగా పెట్టివున్న కాగితపు కవరు!

అంతే! మంద్రంగా ఉన్న కృష్ణానదిలో ఒక్కసారిగా అలలు ఆకాశప్రమాణానికి ఎగిరినట్లయింది. మగత, బద్ధకం ఒక్కసారిగా ఎగిరిపోయినాయి. చప్పున మంచంమీదనుండి లేచి ఆ బుట్టలో చెయ్యిపెట్టారు.

మెత్తగా తగిలాయి మల్లెపూలు గుప్పెటకి. వాటిని నలగకుండా జాగ్రత్తగా, తొలగించుకుంటూ తీశారు కాగితపు కవరుని!

పూలమధ్యన పెట్టి ఉన్నది కాబట్టి ఆ కవరు... కృష్ణవేణిని ఉద్దేశించినదే అయి వుంటుంది. అయి ఉండడమేమిటి? ఖచ్చితంగా అంతే. ఏంచేయాలి? ఆ కవరు తెరిచి చదివితే? సంస్కారమనిపించుకుంటుందా? కాని... కాని...

రెండురోజులకిందట... తన కళ్ళబడ్డ ఆ దృశ్యం... వాళ్ళిద్దరిమధ్య చనువు... సంభాషణ...

వాటిని ప్రోత్సహించడం ఎంతవరకూ సమంజసం!

కృష్ణవేణి పసిపిల్ల వయసునుండీ తనకు తెలుసు! తనకు తెలిసినప్పటినుండి, ప్రత్యక్షంగాకాని, పరోక్షంగాగాని వాళ్ళ కుటుంబంతో ఎంతో దగ్గర సంబంధమున్నది. చూస్తూ... చూస్తూ... వాళ్ళ సాన్నిహిత్యాన్ని ఎలా ప్రోత్సహించగలడు?

ఆరోజు జరిగిన ఆ సంఘటన, తన అనుమానం కావాలనే... గిరికి చెప్పలేదు. తొందరపడి చెప్పదలచుకోలేదు. బహుశా తను అనవసరంగా వాళ్ళ చనువుని తప్పుగా అర్థంచేసుకొని, లేనిపోని అనుమానాలతో అపార్థాలు సృష్టించుకున్నాడేమో! ఏమో! రోజూ దాదాపు రెండుసార్లు ఇద్దరూ ముఖాముఖి మాట్లాడటం జరుగుతుంది! కాబట్టి వాళ్ళిద్దరిమధ్యన ఆ స్నేహం ఉండటం సహజమేనేమో!

స్నేహం...! ఏమో!

నిజంగా స్నేహమేనా?!

ఇద్దరూ యుక్తవయసులో ఉన్నారు.

కష్టం తప్ప సుఖం, శ్రమపడటం తప్ప విరామమెరుగని... కృష్ణవేణికి... తన జీవితంలో సందడి సందడిగా ప్రవేశించిన వేణుతో... వెంటనే అంతటి సాన్నిహిత్యం ఏర్పడటంలో తప్పులేదేమో!

చిన్నప్పటినుండి ఒంటరితనమే తోడుగా పెరిగిన వేణుకి... మేలిమిముత్యంలాంటి మనసున్న ఓ చక్కటి యువతితో పరిచయం అయితే... అంతకంటే రెట్టింపు వేగంతో అతని మనసు... చనువుతో కూడిన స్నేహంతో ఆమె వైపు ఆకర్షింపబడటంలో అసహజమేమీ లేదేమో!

ఇద్దరూ యువతీయువకులు!

కల్మషం ఈషణ్మాత్రం ఎరుగని నిష్కపటులు!

కాని... సమస్య అదికాదు!

ఉగ్గుపాలతో రంగరించి పోసిన సాంప్రదాయాన్ని జీర్ణించుకున్న... తన మనసు ఒప్పుకోని సమస్య...

అది...

వేణు కులం వేరు.

కృష్ణవేణి కులం వేరు. సాంప్రదాయం పాటించే కుటుంబంలోంచి వచ్చిన పిల్ల కృష్ణవేణి. తన నైష్ఠికం ఒప్పుకోని పొత్తు అది.

అదే కనుక జరిగితే... నిశ్శబ్దతరంగాలలా ఉన్న ఈ సమాజం... అంగీకరించి ఊర్కుంటుందా? ఉప్పెనలా ముంచెయ్యదూ?

కష్టపడి చెమటోడ్చి, మొక్క నాటినసుండి

జాగ్రత్తగా పెంచుకొచ్చి, అందమయిన వనంలా తీర్చిదిద్దిన కృష్ణవేణి జీవితం... ఏమవుతోంది?

ఏదయినా జరిగితే... గిరి భరించగలడా? అసలు తట్టుకుని జీవించగలడా?

గిరి దృష్టిలో ఇంకా కృష్ణవేణి అమాయకమయిన, రేకులు విప్పని పసిడిమొగ్గ. కాని అతనికి ఇంకా తెలియలేదు, కృష్ణవేణి మనను కొత్త కొత్త గంగులతో, రెక్కలు రెక్కలుగా విచ్చుకుంటోందని. హృదయవిహంగం, తొలిమబ్బుల్లో విహారం చేస్తోందని!

ఏది ఏమయినా...

ఇక్కడ ముఖ్యం... కృష్ణవేణి భవిష్యత్తు!

మొదటినుండీ కష్టసుఖాలను పంచుకుంటూ వస్తున్న తనకు ఆ అధికారం ఉన్నది. ఒకవిధంగా చెప్పాలంటే గిరి కూడా చిన్నవాడే! అనుభవం తక్కువ! తను ఒకవిధమయిన అధికారంతో పెద్దరికం తీసుకోక తప్పదు. కృష్ణవేణి భవిష్యత్ దృష్ట్యా! అందుకే...

చూడాలి! ఆ కవరు ఏమిటో చూడాలి!

కవరు చింపి, లోపలి కాగితాలు తీశారు. చిన్న ఉత్తరమేమీ కాదు. దాదాపు నాలుగయిదు తెల్లటి కాగితాలమీద... నల్లటి ఇంకుతో అందంగా రాసివున్న అక్షరాలతో ఉన్న ఉత్తరమది.

ఒక్కక్షణం కళ్ళు మూసుకుని మళ్ళీ తెరిచి ఆ ఉత్తరం వెలుగువైపు పట్టుకుని చదవసాగారు!

ఆయన కళ్ళు ఆత్రంగా ఆ ఉత్తరంలోని అక్షరాలవెంట పరిగెత్తసాగాయి!

అక్షరం, అక్షరంలోనూ వేణు మనను స్పష్టంగా ద్యోతకమవుతోంది. పదము, పదంలోనూ అతని ఆరాధనాభావం, స్నేహభావం వ్యక్తమవుతున్నాయి.

అణువణువు అందాల్ని నింపుకున్న ఆ అక్షరాల సారాంశం ఒక్కటే!

ప్రేమ!

ప్రేమ!

ప్రేమ!

"కృష్ణా!

ఈ రెండక్షరాల తీయనైన పిలుపు తాలూకు నువ్వు ఇచ్చిన చనువు, నేను తీసుకున్న అధికారం, నన్ను ఈ ఉత్తరం రాయమని పదేపదే ఉత్తేజపరిచి, ఉత్సాహం ఉరకలు వేయించిన మననుపొరల లోపల తరంగనాట్యమాడే లాస్యవిన్యాసాల పరిభ్రమణ పవన వీచికలు వెదజల్లే మల్లెలు స్నిగ్ధంగా... పలుకరించే ఉషోదయాన, తుషార బిందువొకటి నిశ్శబ్దంగా నా పెదవిని తడిపిన సమయాన... నిశ్చలంగా మూసుకున్న కనురెప్పల వెనుక రేగిన అలల సవ్వడి... హృదయకుహరంలో మ్రోగిన మువ్వలరవళుల వడివడి... మలయమారుతమై, మేను స్పృశించినవేళ... కృష్ణాతరంగాల హేల... హాయిగా పరవశింపచేసే వేళ... ఉషానాధుని సింధూర కిరణాల మిశ్రమం కృష్ణాజలంపై జలతరంగిణి మ్రోయిస్తుంటే... ఆకాశంలో పరుగులు పెట్టే పాలపిట్టలు... పసిడివర్ణంలో పరిభ్రమిస్తుంటే... నదిమధ్యలో... నావ నడుమ... నిశ్చలంగా... నీ నామమే జపిస్తూ... నీకోసమే తపిస్తూ... విన్నవించుకుంటున్న చిన్న కోరిక...!

కృష్ణా!

మగవాళ్ళను, అమ్మాయిలలోని అందంకంటే అమాయకత్వమే ఎక్కువగా కట్టిపడేస్తుందట! అదిగో ఆ అమాయకమయిన అల్లిప్పలలాంటి నీ కళ్ళే... ఆరోజు నన్ను గాలంవేసి లాగి పడేసి... నాచేత బలవంతాన నీ చేతిలో కదంబమాల పెట్టించాయి. నువ్వు నమ్ము, నమ్మకపో! ఆ క్షణాన నేనూ నమ్మలేదు! ముందర ముందర నా మనసింతటి ఉద్విగ్నతకు లోనవుతుందని!

పూలు కట్టే మిగతా అయిదుగురిలో నువ్వూ ఒకతివి అనుకున్నాను నీ పరిచయం కాకమునుపు! కాని నా జీవితంలో నందనవనానివే నువ్వని ఇప్పుడు తెలుసుకున్నాను.

ఏనాటి సుకృతమో, ఏజన్మ ఫలమో, తొలుత నిన్ను చూసిన ఆ శుభగడియ... నా జీవితంలో కల్యాణఘడియకు పూలబాట వేయబోతోందని అనుకున్నానా? మౌనంగా కళ్ళు మూసుకున్న మల్లెమొగ్గలు ఇంతపనిచేస్తాయని కలగన్నానా? మన పేర్లు వేణు, కృష్ణవేణి కాదు. కృష్ణ-వేణు కలిసి కృష్ణవేణు! ఎలా





ఉంది?

కృష్ణా!

నిండుపున్నమి, పండు వెన్నెల్లో, మెత్తగా పరచిన మల్లెపూల పడవలో... నీతో... కృష్ణానదిలో నౌకావిహారం చేయాలని...

సుధాకరుని అమృత ధారలలో జంటగా కలిసి జలకాలాడాలని!

నదిలో చేపపిల్లల్లా, ఆకాశంలో పాలపిట్టల్లా, నదిమీది జంటబాతుల్లా, స్వేచ్ఛగా, హాయిగా కృష్ణానదీ. సైకతతీరంలో చేతులు పట్టుకుని విహరించాలని... ఎన్ని? ఎన్ని కలలు... ఎన్నెన్ని ఊహలు వచ్చాయని!

ఆరోజు నువ్వు నా కోర్కెకు సరే అన్న రోజున! కృష్ణా నాకంటూ ఎవరూలేరు! నీకు తెలియంది కాదు! నా పూలవ్యాపారమే నా ఆస్థిపాస్తులు! నాకంటూ సన్నిహితులు, హితులు, దైవస్వరూపులయిన కృష్ణామాచార్యులుగారే! మొదటినుండీ ఆయనదగ్గరే ఉండటంతో బాబాయ్‌గారనే పిలుస్తాను.

బాబాయిగారు కొలిచే ఆ వేణుగోపాలునిదీ, నువ్విష్టపడే ఈ వేణుదీ ఇద్దరిదీ ఒకటే కులం. మన కృష్ణానది ఎంత స్వచ్ఛమయినదో, ఎంత పవిత్రమయినదో మన ప్రేమ అంతే స్వచ్ఛమయినది, అంతే పవిత్రమయినది! ఇంకా ఆస్థి అంతస్థులు, కులమతాలకు తావెక్కడిది?

నావైపునుండి ఎలాంటి సమస్యా రాదు. కాని నీవైపు! మీ అన్నయ్య ఒప్పుకుంటాడా? గిరితో నాకు పరిచయమున్నది! బాగానే స్నేహమున్నది. కాని... ఇంతవరకు మన సంగతి చెప్పలేదు. ఎందుకో ఆ సమయం రాలేదనిపిస్తోంది. అందుకే... ముందుగా ముఖ్యంగా నీ పూర్తి అంగీకారం, మనస్ఫూర్తిగా నువ్వు ఇష్టపడుతున్నట్లుగా నాకు నిర్ధారణ కావాలి. నమ్మకం లేక కాదు! చెప్పానుగా! ఏ శుభఘడియ మన మధ్య కదంబమాల అల్లిందో, ఆ క్షణంనుంచే నా జీవితంలో నవవసంతాలు వెల్లివిరిశాయి.

కలిసివచ్చిన ఏకాంతం, దొర్లిపోయిన మధురక్షణాలు... పంచుకున్న మాటలు, చేసుకున్న బాసలు... ఇవన్నీ ఒకరిమీద ఒకరికి సంపూర్ణమయిన నమ్మకాన్ని ఏర్పరిచాయి. మొక్కగా వున్న స్నేహలత మొగ్గ తొడిగి, పుష్పించి ప్రేమలతగా మార్చివేశాయి.

ఆరోజే... నది ఒడ్డున... ఏకాంత క్షణంలో మళ్ళీ అదేమాట దేవుని సన్నిధిలో వేణుగోపాలుని సాక్షిగా... అప్రయత్నంగా నా నోటినుండి వెలువడింది. మన పెళ్ళికి మల్లెపూదండలు స్వయంగా నేనే తయారుచేస్తానని! నువ్వు నవ్వుతూ 'సరే' అన్నావు. ఆ క్షణమే నా హృదయంలో కోటి వీణలు మ్రోగిన మధుర క్షణం!

కృష్ణా! చెప్పు 'సరే' అన్న ఆ మాట మనస్ఫూర్తిగా, హృదయంలోనుండి వచ్చిందేనని చెప్పు. నిర్భయంగా ఎవరు అడ్డు వచ్చినా ధైర్యంగా ఆ మాట నిజం చేస్తానని చెప్పు. నిజమా! అంత త్వరగా, అంత తేలికగా నీ అంగీకారం తెలిపావా? ఎన్నోసార్లు పెదవి వరకూ వచ్చిన మాటను మధ్యలోనే దిగమింగి, గుండెల్లో దాచుకుంటూ వస్తున్న నాకు నిజంగా అంతటి అదృష్టమా?

నవ్వుతూ అన్నా సరదాగా కాదుకదా! 'కృష్ణా' అని పిలిచినా, నవ్వుతూ తల ఊపి తెలిపిన నీ అంగీకారం, నీకోసమే, ప్రత్యేకంగా పెంచి ఇచ్చిన తెల్లగులాబీ నీ జడలో స్థానాన్ని ఆక్రమించిన ప్రతి నిముషం... మంచినీళ్ళు ఇచ్చేటప్పుడు తగిలిన నీ కరస్పర్శ, ఒకటికాదు, రెండుసార్లు కాదు, ఎన్నోసార్లు ఆ స్పర్శ మిగిల్చిన అనుభవం వేలార్చిన అనుభూతి... ఎన్ని మధురక్షణాలు, ఎన్ని మధురోహలు?

అన్నీ కలిపి కోటి గొంతుకలతో... 'నిజమే! నిజమే' అని వంతపలుకుతుంటే... నిజమే నా ప్రియా! అని మళ్ళీ ప్రశ్నిస్తున్నాను. అదే కృష్ణమ్మతల్లి సాక్షిగా, అదే వేణుగోపాలస్వామి సాక్షిగా... పెదవి విప్పు! అందుకే... నా ఈ మాట్లాడలేని మౌనభాషను మల్లెలమధ్యన పంపిస్తున్నాను.

నన్ను చేసుకోవడం నీకంగీకారం అయ్యే పక్షంలో మన పెళ్ళి నీకు ఇష్టమే అయిన పక్షంలో, వచ్చే శనివారం ఉదయం పదిగంటలకు కృష్ణానదీ తీరంలో, నీకోసం ఎదురుచూస్తూ ఉంటాను. నీ రాకయే నాకు సమాధానం!

అంతవరకూ... మన పరిచయం మిగిల్చిన స్మృతులు, మధురోహల లాహిరిలో... హాయిగా, అందమయిన భవిష్యత్‌ని ఊహించుకుంటూ,



తేలియాడుతూ ఉంటాను.

ఈ రెండు రోజులూ నిన్ను కలవను. ఎందుకంటే... నీకు పూర్తిగా సమయం ఇవ్వాలి! రెండు జీవితాల కలయిక తాలూకు నూరేళ్ళ పంట పెళ్ళంటే! ఆలోచించుకునే వ్యవధి ఇవ్వాలి. అంతవరకు... శనివారంవరకు కలవను. ఆరోజు నువ్వే కలువు.

తర్వాత... ఎలా ప్రొసీడ్ అవాలనేది నేను చెబుతాను. కాని ఆరోజు నువ్వు రాలేదనుకో! ఫరవాలేదు. నీ తిరస్కారాన్ని మౌనంగా భరించగలిగే మనసు నాకు నువ్వే ఇచ్చావని... ధైర్యంగానే కాలం వెళ్ళబుచ్చుతాను.

-నీ వేణు

వెంటనే కాగితాలని మడిచివేశారు కృష్ణమాచార్యులుగారు.

అంటే తన ఊహ చాలావరకు నిజం. స్నేహం ప్రేమగా మారింది. శనివారం అంటే ఇంకా రెండురోజులు. ఆయన కవరులో కాగితాలు జాగ్రత్తగా మడిచిపెట్టి, ఆ కవరు పరుపు కిందకు నెట్టేశారు. మంచంమీద వెనక్కి వాలి పడుకున్న ఆయన మనసు పరిపరివిధాల పోతోంది. ముందర గిరి సంగతి ఏమిటి? చెప్పాలా? వద్దా? చెబితే... అతని ప్రవర్తన ఎలా ఉంటుంది?

కానీ రెండురోజులు టైము ఉంది. అంతేకాదు, రేపటివరకూ గిరి, కృష్ణవేణి ఇద్దరూ ఊరి నుండి రారు. ముఖ్యమయిన విషయం, ఈ కవరు కృష్ణవేణి కంట పడలేదు. అంటే ఏ సంగతీ ఆ వేణు సూచనలూ ఆమెకు తెలియవు. కొంతవరకు నయం.

గిరికి తెలిస్తేమాత్రం మూడొంతులు ఒప్పుకోడు. చూడబోతే ఈ సంగతి కృష్ణవేణి ఎక్కడా అన్నయ్యదగ్గర ఎత్తినట్లు లేదు. ఎందుకంటే, గిరి ఎన్నడూ ఆ ప్రసక్తి తనదగ్గర తీసుకురాలేదంటే, అదే అయివుంటుంది. సాధారణంగా గిరి ఏదీ దాచడు తనదగ్గర. కాని... చాలా మంది యువకులతో పోల్చుకుంటే వేణు వెయ్యిరెట్లు మెరుగు. ఏ దురలవాట్లూ లేవు. కష్టపడి పైకొచ్చినవాడు. కృష్ణవేణి సంగతి తెలియదు. కాని అతని ఉత్తరాన్నిబట్టి చూస్తుంటే అతనే ఎక్కువగా ఆమెని ప్రేమవైపు ప్రోత్సహిస్తున్నట్లుగా ఉంది. కావాలని మాటలతో ఉత్సాహపరుస్తున్నట్లుగా ఉంది.

అంటే? కృష్ణవేణి పూర్తి అంగీకారం తెలువలేదేమో! బహుశా గిరి గురించి భయపడి ఆగిపోయి అయినా ఉండవచ్చు. లేదా నిజంగా ఇద్దరిమధ్యన ఉన్న చనువు ప్రేమ కంటే స్నేహమే ఎక్కువ అని ఆమె అభిప్రాయపడి ఉండవచ్చు.

పిట్టగోడమీద చెయ్యి ఆనించి దీర్ఘాలోచనలో మునిగిపోయి నదివైపు అలాగే చూస్తూ ఉండిపోయారాయన. నిజంగా కృష్ణవేణికి వేణుపై అంత ప్రేమ ఉండి, ఒకవేళ పెళ్ళి చేసుకోవాలనుకుంటే పుట్టిపెరిగిన ఈ సమాజం, కులాంతర వివాహాన్ని ప్రోత్సహిస్తుందా? చెల్లెలిపై ఎన్నో ఆలోచనలు పెట్టుకున్న గిరి అసలు ఈ పెళ్ళికి ఒప్పుకుంటాడా? సరే! గిరి పెళ్ళికి ఒప్పుకుని పెళ్ళి జరిగింది... తర్వాత, వాళ్ళకు పుట్టబోయే పిల్లల భవిష్యత్ గురించి ఏమిటి? వేణు మరోచోటికి, మరోచోటికి వెళ్ళేందుకు అతనిది ఉద్యోగంకాదు. తప్పనిసరిగా ఈ పల్లెటూళ్ళోనే ఉండి చేయాల్సిన స్వంత వ్యాపారం! మరి వాళ్ళకు పుట్టిన పిల్లలకు అంతగా చైతన్యవంతం కాని ఈ సమాజం సరియైన స్థానం కల్పిస్తుందా? ఆలోచించి బుర్ర వేడెక్కినట్లయింది.

ఎనిమిది అవగానే గుడి కట్టేసి ఇంటికి బయలుదేరారాయన. భోజనం చేసి, ఆరుబయట మంచం వేసుకుని ఆలోచిస్తున్నట్లుగా పడుకున్న భర్తని వింతగా చూస్తూ అడిగింది అండాళమ్మ.

"ఏమిటీ! పొద్దుటినుండి మాటలేదూ! పలుకూ లేదు. ఇంతకీ ఏమిటీ విశేషం? కృష్ణవేణి, గిరీ వచ్చి వెళ్ళిన దగ్గరనుండీ పరధ్యానం! చూస్తున్నానుగా! ఏం జరిగింది? కృష్ణవేణికి సంబంధాలు చూడమని గిరి చెప్పాడన్నారు! ఏమయినా చూశారా ఏమిటీ?"

ఒక్కసారిగా ఆయన ఆలోచనకు అడ్డుకట్ట పడ్డట్లయింది! సంబంధాలు చూడటం!

ఆ తర్వాత ఆయన ఎక్కువసేపు ఆలోచించలేదు. అప్పటికే ఒక స్థిరనిర్ణయానికి వచ్చేశారు. అన్ని కోణాలనుండీ ఆలోచించిన తర్వాత ఆ నిర్ణయమే బాగున్నట్లనిపించింది




ఆయనకు. తర్వాత హాయిగా నిద్రపోయారు.

మర్నాడు ఉదయమే సోమశేఖరశాస్త్రిగారికి కబురుచేసి, గుడి బాధ్యత అప్పగించి, తను పడవలో బయలుదేరారు. నదికి అవతల వున్న మరో పల్లెటూరికి అక్కడ ఉన్న తన తోడల్లుడు శ్రీనివాసాచార్యులుతో కలిసి మాట్లాడటానికి.

శ్రీనివాసాచార్యులుగారి దగ్గర దాదాపు మూడుగంటలసేపు ఉన్నారాయన. మళ్ళీ తిరుగు ముఖం పట్టి భోజనంవేళకు ఇంటికి వచ్చారు. ఇప్పుడు ఆయన ముఖం కాస్త తృప్తిగా ఉంది. ముఖంలో ఆలోచనలు తగ్గి, కాస్త ప్రశాంతంగా ఉంది.

ఆ సాయంత్రం గిరి, కృష్ణవేణి వచ్చారు. సరాసరి కృష్ణమాచార్యులగారింటికే వచ్చారు. వాళ్ళని చూస్తూనే అడిగారు అచార్యులుగారు - "ఏరా గిరీ ఎలా ఉంది గోపాలానికి! కులాసాయేనా?"

"ఆ! ఇప్పుడు కులాసానే బాబుగారూ! హాస్పిటల్‌లో నిన్న ఒక్కరోజు ఉంచారు. ఉదయమే ఇంటికి తీసుకొచ్చాము. మైల్డ్‌గా హార్ట్ ఎటాక్ వచ్చింది. మరీ అంతగా కంగారుపడాల్సింది ఏమీలేదని చెప్పారు డాక్టరు. అయినా మన ఆదుర్దా మనకి ఉంటుంది అనుకోండి!"

మాటలను అందుకున్న అండాళమ్మ విరక్తిగా నిట్టూర్చి అన్నది "నిజమే గిరీ! ఏమిటో ఈ రోజుల్లో ఎక్కడ చూసినా... ఇదే జబ్బులు... ఏమిటో! మనుమల్లో అసలు బలాలేవీ? ఆ రోజులే వేరు! ఆ తిండే వేరు"

కృష్ణవేణివైపు తిరిగి "రావే కృష్ణా రా! అక్కడే నిలబడిపోయావేం! దొడ్లోకి వచ్చి కాళ్లు కడుక్కో! గిరీ! నువ్వుకూడా కాళ్ళు కడుక్కొని రావయ్యా!" అంటూ లోపలికి నడిచింది. ఆమె వెనకే గిరీ, కృష్ణవేణీ పెరట్లోకి వెళ్ళి కాళ్ళు, చేతులు, ముఖం శుభ్రంగా కడుక్కున్నారు.

కృష్ణవేణి వంటింటి గుమ్మంలోనే కూర్చుంది అండాళమ్మతో ముచ్చట్లాడుతూ! అండాళమ్మ కబుర్లు చెబుతూ, విశేషాలు అడుగుతూనే కాఫీ పెట్టసాగింది. గిరి వాకిట్లో, కృష్ణమాచార్యులుగారికి ఎదురుగా కుర్చీలో కూర్చున్నారు. కృష్ణమాచార్యులుగారు కాస్త గంభీరంగా ఉన్నారు. ఆ వాతావరణం, ఆయన ముఖం చూస్తుంటే ఆయన ఏదో చెప్పబోతున్నారనిపిస్తోంది గిరికి! ఈలోపల అండాళమ్మ కృష్ణవేణి చేత ఇద్దరికీ కాఫీ పంపించింది. ఇద్దరికీ కాఫీ ఇచ్చి మళ్ళీ వెళ్ళి లోపల కూర్చుంది కృష్ణవేణి.

రెండు నిముషాలసేపు ఇద్దరూ కాఫీ తాగుతూ మౌనంగా ఉండిపోయారు. రెండు క్షణాల అనంతరం ఆచార్యులుగారు చిన్నగా దగ్గి సంభాషణ మొదలెట్టారు.

"గిరీ!"

"చెప్పండి బాబుగారూ!"

"నిన్న నేను మా తోడల్లుడు శ్రీనివాసులు దగ్గరకు వెళ్ళివచ్చాను!"

"అహా!"

"అదే! మన కృష్ణవేణి గురించి మాటవరుసగ చెప్పాను! ఈ మధ్యన నువ్వు చెప్పావు కదా! అమ్మాయికి సంబంధాల గురించి! మా శ్రీనివాసుడికి ఈ విషయంలో బాగా అనుభవమూ ఉన్నది! ఆ చుట్టు పక్కల ప్రాంతాల్లో చాలా మందితో పరిచయం ఉన్నది! అందుకే ప్రత్యేకంగా శ్రీనివాసులుని కలిశాను!"

గిరి ఆసక్తిగా ముందుకి వంగాడు "ఏమయినా చెప్పారా ఆయన!"

"ఆ! చెప్పాడు! మంచి సంబంధమే చెప్పాడు!"

గిరి కళ్ళల్లోకి ఉత్సాహం వచ్చింది. చెప్పండన్నట్లు చూసాడు.

"ఆ ఊరు పక్కనే అనుకుని ఉన్న చిన్ని లంకలో ఒక సంబంధం ఉన్నదట! అతను చెప్పిన వివరాలనుబట్టి నాకయితే బాగానే ఉన్నట్లనిపించింది! పిల్లవాడు సిటీలో ఎల్.ఐ.సి.లో పనిచేస్తున్నాడు! పేరు మాధవరావట! బాగానే ఉంటాడుట! రోజూ, ఊరి నుండి సిటీకి తిరుగుతూ ఉంటాడుట! ఉదయానే వెళ్ళి వాళ్ళ ఆఫీసు అవగానే సాయంత్రం ఇంటికి వస్తాడట! అతను, అతని తల్లి ఇద్దరే ఉండేది! ఇంకా అన్నదమ్ములు కాని, అక్కచెల్లెళ్ళు కాని లేరట! ఒక్కడే కొడుకు! రెండు సంవత్సరాల క్రితం తండ్రి

పోయాడట! ఉంటున్న ఆ యిల్లు తప్ప వేరే ఆస్థిపాస్థులులేవు! అయితే, ముఖ్యంగా మనం ఆలోచించాల్సింది, బాగా దగ్గర్లో తెలిసిన సంబంధం. వేరే బరువు బాధ్యతలు ఏమీ లేవు... మంచి ఉద్యోగం, అన్నింటికీ మించి మంచి సాంప్రదాయం ఆచారం ఉన్న కుటుంబమట! మా శ్రీనివాసులు ఆ విష యంగురించి మరీమరీ చెప్పాడు! ఏ సంగతీ నీకు చెప్పి చెబుతానన్నాను. నాకయితే అన్ని విధాలా బాగున్నట్లనిపించింది! నువ్వు కూడా బాగా ఆలోచించు, కృష్ణవేణిని కూడా కను క్కొని ఏ సంగతీ చెబుతే, మళ్ళీ శ్రీనివాసుడికి కబురు చేస్తాను! ఒకవేళ ఇష్టపడి బాగుంది అనుకుంటే వాళ్ళతో వెళ్ళి మాట్లాడ దాం.ఏమంటావు?''

గిరి రెండు నిముషాలు ఆలోచనల్లోపడి పోయి, మళ్ళీ తేరుకుని అన్నాడు, "మీరు చెప్పిన వివరాలనుబట్టి సంబంధం బాగానే ఉన్నట్లనిపిస్తోంది. చూద్దాం! ఎంక్వయిరీ చే యడంలో తప్పులేదుగా! నిన్న మా మామ య్యావాళ్ళతో కూడా చెప్పాను. వాళ్ళూ వాళ్ళకు తెలిసిన రెండు మూడు సంబంధాలు చెప్పా రు! ఒకటి- కుర్రవాడు బాంకులో ఉద్యోగమట! రెండవ సంబంధం కుర్రవాడికి స్వంతంగా, మంచి సెంటరులో ఉన్న మెడికల్ షాపు బిజినెస్సట! చూడాలి! ఈ హడావిడిలో- పె ద్దగా మాట్లాడలేదు! మళ్ళీ కలిసి చెబుతానన్నా ను!''

తాగిన కాఫీగ్లాసు పక్కన పెట్టి అన్నారు ఆచార్యులుగారు. "అయ్యో! తప్పకుండా! పె ళ్ళి అన్నాక తప్పకుండా పది పదిహేను చూడా ల్సిందే! మరి ఏ సంగతీ అమ్మాయితో కూడా కలిసి ఆలోచించి చెప్పు నాకు! మళ్ళీ ఏ విషయం వాళ్ళకి తేల్చి చెప్పకపోతే బాగుండ దు!''

నిజమేనన్నట్లుగా తలూపాడు గిరి!

ఆ కవరు సంగతి బయట పెట్టలేదు ఆచార్యులుగారు.

మరొక పది నిముషాలు ఉండి ఇద్దరూ ఇంటికి బయలుదేరారు. వస్తుంటే ఆండాళ మ్మ, కృష్ణవేణికి బొట్టుపెట్టి దొడ్లో పూసిన సన్న జాజి మొగ్గలు కాగితంలో పొట్లాం కట్టిఇచ్చా రు!

కృష్ణమాచార్యులుగారు ఊహించినట్లుగానే, ఆ రాత్రి గిరి ఇంటికి వచ్చి చెప్పాడు! మర్నా డు ఇద్దరూ కలిసి ఆ సంబంధం గురించి మాట్లాడి వద్దామని!

కృష్ణమాచార్యులుగారు తృప్తిగా తలూపి అలాగేనన్నారు.

శనివారం

ఆ రోజు రోజూకంటే పెందరాడే లేచారు కృష్ణమాచార్యులుగారు!

స్నానం చేసి బయలుదేరారు గుడికి!

మంచో, చెడో, తను తీసుకున్న నిర్ణయం తాలూకు ఫలితం గురించి వేణుగోపాలస్వామి మీదనే భారం వేశారాయన!

ఆయన, కుడిచేతిలో పూలసజ్జ పట్టుకుని బయలుదేరారు గుడికి!

పూలసజ్జలో ఎర్రటి మందారాలు, ఎర్రగన్నే రు, వెన్నముద్ద పూలు ఉన్నాయి నిండుగా!

...వాటి అడుగున ఉన్నది.

ఎర్రటి అగ్నిగుండంలాంటి తెల్లని కవరు!

సమయం తొమ్మిదిన్నర దాటింది!

దేవుని ఎదురుగ కూర్చుని వేణుగోపాలునికి పూజ చేస్తున్నారు కృష్ణమాచార్యులుగారూ!

నిశ్చలంగా, నిర్మలంగా...మనసులోకి ఎలాంటి ఆలోచనలు రానీయకుండా!

ఇపుడాయన చేతిలో ఆ తెల్లటి కవరు ఉన్నది!

... ఆ కవరుకి ఎదురుగా... మూడు వత్తులు వేసిఉన్న జ్యోతులతో ప్రకాశిస్తున్న దీపారాధన కుంది ఉన్నది!

ఒక్కక్షణం ఆచార్యులుగారు... తన చేతి లోని కవరువైపు, ఎదురుగా ఉన్న జ్యోతివైపు చూసారు! తర్వాత నెమ్మదిగా చూపు మరల్చి స్వామివైపు చూసి ఒక్కక్షణం కళ్ళు మూసుకు న్నారు.

నెమ్మదిగా ఆయన చెయ్యి గాలిలోకి లేచి ఆ కవరు జ్యోతికి దగ్గరగా వచ్చింది!

... ... ...

అదే సమయానికి... బయట ధ్వజస్థంభం




దగ్గర...

కొట్టుకునే గుండెలతో... పరుగులు పెట్టే మనసుతో...

గడిచిపోతున్న క్షణాలను లెక్కపెట్టు కుంటూ...

అంతదూరంనుండే స్వామికి దణ్ణం పెట్టు కున్నాడు వేణు.

గర్భగుడిలో ఒక్కసారిగా జ్వాజ్వల్యమా నంగా దేదీవ్య కాంతులతో... ప్రకాశవంతమ యిన జ్యోతిని చూడగానే... ఒక్కసారిగా వేణు హృదయం పరవళ్ళుతొక్కింది.

కాని...

దేదీప్యమానంగా వెల్గిన ఆ నీరాజనం... తన హృదయ నీరాజనాన్ని సమర్పించిన ప్రేమ సందేశమేననీ...

క్షణాల్లో...బూడిదగా మారి వేణుగోపాలుని పాదాలచెంత ఉన్న వెన్నముద్దలమీద నుసిను సిగా రాలి... తమ ప్రేమ గుర్తుమీద శాశ్వ తంగా మసిపూసేసిందనీ... అతనికి తెలియ దు.

... .... ...

ఆలోచనలు ఈగల్లా ముప్పిరిగొంటుంటే... క్రమంగా వర్తమానంలోకి వచ్చారు కృష్ణమాచా ర్యులుగారు!

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని అటూ ఇటూ వత్తిగిల్లారు ఆ పట్టెమంచంమీద! ఈరోజు అన్పించిన ఆ ఆలోచన... "మాధవరావు మూ ర్ఖత్వం కంటే... వేణు ప్రేమలోనే కృష్ణవేణి జీవితం హాయిగా వండిఉండేదేమో!" బల వంతంగా మళ్ళీ అదిమిపెట్టి చికాకుగా మంచంమీదనుండి లేచారు!

హఠాత్తుగా తలనొప్పి అన్పించసాగింది! కణతలు అదురుతున్నట్లనిపించింది! నెమ్మ దిగా లేచి ముందుగదిలోకి వచ్చేసరిగి, అపుడే బయటగేటు తీసుకుని గిరి వస్తున్నాడు లోపలి కి!

అతని ముఖంలో ఆతృత తొంగిచూస్తోంది.

వస్తూనే హడావిడిగా అడిగాడు "వెళ్ళి వచ్చారా బాబూగారూ! కృష్ణవేణిని దిగవిడిచి వచ్చారా? ఏమన్నారు వాళ్ళు? మళ్ళీ ఏద యినా గొడవ చేసారా!"

అపుడు కాఫీ త్రాగుతూ, అన్నీ విశేషాలు చెప్పారాయన!

గిరి ఏమీ మాట్లాడలేదు! రెండు నిముషా లు మౌనంగా, ఏదో ఆలోచిస్తున్నట్లుగా ఉండి పోయాడు.

తర్వాత లేచి వస్తానని చెప్పి వెళ్ళిపోయా డు!

వెళ్ళిపోతున్న గిరిని చూస్తూ ఉండిపోయిన ఆయనకు మళ్ళీ అన్పించింది.

ఆరోజు తను తొందరపడ్డాడా? తప్పుచే సాడా?

అందుకు ఫలితం.. ముగ్గురు అనుభవిస్తు న్నారా? వేణు- కృష్ణవేణి... గిరి!!

ఇంటివైపు నడుస్తున్నాడు గిరి! ఏవేవో ఆలో చనలు చుట్టుముడుతున్నాయి. సాయంత్రం బాబుగారు, కృష్ణవేణి గురించి చెబుతున్నప్పు డు... ఆయన మధ్యమధ్యలో ఎందుకంత ము భావంగా మారి పోతున్నారు.?

అక్కడేదయినా గొడవ జరుగుతోందా?

అర్ధరాత్రి, వానలో బయటకు పంపించేసిన వాళ్ళు ఏమయినా అని ఉండవచ్చు!

"గిరిబాబూ!" ఎవరో పిలుస్తున్నారు.

ఉలిక్కిపడ్డట్టుగా, తల విదిలించి వెనక్కి తిరిగి చూసాడు గిరి.

రంగడు!

"ఏమిటి రా రంగా!"

"ఏం లేదు బాబూ! ఏమిటా పరధ్యానంగా నడిచి వెళ్ళిపోతున్నారు అని పిలిచా!"

"అబ్బే! ఏంలేదు!" తడుముకుంటున్న ట్లుగా అన్నాడు గిరి!

చుట్టూ పరిసరాలని చూస్తూ అన్నాడు రంగ డు "గిరిబాబూ! ఇపుడెళ్ళి వంట వండుకో వాలా?"

అవునన్నట్లు తలూపాడు గిరి!

"ఇయ్యాల మాయింటికి రండి అన్నానికి! మా అలివేలు కూడా ఎప్పుడూ మీ గురించి అనుకుంటూ ఉంటుంది! మా యింట్లో అన్నం తిని చాలారోజులయింది! రండి!




ఆగిపోయాడు గిరి! తలెత్తి రంగడివైపు చూసాడు!

అపుడపుడు రంగడు వాళ్ళ ఇంట్లో భోజనం చేయడం తనకు అలవాటే! ముఖ్యంగా రంగడు భార్య అలివేలు ఆప్యాయత, ఆ పరిసరాలు ఎంతో యిష్టం! ఆ అనుభూతి కోసమే ఎక్కువగా తింటూ ఉండేవాడు! ఈ మధ్యన వాళ్ళ యింటికి వెళ్ళి చాలా రోజులయింది.

కృష్ణవేణి పెళ్ళి అయినాక రెండు మూడు సార్లు వెళ్ళాడు! అంతే!

"తప్పకుండా వస్తాను రంగా!" చెప్పాడు స్థిరంగా!

"అయితే! ఇంటికెళ్ళి స్నానంచేసి వెంటనే వచ్చేయండి!" పక్క సందులోకి తిరుగుతూ చెప్పాడు రంగడు.

తను పల్లెకార్ల ఇంట్లో భోజనం చేయడంగురించి ఒకసారి కృష్ణవేణి అత్తగారింట్లో పెద్ద దుమారమే చెలరేగిందిట! ఒకసారి మాటల మధ్యలో కృష్ణవేణి చెప్పింది!

తను వాళ్ళింట్లో తినేది చాలా తక్కువసార్లు! తనేమీ మాంసాహారం తినడు! అయినా... తనకు... రంగడు, అలివేలు అందించే ఆ ఆప్యాయత, ప్రేమముందు మరొకరు ఏం అనుకుంటే ఏం?

ఈ సంగతి చూచాయగా కృష్ణమాచార్యులు గారికి తెలిసినా ఆయన పెదవి విప్పి ఏమీ అనరు! అసలు గిరి సంస్కారం గురించి తెలుసుకాబట్టి ఆయన పెద్దగా పట్టించుకోరు కూడా!

ఏముంది! తను వాళ్ళింట్లో భోజనం చేయడంలో తప్పేముంది? ఎవరినీ హత్యచేయడంలేదే! దాదాపు అంత మాటలతోనూ విరుచుకుపడిందిట కృష్ణవేణి అత్తగారు. సాంప్రదాయంలేని కుటుంబం, అలగా కుటుంబం అని చాలా మాటలతో తిట్టిపోసి.

నవ్వొచ్చింది గిరికి! ఏమిటీ మూర్ఖత్వం! అన్యకులస్థుడి ఇంట్లో అన్నం తింటేనే మైలపడిపోతామనుకుంటే... అన్యకులస్థుడు పండించిన బియ్యాన్ని మాత్రం ఎందుకు వండుకుతినాలి? అసలు మానవ జాతికే సంబంధంలేని పశువు ఇచ్చిన పాలు ఎందుకు త్రాగాలి?

చాలామంది చదువుకున్నవాళ్ళు కూడా తార్కికంగా ఆలోచించడానికి ఇష్టపడరు. భయం! మడి పేరుతో మనస్సును కప్పేసుకుని తృప్తిగా ఓ మూల కూర్చుని వీపు ప్రపంచంవైపు తిప్పి భోజనం చేయడంలోనే ఆనందం వాళ్ళకి!

ప్రకృతి ఒడిలో హాయిగా... తృప్తిగా తినడంలో ఆనందం వాళ్ళకేం తెలుసు?

ఆలోచనల మధ్యన ఇంటికి చేరాడు గిరి! అయిదు నిముషాలు బద్ధకంగా పడుకున్నాడు. ఈ మూడు రోజులనుండి కృష్ణవేణి ఇంట్లో ఉండటంతో కాస్త సందడిగా ఉంది. మళ్ళీ ఒంటరితనం! అందుకే విసుగ్గా ఉంది.

బద్ధకంగానే లేచి స్నానం చేసి, తలుపు తాళంవేసి- బయలుదేరాడు రంగడు వాళ్ళింటికి.

నాలుగయిదు సందులు తిరిగి- కృష్ణానది వైపు తిరిగితే వస్తుంది వాళ్ళ యిల్లు. నదికి ఆనుకుని ఉంటుంది యిల్లు.

ముందు పెద్దగా ఆవరణ లేదు... కర్రలు పాతి ఇంటిచుట్టూ దడి కట్టిఉంది! తాటాకులు పైన ఎండుగడ్డివేసి నేసిన పూరిల్లు! పర్ణశాలలా ఉంది.

లోపలికి వస్తుంటే నవ్వుతూ ఎదురొచ్చింది అలివేలు!

"చాలా రోజులకి వచ్చావు గిరి బాబూ బాగున్నావా? చెల్లాయి బాగుందా! రా! రా! నీ కోసమే మావ చూస్తున్నాడు!"

రంగడు, అలివేలు ఇద్దరినీ పక్కపక్కన నించోపెడితే అచ్చు ఎంకీ నాయుడుబావల్లా ఉంటారు!

అలివేలు వెనకే గిరి పెరట్లోకి నడిచాడు!

విశాలమయిన పెరడు! పెద్ద తోటలా ఉంది! ఎన్నో రకాల చెట్లు విస్తరించి ఉన్నాయి. వెనకే... గట్టుని ఒరుసుకుని ప్రవహిస్తున్న కృష్ణానది!

పెరట్లో చివరగా పెద్ద వేపచెట్టు విస్తరించి, కొన్ని కొమ్మలు నదిమీదికి వంగి నీడలు సృష్టిస్తున్నాయి, నదిలో!

వేపచెట్టు ముందు నాపరాళ్ళతో పెద్ద

గట్టులా కట్టారు! గిరికి అక్కడే... నది వైపు చూస్తూ, దూరంగా కనిపించే పడవలను పరికిస్తూ... మధ్యమధ్యలో విన్పించే వాళ్ళ పాటలను ఆలకిస్తూ, ఆ ప్రకృతి మధ్యలో... ఆ గట్టుమీదనే కూర్చుని అన్నం తినడం ఎంతోయిష్టం.

ఆ సంగతి అలివేలుకి తెలుసు! అందుకే గట్టు శుభ్రంగా చిమ్మి ఉంచింది! గిరిని చూడగానే, దొడ్లో నులకమంచం వేసుకుని పడుకున్న రంగడు లేచి కాళ్లుకడుక్కొచ్చాడు!

మునక్కాయ పప్పు, ఉస్తికాయల కూర, అరటి దూట పెరుగు పచ్చడి, నెల్లి ఆకుల మజ్జిగ పులుసు, కమ్మటి నెయ్యి, గడ్డ పెరుగు!

వద్దకుంటూనే ఎక్కువ తినేసాడు గిరి!

అలివేలు కొంచెం నిష్టూరంగా "అయితే! ఎన్నాళ్లీ వంటరితనం? చెల్లెలిదోవన చెల్లెలు పోయె! ఎపుడు పెడతావయ్యా మాకు పప్పన్నం?"

నవ్వాడు గిరి! సమాధానం చెప్పలేదు.

"అదిగో! ఎపుడడిగినా అలాగే మాట్లాడవు! ఊ! అను! నేను వెళ్ళి రేపే ఆచార్యులుగారితో మాట్లాడివస్తాను!"

వీళ్ళ సంభాషణను నవ్వుతూ వింటున్నాడు రంగడు!

"ఇదిగో గిరి! నువ్వు చెల్లెలి దగ్గరికి ఎపుడు వెళతావు! వెళ్లేటపుడు చెప్పు! మంచి గుమ్మడి కాయలు పంపించాలి! అమ్మాయి గారికి మంచి గుమ్మడికాయ పులుసంటే చాలా యిష్టం!"

"అలాగే! తప్పకుండా!" అన్నాడు గిరి, రంగడి పక్కనే మంచంమీద కూర్చుంటూ!

అరిటాకులు ఎత్తేసి, పంపుదగ్గర చేతులు కడుక్కుని వచ్చి వాళ్ళకి దూరంగా కూర్చుంది అలివేలు.

"గిరిబాబూ! అమ్మాయిగారు బాగున్నారా! మొన్న వచ్చి వెళ్ళారటగా! నాకు కలవడానికి కుదరనేలేదు!

ఏవిటోలే! అయితే గిరిబాబూ! రేపు వచ్చే సంక్రాంతికి అమ్మయిగారిని తీసుకొస్తావా? తీసుకురాలే! ఒక్కతే చెల్లెలు! ఏమిటో! ఎన్నిసార్లో అనుకున్నాను కృష్ణవేణిని గురించి. నన్న జాజులూ, మరువం కలిపిమాల ఎంత చక్కగా కడుతుందని! ఎప్పుడూ అమ్మాయిగారిచేతనే కట్టించుకునేదాన్ని! ఇప్పుడేం చేస్తోందో అమ్మాయిగారు!"

"నిజమే! ఏం చేస్తోందో! కృష్ణవేణి!" అనుకున్నాడు గిరి.

★ ★ ★

గదిలో మంచంమీద పడుకున్న కృష్ణవేణి విపరీతమయిన జ్వరంతో అటూ ఇటూ పొర్లసాగింది! విపరీతమయిన తలనొప్పి! భరించలేని ఒళ్లునొప్పులు!

పక్కనే విసుగ్గా ముఖంపెట్టుకుని పడుకున్న మాధవరావు చలితో వణుకుతున్న భార్య నుదుటిమీద చెయ్యివేసి- షాక్ కొట్టిన వాడిలా వెనక్కి తీసుకున్నాడు!

నుదురు పెనంలా కాలిపోతోంది.

ఎందుకో మాధవరావుకి భయంవేసింది! గబగబా లేచి వెళ్ళి హాల్లో మంచంమీద వెల్లికిలా పడుకుని, గురకలు పెడుతున్న తల్లిని లేపి విషయం చెప్పాడు!

సణుగుతూ, గొణుగుతూనే లేచింది.

వెంటనే వెళ్ళి అవధానిగారిని పిలుచుకువచ్చాడు!

అవధానిగారు వచ్చి చెయ్యి పట్టుకుని కాసేపు పరీక్షచేసి తర్వాత కృష్ణవేణిని అడిగి తన సందేహాలు తీర్చుకుని చెప్పారు!

"సూరమ్మగారూ! శుభవార్త! మీ కోడలు తల్లికాబోతోంది! జ్వరమంటారా? చన్నీళ్ళ స్నానాలు చేసి చేసి బడలిక. అదే సర్దుకుంటుంది"

మొట్టమొదటిసారిగా సూరమ్మ ముఖం వికసించింది! మాధవరావు ఛాతీ ఇంతెత్తున పొంగింది.

★ ★ ★

ఆ విషయం తోటలో దగ్గరుండి పాదులుచేయిస్తూ పర్యవేక్షణ చేస్తున్న గిరికి మర్నాడు మధ్యాహ్నం పదకొండు ఆ ప్రాంతాల్లో తెలిసింది!

ఒక్కసారిగా గిరిధర్‌ని ఆనందాశ్చర్యాలు ముప్పిరిగొన్నాయి! కళ్ళు మిలమిలలాడుతుండగా 'నిజమా' అన్నాడు! ఇక అక్కడ




ఉండబుద్ధికాలేదు! చేతిలో పని కన్నయ్యకు అప్పచెప్పి సరాసరి ఆచార్యులుగారింటికి వెళ్ళాడు.

హడావిడిగా పరిగెత్తుతున్నట్లుగా వచ్చి క్షణంసేపు అలుపు తీర్చుకుంటూ గుంజనానుకుని నిల్చున్న గిరిని దంపతులిద్దరూ ఆశ్చర్యంగా, వింతగా చూసారు. నెమ్మదిగా చెప్పాడా శుభవార్త!

ఆ వార్త వినగానే ఇద్దరి ముఖాలు వికసించాయి.

కృష్ణమాచార్యులుగారు ఆనందంగా భార్య వైపు తిరిగి కేకేసినట్లుగా చెప్పారు. "ఇదిగో... ముందర ఇంత చక్కెర తీసుకొచ్చి అబ్బాయి నోట్లో పొయ్యి! ఇంత శుభవార్త తీసుకొచ్చాడు. అయితే... తాతని అవుతున్నానన్న మాట త్వరలో!"

నవ్వుతూ ఆయన మాటలని అందుకొన్నది ఆండాళమ్మ! "మొన్ననే దాని మొహం చూసినప్పుడే నాకనుమానం వచ్చింది! అప్పుడు అడిగితే చెప్పలేదు! అయితే నా అనుమానం నిజమేనన్నమాట!" గిరివైపు తిరిగి "ఇదుగో-మాడోనెలనే అమ్మాయిని తీసుకువచ్చి పసుపు కుంకం ఇవ్వాలి! ముందు! ఆ పనంతా నేను చూసుకుంటాను. ముందర వెళ్ళి కృష్ణవేణికి ఏవైనా స్వీట్లు అవీ యిచ్చిరా!" అన్నది.

గిరికి కూడా ఎప్పుడెప్పుడు చెల్లెలిని చూద్దామా అని ఉంది. కృష్ణమాచార్యులగారితో చెప్పాడు "అయితే, నేను ఒకసారి సాయంత్రం వెళ్ళివస్తాను!"

ఆయన "ఉండుండు!" అంటూ లోపలికి వెళ్ళి పంచాంగం తీసుకొచ్చి, రెండునిముషాల సేపు వేళ్లపై ఏవో లెక్కలు వేసి "మూడు తర్వాత వెళ్లు! అమ్మాయిని అడిగానని చెప్పు!" అంటూ పూర్తిచేసారు.

అలాగేనని తలూపి, ఆయన దగ్గిర సెలవు తీసుకుని బయటకు వచ్చాడు. ముందర, ఈ సంతోషాన్ని మరొకరితో పంచుకోవాలని అతని మనసు తహతహలాడుతోంది.

సంధ్య!

సంధ్య ఉంటోంది వాళ్ళ బాబాయివాళ్ళింట్లో! వాళ్ళ యిల్లు ఊరికి కొంచెం దూరంగా విసిరేసినట్లుగా ఉంటుంది.

సంధ్యతో బయటే పరిచయం తప్ప, వాళ్లింటికి వెళ్లేటంత చనువులేదు. కబురు చేస్తే బాగుండదు!

కాసేపు ఆలోచించి ఇంటివైపే బయలుదేరాడు.

మనసంతా హాయిగా, ఏవో లోకాల్లో తేలిపోతున్నట్లుగా ఉంది!

నిన్న మొన్నటివరకూ... తన ఒడిలో తల పెట్టుకుని నిద్రపోయే.. చిన్నపిల్ల... అపుడే... తల్లి కాబోతోందంటే, ఆ ఆలోచనే... థ్రిల్లింగ్‌గా ఉంది.

ఇప్పుడు ఏం చేస్తూ ఉండి ఉంటుంది కృష్ణవేణి.

తనలాగే మధురోహలలో తేలిపోతూ భవిష్యత్ని ఊహించుకుంటూ ఉండి ఉంటుంది!

చూస్తుండగనే ఎన్ని రోజులు గడిచిపోయాయి?మూడు ఎపుడవుతుందా? అని గడియారంపైపు చూస్తూ కూర్చున్నాడు! మూడు కొట్టగానే ఆలోచనలు కట్టిపెట్టి ఛెంగున లేచి. అయిదు నిముషాలలో రెడీ అయి రేవుకి చేరుకున్నాడు.

పడవ ఎక్కబోతూ తల తిప్పి చూసిన గిరికి దూరంగా పరుగులాంటి నడకతో వస్తున్న రంగడు కన్పించాడు.

గబగబా వచ్చిన రంగడు అరిటాకు పొట్లాం గిరి చేతిలో పెట్టి చెప్పాడు! "అమ్మాయిగారికి ఇవ్వమని అలివేలు ఇచ్చింది! సన్నజాజిపూలు!"

నవ్వుకున్నాడు గిరి! అపుడే ఈ విషయం అందరికీ తెలిసిపోయింది.

పడవ బయలుదేరింది.

ఈరోజు ప్రకృతి కూడా ఆహ్లాదకరంగా ఉంది అతని మనసులాగానే! తొందరపెట్టే మనసుకు పడవ అసలు కదలడం లేదేమో అన్పిస్తోంది! ఎన్నో గంటలు ప్రయాణం చేసినట్లనిపిస్తోంది!

రేవులో దిగీ దిగగానే, ఆ ఇసక నేలలో పరుగులాంటి నడకతో నడవసాగాడు! ఇసుకలో పాదాలు కూరుకుపోతుండటం వలన చెప్పులలో ఇసుక చేరి నడక త్వరగా సాగ

డంలేదు.

దాదాపు పది నిముషాల నడక తర్వాత ఆ యింటి ముందరకి వచ్చి ఒక్కక్షణం బరువుగా ఊపిరి పీల్చి వదిలాడు! ఎన్ని రోజులయింది ఆ యింటికి వచ్చి?

నెమ్మదిగా అడుగుపెట్టాడు లోపల!

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది! ఎక్కడా మనుష్యుల అలికిడి ఉన్నట్లు లేదు!

"కృష్ణవేణీ!" పిలిచాడు!

వెంటనే... పక్కగదిలో అలికిడి అయింది!

మరుక్షణం... గుమ్మంలో ప్రత్యక్షమయింది కృష్ణవేణి! గుమ్మాన్ని ఆసరాగా చేసుకుని నిల్చుంది. మనిషి బాగా నీరసంగా ఉండటంతో అక్కడే గుమ్మానికి ఆనుకుని ఉండిపోయింది.

"అన్నయ్యా!" ఆనందంగా పిలిచింది! మరుక్షణం... కళ్ళవెంబడి నీళ్ళు జలజలా రాలాయి!

చప్పున కదిలి చెల్లెలివైపు నడిచి- కృష్ణవేణి చేతిని తన చేతిలోకి తీసుకుని గుండెలకు హత్తుకున్నాడు.

ఆ అనుభూతి అలాగే శాశ్వతంగా ఉండిపోవాలన్నట్లుగా తృప్తిగా కళ్ళు మూసుకుని ఉండిపోయింది కృష్ణవేణి!

చెల్లెలి చేతిని తాకగానే గిరి మనస్సు ఉలిక్కిపడింది.

నీరసంగా, బరువుగా ఊపిరి పీలుస్తున్నట్లుగా ఉన్న కృష్ణవేణివైపు అనుమానంగా చూసాడు. అవునన్నట్లుగా తలూపి చెప్పింది. "జ్వరం ఫరవాలేదు- చాలా వరకు తగ్గింది!"

జాలిగా చూసాడు గిరి! నిండుగా, బంతిపువ్వులా ఉండే కృష్ణవేణి ఎంతగా చిక్కిపోయింది? కళ్ళక్రింద నల్లటి చారలు తేలాయి. భుజంమీద ఎముకలు కనబడుతున్నాయి. జాకెట్టు లూజుగా ఉంది.

"కృష్ణా! ఎలా ఉన్నావు!" హఠాత్తుగా గొంతు గద్గదమయింది. ఒక్కక్షణం ఏమీ మాట్లాడలేకపోయింది కృష్ణవేణి! అంతలో సర్దుకున్నట్లుగా తలెత్తి... చిన్నగా అడిగింది "కబురు అందిందా!"

"ఆ!" అన్నాడు నెమ్మదిగా తేరుకుని!

అపుడే గుర్తించినట్లుగా, హడావిడిగా అంది కృష్ణవేణి "అరెరే! నించునే ఉన్నావు! కూర్చో అన్నయ్యా! మంచినీళ్ళు కావాలా!"

"అది సరే! మీవాళ్ళు ఎవరూ లేరా?" అటూ ఇటూ కలియచూస్తూ అడిగాడు.

"ఆయన ఆఫీసునుండి వచ్చే టైమ్ అయింది! అత్తగారు ఇప్పుడే గుడికి వెళ్ళారు. ఏదో పురాణ కాలక్షేపం ఉంటేనూ!

"ఒంట్లో బాగుండని నిన్ను ఒంటరిగా వదిలేసా?"

విరక్తిగా నవ్వి, వంటింట్లోకి నడిచింది మంచినీళ్ళకోసం!

అపుడే అడుగు పెట్టింది. సూరమ్మ హాలు లోపలికి!

ఆవిడ కట్టుకున్న తెల్లటి వంచె... నుదుట దట్టంగా పట్టించిన వీబూధి రేఖలూ... పోటీపడుతున్నాయి ధవళచ్ఛాయలో! చేతిలో కొబ్బరి చిప్ప ఉన్నది.

హాలులో కుర్చీలో కూర్చున్న గిరిని చూడగానే... మొహం చిట్లించింది అప్రయత్నంగా.

అంతలోనే సర్దుకుని "నువ్వా!" అంది.

మళ్ళీ అడిగింది తనే "ఎపుడొచ్చావు?"

"ఇపుడే" ముక్తసరిగా జవాబిచ్చాడు!

"అహా!" అని గదిలో తొంగిచూసింది మెడ వెనక్కి వంచి! కోడలు అక్కడలేదని తెలుసుకుని... బుడబుడా నడుచుకుంటూ వంటింట్లోకి వెళ్ళబోతుంటే, మంచినీళ్ల గ్లాసుతో ఎదురయింది కృష్ణవేణి.

"అదేమిటి! పాపం అంతదూరం నుండి నిన్ను చూద్దామని బయలుదేరి వస్తే మంచినీళ్ళేనా! కాఫీ ఇవ్వు!"

బలవంతంగా నవ్వు తెచ్చుకుని సమాధానం చెప్పింది కృష్ణవేణి "ఇపుడే వచ్చింది! అందుకే వెంటనే మంచి నీళ్ళు ఇస్తున్నాను!"

సూరమ్మ ఏమీ మాట్లాడలేదు! కొబ్బరిచిప్ప గిన్నెలో ఎత్తివడేసి, ఇంట్లోకి నడిచింది వినురుగా!

అకారణంగా అంత కోపం ఎందుకు వచ్చిందో అర్థంకాలేదు కృష్ణవేణికి.





అయిదు నిముషాలలో కాఫీ కూడా కలిపి ఇచ్చింది కృష్ణవేణి.

నెమ్మదిగా త్రాగుతూ కూర్చున్నాడు గిరి! నూరమ్మ ప్రవర్తనకి ఒళ్ళు మండిపోతున్నా, కృష్ణవేణి ముఖం చూసి... మౌనంగా ఉండిపోయాడు.

మరో పదినిముషాలకి మాధవరావు కూడా వచ్చాడు. వస్తూనే గిరిని చూసి... కొంచెం... ముఖం అప్రసన్నంగాపెట్టి "ఎంత సేపయింది వచ్చి!" అంటూ అడిగాడు! కబురు చేయగానే వెంటనే ఇలా ఊడిపడతాడని అనుకోలేదు.

"ఇపుడే పది నిముషాలయింది వచ్చి!"

వెంటనే మాధవరావు చిరాకుగా "హుష్" అనుకుంటూ, చొక్కా విప్పి, హేంగర్‌కి తగిలించి, కృష్ణవేణిని పిలుస్తూ అడిగాడు "ఒ సేవ్ మంచినీళ్ళు తీసుకురా!"

ఆ పిలుపే చిరాకనిపించింది గిరికి!

నూరమ్మ కళ్ళజోడు సవరించుకుంటూ వచ్చి మండిగంమీద కూర్చుని అడిగింది

"ఊ! అయితే! అమ్మాయికి పసుపుకుంకం ఎపుడు ఇవ్వాలనుకుంటున్నావేమిటి?

"మూడో నెలలో ఇద్దామనుకుంటున్నాం. రెండుమూడు వారాల్లో కృష్ణవేణిని మా ఊరు తీసుకువెళతాను!"

పక్కనే ఉన్న మాధవరావు చిరాకుగా మొహంపెట్టి, ఉయ్యాలబల్ల ఊపిస్తూ కూర్చున్నాడు. నూరమ్మే అడిగింది! "మూడోనెలలోనే పసుపు కుంకుం ఇస్తారా! ఎవరున్నారు మీ తరపున!"

బలవంతంగా వస్తున్న కోపాన్ని దిగమ్రింగి చెప్పాడు గిరి "ఎందుకు లేరు! మా అత్తయ్యా వాళ్ళు ఉన్నారు!"

"ఆహా!" అంటూ పెదవులు అదోలా శబ్దం అయ్యేలా చప్పరించింది నూరమ్మ, జారిపోతున్న ముసుగు పైకి లాక్కుంటూ!

కాసేపు కూర్చుని వస్తానంటూ లేచాడు గిరి!

తల్లి, కొడుకులిద్దరూ పోటీలుపడి ఆపారు అతన్ని "అదేవిటి? ఇపుడెళ్ళడవేమిటి! భోజనం చేసి వెళ్ళు!"

ఇంత మర్యాదలేమిటో అర్థంకాలేదు గిరికి! కృష్ణవేణివైపు తలతిప్పి చూసాడు. కృష్ణవేణి కూడా ఆశ్చర్యంగా చూస్తోంది వాళ్ళ ఈ ప్రవర్తన వెనకనున్న అసలు కథ ఏవిటా అని అర్థంచేసుకునేటందుకు ప్రయత్నం చేస్తూ!

అలాగేనని ఒప్పుకుంటున్నట్లుగా, అంగీకార సూచకంగా తల ఊపాడు గిరి! మాధవరావు కాసేపు హాలులో కూర్చుని వెంటనే లేచి... హడావిడిగా గదిలోకి వెళ్ళి పేపరు చదువుకుంటూ పడుకుని ఉండిపోయాడు.

గిరికి మనస్సు చివుక్కుమన్నట్లయ్యింది. లేచి బయటకు నడిచాడు. అప్రయత్నంగా అతని కాళ్ళు రేవువైపు దారితీసాయి.

నీరు దగ్గరవుతున్నకొద్దీ మంచి గాలి వస్తోంది చలిగాలి కూడా మిళితమయి ఉండటంతో. రెండు చేతులు కట్టుకుని నడవసాగాడు.

నెమ్మదిగా చీకట్లు అలుముకుంటున్నాయి.

నది ఒడ్డు అంతా నిర్మానుష్యంగా నిశ్శబ్దంగా ఉంది. నది అవతల దూరంగా మిణుకుమిణుకుమంటూ దీపాలు వెలుగుతూ కన్పిస్తున్నాయి. చల్లటిగాలి కొంచెం విసురుగా చెంపల్ని తాకుతోంది.

అప్రయత్నంగా చేతులు కట్టుకున్నాడు.

మెత్తటి ఇసుకలో ఒక్కొక్క అడుగే వేస్తున్నాడు. చెమ్మగిల్లిన ఇసుకలో అడుగులు బరువుగా పడుతున్నాయి.

చెయ్యి ఎత్తి వెలుగువైపు తిప్పి వాచి చూసాడు.

ఆరు అవ్వస్తోంది.

వర్షాకాలం అవడంతో త్వరగా చీకటిపడుతోంది. దానికి తోడు అప్పుడే మబ్బుపట్టి వాన గాలి వీస్తోంది.

ఇంటిదగ్గర కూర్చోవాలంటే కృష్ణవేణి అత్తగారు, బావగార్ల సమక్షంలో ఫ్రీగా ఉండలేదు. ఎందుకో అసలు ఆ వాతావరణమే చిరాకుగా ఇబ్బందిగా, ఉంటుంది. ఒప్పుకున్నందుకు బలవంతంగానైనా ఎలాగో భోజనం చేసానని అనిపిస్తే మళ్ళీ తొమ్మిది దాటితే పడవలు కట్టరు... పైగా వర్షం వచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. కృష్ణవేణిని చూడటానికి వచ్చాడు! నిజానికి ఈ రాత్రి ఇక్కడ ఉండాలని లేదు!

కాని కృష్ణవేణి బాధపడుతుంది. తప్పదు! కాని, ఈ బరువయిన నాలుగు గంటల కాలం ఎలా గడపాలి?

నెమ్మదిగా నడుస్తున్న గిరి, అప్రయత్నంగా నదికి ఇవతలగా చదునుగా ఉన్న రాతి బండ మీద కూర్చున్నాడు. చల్లగా, తేమగా ఉంది.

అలా కూర్చుని, కుడివైపుకి తల తిప్పి చూస్తే, దూరంగా తమ ఊరు శివారు కన్పిస్తోంది. మసక చీకటిలో వేణుగోపాలస్వామి ఆలయశిఖరం అస్పష్టంగా కన్పిస్తోంది. ఊరు అపుడే నిద్రపోయినట్లుగా చీకటిలో అక్కడక్కడా... దీపాలు మిణుకుమిణుకుమంటున్నాయి.

ఇంకాస్త పరిశీలనగా... చూస్తే కన్పిస్తుంది. ఆ చిరు దీపాల మధ్యన కొంచెం కాంతివంతంగా వెలుగుతూ ఉన్న ట్యూబ్‌లైట్లతో ఎత్తుగా ఉన్న పాతకాలంనాటి మేడ!

ఆ మేడ సంధ్యవాళ్ళ బాబాయిది!

సంధ్య గుర్తుకురాగానే ఇంతసేపూ వేధించిన ఒంటరితనం విసుగు, ఒక్కసారిగా కృష్ణానదిలోకి పారిపోయాయి.

ఎంతో రిలీఫ్‌గా ఫీలయ్యాడు.

★ ★ ★

చీకటి పడేవరకూ రేవు ఒడ్డునే గడిపి ఇంటికి బయలుదేరాడు.

ఇంట్లో అడుగు పెడుతూనే క్షణంసేపు ఉబ్బితబ్బిబ్బు అయినట్లుగా ఫీలయ్యాడు.

గిరి ఇటు లోపలికి అడుగు పెడుతూ ఉండగానే, అటునుండి ఓ అమ్మాయి పరిగెత్తుకొచ్చింది. పట్టులంగా, పల్చటి ఓణీ, ముఖానికి పౌడరు, ఘుమాయిస్తున్న సెంటు పరిమళం, జడనిండా పూలు, కళ్లనిండా కాటుక ఘల్లుఘల్లు మంటూ గజ్జెల గుర్రంలా అటూ ఇటూ తిరుగుతున్న ఆ అమ్మాయి గిరిని చూస్తూనే సిగ్గుతో ముఖం కందిపోయి మెలికలు తిరిగిపోయి సుతారంగా చేతుల్లో ముఖం దాచుకుని వంటింట్లోకి పరిగెత్తింది.

వంటింట్లోనుండి నవ్వుకుంటూ హాల్లోకి వచ్చిన సూరమ్మ చెప్పింది "మన వాళ్ల మ్మాయే నబ్బాయ్ గిరీ! కాస్త తోడుగా ఉంటుందని కబురు చేసాను! పేరు కనకదుర్గ!"

గిరికి వెంటనే అర్థం అయింది! ఇంత క్రితం తల్లీకొడుకులు పోటీలుపడి తనని ఎందుకు ఆపారో తను అటు వెళ్లగానే ఆ అమ్మాయిని కబురు చేసి పిలిపించింది సూరమ్మ.

గిరి మాట్లాడలేదు. ముఖం చిట్లించుకున్నాడు.

సూరమ్మ అన్నది "అబ్బాయ్! వంట అయింది! లే స్నానానికి వెళ్లిరా!" లోపల నుండి కృష్ణవేణి టవల్ తీసుకొచ్చి గిరికి ఇచ్చి "పద అన్నయ్యా నీళ్లు పెడతాను!" అంటుంటే వెనకనుండి సూరమ్మ అంది "ఆ! ఆ! నువ్వేందు కమ్మడూ మన దుర్గ ఉన్నదిగా!" అని "ఒసే దుర్గా! కనకదుర్గా!" అని పిలిచింది. లోపలనుండి సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ వచ్చిన కనకదుర్గకి ఆ పని పురమాయించింది సూరమ్మ.

ఈ తతంగమంతా చూస్తున్న గిరిగి ఒళ్లు భగభగ మండిపోతోంది. దిగ్గున లేచి అన్నాడు, "ఎవరూ వద్దు! నేను పెట్టుకోగలను" అంటూ చరచరా వెళ్లిపోతున్న అతన్ని తెల్లబోయి చూస్తుండిపోయారు కనకదుర్గ, సూరమ్మ! కృష్ణవేణి మనసులోనే నవ్వుకుంది. సూరమ్మ ప్లాన్ అది. దగ్గరి బంధువుల అమ్మాయి కనకదుర్గని గిరికి కట్టపెట్టాలని ఎప్పటినుండో ఆమె ఆలోచన.

స్నానం చేసి వచ్చి కృష్ణవేణి ఇచ్చిన తెల్లటి లుంగీ కట్టుకొని చొక్కా వేసుకుని గుండీలు పెట్టుకుంటున్న గిరిని విస్తుపోతూ చూస్తూ సూరమ్మ అరిచింది.

"అదేమిటి అబ్బాయ్! భోజనాలు చేసేటప్పుడు చొక్కా వేసుకుని తింటారా? అవ్వ! తప్పుకాదూ!"

పక్కనే బొడ్డుకిందకి కట్టిన లుంగీ పైన ఏ ఆచ్ఛాదనంలేని ఛాతీమీద జంధ్యంతో గోక్కుంటూ మాధవరావు నవ్వుతూ అన్నాడు, "మన వాళ్లల్లో తప్పు పుట్టాడులే!"

గిరికి ఒళ్లు భగ్గున మండింది! వేడిరక్తం బుగ్గల్లోకి తన్నుకు వచ్చింది. ఇంట్లో ఎపుడూ




బనియన్‌తో దానిపైన టవల్ కప్పుకుని నిండుగా ఉండటం అలవాటు! చొక్కా విప్పి తినడం అనేది తనకెపుడూ అలవాటు లేదు. అది కూడా సంప్రదాయంతో ముడిపెట్టడం చూస్తుంటే నవ్వాలో ఏడ్వాలో అర్థం కావడంలేదు.

చొక్కా విప్పడమా, లేదా అనేది తన స్వంత నిర్ణయం! తన ఇష్టం! దాని విషయంలో కూడా విమర్శిస్తూ ఉంటే భరించలేకపోయాడు. పళ్ల బిగువున భరించి చివ్వున వెను తిరిగి ఏదో అనబోయిన గిరి గుమ్మం దగ్గరే చేతిలో గిన్నెతో నిలబడి ఇటే చూస్తున్న కృష్ణవేణిని చూసి ఆగిపోయాడు. ఆమె కళ్లు సూటిగా గిరినే చూస్తున్నాయి. ఆమె కళ్లల్లో ఒక విధమయిన అభ్యర్థన లాంటి భావం తొంగి చూస్తోంది. ఆ భావం వెంటనే అర్థం అయింది గిరికి!

తను ఉన్నది పిల్లనిచ్చిన వారింట్లో! వాదనలకు దిగడం మూర్ఖత్వం. అంతేకాదు తను మొండిగా ప్రవర్తిస్తే తర్వాత మాటల తూటాలకు బలి అయ్యేది అమాయకురాలైన కృష్ణవేణి! తను ఈ రాత్రికే వెళ్లిపోతాడు. కాని కృష్ణవేణి జీవితాంతం ఈ మనుషుల మధ్యనే జీవించాలి. తప్పదు! కృష్ణవేణి కళ్లల్లోకి చూసిన గిరి మాట్లాడలేకపోయాడు.

మౌనంగా తలవంచుకుని చొక్కా విప్పాడు.

అలా తొలగిస్తూ ఉంటే అన్పించింది... తను నమ్మిన భావాలు, ఆలోచనలు, శరీరం నుండి వేరు చేస్తున్నట్లు.

మాధవరావు యుద్ధంలో గెలుపొందిన వీరుడిలా మొహం పెడితే సూరమ్మ తృప్తిగా తలాడించి వడ్డనకి ఉపక్రమించింది.

మాధవరావు, గిరి ఇద్దరికీ పక్కపక్కనే పీటలు వేసి భోజనాలు పెట్టారు. భోజనం మధ్యలో తన వెనకే విన్పించిన గజ్జెల శబ్దానికి క్షణంసేపు ముడుచుకుపోయినట్లుగా అయ్యాడు గిరి.

నగ్నంగా ఉన్న తన వీపు భాగాన్ని వెనక నుండి రెండు కళ్లు పరిశీలనగా చూస్తున్నాయనే భావన రాగానే శరీరం మీద తేళ్లు, జెర్రులు పాకినట్లయింది. ఎపుడెపుడు ఆ ఇంటినుండి బయటపడతానా అన్పించింది.

గబగబా అయిదు నిముషాలలో భోజనం ముగించి లేచి గభాల్న చొక్కా వేసుకుంటే కానీ భగభగ లాడుతున్న శరీరం చల్లబడలేదు.

మరీ లేటయితే పడవలుండవని వెంటనే బయలుదేరాడు. వెళ్లేటపుడు కృష్ణవేణికి ఆరోగ్యం గురించి మరీమరీ హెచ్చరిస్తూ వెళ్లాడు.

అతనితోపాటు గుమ్మం వరకూ కృష్ణవేణితో పాటు కనకదుర్గ కూడా వచ్చింది.

నవ్వుతూ కృష్ణవేణి చెయ్యి ఊపుతుంటే ఆ పక్కన కనకదుర్గ... అతను మలుపు తిరిగేటంత వరకూ అలాగే నిల్చున్నారు.

* * *

మర్నాడు సాయంత్రం సమయంలో మొక్కలకు పాయలు చేయిస్తూ దగ్గరుండి నీళ్లుపోయిస్తున్న గిరి 'హలోవ్!' అన్న పిలుపుకి నవ్వుతూ తిరిగి చూశాడు.

"కంగ్రాట్స్! మామయ్య కాబోతున్నందుకు!" నవ్వుతూ ముందుకి నడిచి వస్తూ అన్నది సంధ్య.

"రా సంధ్యా! చాలా రోజులకి వచ్చావు!" ఆహ్వానించాడు గిరి.

"గిరీ! ఈ రోజు చాలా ఆనందంగా ఉన్నట్లున్నావు"

"అవును నా చెల్లి గురించిన ఆలోచనలతోనే గడిచిపోతోంది!"

"అయితే ఒకసారి మాటల సందర్భంలో నువ్వు చేసిన వాగ్దానం ఈ రోజు నెరవేర్చాలి!"

"వాగ్దానమా!" ఆశ్చర్యపోయి గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ అన్నాడు!

"ఈరోజు పౌర్ణమి!" చిన్నగా అన్నది.

"ఓహ్! అదా ఇందులో అంత వాగ్దానాలకి ఏముంది సంధ్యా! నిండుపున్నమి, పండు వెన్నెల్లో నౌకా విహారం గొప్ప అద్భుతమయిన అనుభూతి అన్నాను! అదా"

"అవును ఈ రోజే వెళుతున్నాము!" చెప్పింది సంధ్య.

అలాగేనన్నట్లు తలూపి నవ్వాడు గిరి. గిరి కొట్టించి ఇచ్చిన కొబ్బరి బొండాం నీళ్లు తాగి కాసేపు కూర్చుని వెళ్లింది సంధ్య.

సంధ్య సంస్కారం, నిజాయితీ తెలుసుకొబ





ట్టి ఏ సమయంలో బయట ఎలా తిరిగి వచ్చినా వాళ్ల బాబాయివాళ్లు అభ్యంతరం పెట్టరు. సంధ్య మీద పూర్తి నమ్మకమున్నది వాళ్లకి.

రాత్రి తొమ్మిది గంటల సమయం.

రంగడిని అడిగి తీసుకున్న పడవలో కూర్చుని ఉన్నాడు గిరి! తల తిప్పి చూస్తూ తెడ్డుని చేతులోకి తీసుకోబోతున్న గిరి కళ్లు మెరిశాయి.

గబగబా నడిచి వస్తోంది సంధ్య.

దగ్గరగా వచ్చి నవ్వి "గిరీ" అన్నది మధురంగా! పాల నురగలాంటి తెల్లటి చీరకు ఆకుపచ్చ బోర్డర్, తెల్లజాకెట్టు, లూజుగా అల్లుకున్న వాలుజడలో నిండుగా పెట్టుకున్న సన్నజాజి పూల దండ... ఎంతో సహజంగా, నిర్మలంగా, అందంగా ఉంది సంధ్య.

గిరి చేయి అందిస్తే చేయిపట్టుకుని పడవలోకి ఎక్కింది.

పడవ నెమ్మదిగా నీళ్లని తోస్తూ నదిలోకి ప్రవేశించింది! నెమ్మదిగా ఒడ్డుకు దూరమవుతూ నది మధ్యలోకి వెళుతోంది.

పడవ నది మధ్యకి వచ్చేటంత వరకూ ఎవరూ మాట్లాడలేదు.

అద్భుతమూ, అపురూపము అయిన ఆ అందాల్ని ఆ హాయిని తనివితీరా మనసారా ఆస్వాదిస్తూ ఉండిపోయింది సంధ్య.

వెన్నెల్లో కృష్ణవేణి ఇంత అందంగా ఉంటుందని తెలియదు. నది మధ్యలో నుండి చూస్తేకాని అద్భుతమయిన ఆ అనుభూతి అనుభవంలోకి రాదు.

కాసేపటికి కదిలి నెమ్మదిగా అన్నది,

"గిరీ!"

"ఊ!"

"నీకేమీ గుర్తుకు రావడంలేదా?"

లేదన్నట్లుగా తలూపాడు.

"నాకు గుర్తుకు వస్తోంది! మాయాబజార్!"

నవ్వి తెడ్డు పక్కకి తిప్పి పడవను ఎడమవైపు మళ్లించాడు.

"గిరీ! ఇంత అద్భుతమయిన అనుభవాన్ని నాకందించిన నీకు ఏమిచ్చి నీ ఋణం తీర్చుకోగలను?"

"తీర్చవద్దు! జీవితాంతం ఋణపడిపో!" నవ్వాడు!

సంధ్య సిగ్గుగా నవ్వింది. అంతలో గుర్తుకొచ్చినట్లు చేతిలో హేండ్‌బాగ్‌లోనుండి చిన్న బాక్సు తీసి గిరివైపు చూపిస్తూ "తీసుకో గిరీ" అంది.

"ఏమిటిది?"

"స్వీట్ గిరీ! వినేవాళ్లకి సిల్లీగా అన్పిస్తుంది. కానీ సాయంత్రం ఆ ఆలోచన వచ్చి ఇది తయారు చేస్తుంటే నాకెంత థ్రిల్లింగ్‌గా ఎంత ఆనందంగా ఉందో తెలుసా! వీధి మలుపు తిరిగితే కన్పించే స్వీట్ షాప్‌లో డబ్బులిచ్చి క్షణంలో తెచ్చిన స్వీట్ కాదిది! నువ్వు ఎప్పుడూ అంటుంటావే! అపురూపమయిన దెపుడూ మధురంగా ఉంటుందని! అదే స్వయంగా బాదంకాయలుకోసి ఓపికగా కొట్టి బాదం పప్పులతో చేసిన స్వీట్ ఇది! అన్ని కాయలు కొడుతుంటే చేతులు నొప్పి పుట్టలేదు సరికదా! ఇష్టమయిన వారికి అందించే కానుక ఎంతో రుచిగా ఉండాలని మరింత శ్రద్ధగా పప్పు తునిగిపోకుండా కొట్టి చేశాను"

"సంధ్యా! దీనిని ఈ అనుభూతిని ఏమంటారు?" గొంతుకేదో అడ్డుపట్టట్లయిన గిరి అడిగితే సంధ్య సిగ్గుగా నవ్వి తల దించుకుంది.

గిరి సర్దుకుని అన్నాడు "సంధ్యా! ఇష్టమూ ప్రేమా అనేది కేవలం చేతులకు అందించి ఊర్కొంటేనే లేదు"

"మరి" అనబోయిన సంధ్య బుగ్గలు ఎరుపెక్కాయి.

అతని భావం అర్థమయింది. కొట్టుకునే గుండెలతో, కంపిస్తున్న చేతులతో నెమ్మదిగా స్వీట్‌ని చేతిలోకి తీసుకుని గిరి పెదవులకి అందించింది.

అతని పెదవుల తాలూకు తడి చేతికి తగలగానే షాక్ కొట్టినట్లు శరీరం ఝల్లుమన్నది.

"సంధ్యా! ఇంత క్రితం అన్నావే ఋణం ఎప్పుడు తీర్చుకుంటావని నిజానికి ఈ క్షణంలో నేను నీకు ఋణపడ్డాను. ఇంత

అందమయిన ప్రకృతి మధ్యన ఇంత అపురూపమయిన మధురమయిన స్వీట్‌ని అందించి నా నోటిని, జీవితాన్ని తీపి చేసినందుకు''

సంధ్య మాట్లాడలేదు! మౌనంగా తల వంచుకుంది.

దాదాపు అరగంట తర్వాత పడవ నెమ్మదిగా రేవువైపు ప్రయాణం సాగించింది.

ఇంటికి వెళ్లిన సంధ్యకి ఆ మధురోహలలోనే తేలియాడుతున్నట్లనిపించింది. ఆ రాత్రి కలత నిదురే అయింది.



కృష్ణవేణికి నాలుగు నిండి అయిదో నెల వచ్చింది. సూరమ్మ ఇపుడు కొంతవరకూ వంట పని చూసుకొంటోంది. మాధవరావు కూడా అంతగా సాధించడం లేదు. దీపావళి వెళ్లి నాలుగు రోజులయింది. ఆ రోజు మాధవరావు ఆఫీసుకి వెళ్లాడు.

పదిగంటల సమయంలో బయటిగేటు కిర్రుమంటూ శబ్దం చేస్తూ తెరుచుకుంది. ఎవరా! అని తొంగి చూసిన సూరమ్మ ముఖం చింకి చేటంతయింది.

ఆమె తమ్ముడు దీక్షితులు.

గాలిలో తేలివస్తున్న అస్థిపంజరంలా నడుస్తూ వచ్చాడు.

అతని రాక ఎందుకో అపశకునంలా తోచింది కృష్ణవేణికి.

దీక్షితులు వస్తూనే సూరమ్మని పలకరించాడు ''బావున్నావా? ఏమిటీ ఇలా చిక్కి శల్యమయిపోయావు?''

సూరమ్మ దిగులుగా ముఖం పెట్టింది.

''భగినీ హస్త భోజనానికి వచ్చానే సూరమ్మక్కా!'' విషయం తేల్చాడు.

''మా నాయినే! ఇంకా నేను గుర్తున్నానట్రా!'' సంబరపడిపోయింది సూరమ్మ.

ఇద్దరూ బావి గట్టుమీద చేరి చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. కాఫీ కలుపుకు వెళ్లిన కృష్ణవేణి కళ్లల్లోకి చూస్తూ హిస్‌మంటూ నవ్వాడు. క్షణంసేపు వెన్ను జలదరించింది కృష్ణవేణికి. గగుర్పాటు అణచుకొని గబగబా లోపలికి వెళ్లిపోయింది. వెనకే సూరమ్మ ఏవో చెబుతూ శాపనార్థాలు పెడుతోంది.

సూరమ్మ మడికట్టుకుని రకరకాల వంటకాలతో తమ్ముడికి వంట చేసిపెట్టింది. భోజనం చేసిన దీక్షితులు తను అక్కగారి కోసం తెచ్చిన గ్లాస్కోపంచె చేతిలో పెట్టి నమస్కరిస్తుంటే సూరమ్మ ఆనందానికి పట్టపగ్గాల్లేకపోయింది.

మధ్యాహ్నం హాల్లో ఉయ్యాలబల్ల మీద కూర్చుని జోరుగా ఊగుతున్న దీక్షితులుతో అన్నది సూరమ్మ...

''ఏమిటోరా! ఆ మడీ ఆచారమూ అన్నీ పోతున్నాయంటే నమ్ము! సర్వం భ్రష్టుపట్టిపోతోందిరా! నా బాధ ఎవరితో చెప్పుకోను? ఒకప్పుడు మన కుటుంబంలో ఎంత మడి ఉండేదీ! ఒరేయ్ దీక్షితులూ ఎలాగూ వచ్చావు కాస్త ఆ చేత్తోనే పుణ్యాహవచనం చేసిపోరా!''

దీక్షితులు చిద్విలాసంగా నవ్వి అన్నాడు ''పుణ్యాహవచనమేం ఖర్మ. రేపు ఎలాగూ కార్తీక సోమవారం! ఏకంగా అభిషేకమే చేస్తాను అక్కా!''

ఆ మాటకే ఒళ్లు పులకరించిపోయింది సూరమ్మకి.

మర్నాడు అభిషేకానికి కావల్సిన సరుకులు ఆ సాయంత్రం దీక్షితులే వెళ్లి తెచ్చుకున్నాడు.

సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి వచ్చిన మేనల్లుడిని చూసి పలకరించాడు.

''ఏరా మాధవూ! అలా పుల్లలా అయిపోయావేమిటీ!''

వెనకనుండి చెప్పింది సూరమ్మ సింపుల్‌గా ''దిగులు''





నిజానికి మాధవరావుకి బాగా పొట్ట తన్నుకు వచ్చింది. దిగులుగా నవ్వాడు.

"అదిసరే! మొన్న దీపావళికి బావమరిది కొత్త డ్రస్ పెట్టాడా?"

సూరమ్మ పెద్దగా దీర్ఘం తీసి అన్నది! "సరే! అసలు పిలిస్తేగా పెట్టడానికి"

"హయ్యో! హదేమిటి? ఒక్కగానొక్క చెల్లెలు?"

"దీక్షితులూ! మనం అనుకుంటాం. ఊళ్లో వాళ్లు అనుకుంటారు. ఆ మహానుభావుడికి తట్టద్దూ? చెప్పేవాళ్లు ఉండొద్దూ! పోనీ అతనికి తెలియదే అనుకో, మన బొంద ఇలా పిలవమని ఉత్తరం రాయొచ్చునా! ఏమిటోలే! ఒకరిని అనుకొని ఏమి లాభం?"

తనను కేంద్రం చేసుకుని సాధించడం మొదలెట్టగానే కృష్ణవేణి మౌనంగా గదిలోకి వెళ్లిపోయింది.

మాధవరావు కూడా ముఖం ఎర్రగా కందగడ్డ చేసుకుని పెరట్లోకి వెళ్లాడు.

వెనకాలే దీక్షితులు హిస్స్ మని నవ్వడం కృష్ణవేణికి స్పష్టంగా వినిపించింది.

మర్నాడు... ఉదయం అక్కాతమ్ముళ్ల స్నానాల తీరు అమోఘం!

బాత్‌రూమ్‌కి వెళ్లివస్తే స్నానం రోడ్డుమీదకి వెళ్లొస్తే స్నానం. తడిబట్టతోనే ఇల్లంతా కలియ తిరిగాడు దీక్షితులు.

గంటసేపు పూజలో ఉండిపోయాడు. మడి నీళ్లు జల్లుకుంటూ ఇంటి ఆవరణంతా కదం తొక్కాడు. ఎవరైనా ఎదురొస్తే ఉరిమిరుమి చూసి పక్కకు తప్పుకు వెళ్లాడు. ఇదంతా చూస్తున్న సూరమ్మ శరీరం పులకరించిపోయింది. సంబరపడిపోతూ అన్నది, "ఆహాహ! మళ్లీ ఆరోజులు గుర్తుకు తెస్తున్నావురా దీక్షితులూ!"

దీక్షితులు పెరట్లోకి వెళ్లి స్నానం చేసి ఇటురాగానే వెనకే వెళ్లి సూరమ్మ కూడా స్నానం చేసి వచ్చేది! ఆనందంతో సూరమ్మ ముఖం మతాబులా వెలిగిపోతోంది.

పుణ్యాహవచనం జలం తీసుకుని మూల మూలలా జల్లాడు. గోడగోడమీద చిలకరించాడు. అపుడుకాని సూరమ్మ తృప్తిగా నిట్టూర్చలేదు.

ఆరోజు కార్తీక సోమవారం అభిషేకం కాబట్టి సూరమ్మ, దీక్షితులు, మాధవరావు ఉపవాసాలు. ఎందుకో కృష్ణవేణిని వదిలేసారు. అదీ గర్భవతి కాబట్టి. మాధవరావు సెలవు పెట్టి ఉండిపోయాడు.

కృష్ణవేణి తన వరకూ వేరుగా వండుకుని హాల్లోకి వచ్చి ఓ మూలగా కూర్చుంది.

హాలులో మధ్యలో పళ్లెం పెట్టి అందులో సాలిగ్రామం పెట్టి దీక్షితులు అభిషేకం మొదలెట్టాడు. మాధవరావు కూడా పట్టుబట్ట కట్టుకుని కూర్చున్నాడు. వారికి కాస్త దూరంలో మాటిమాటికి చెమరుస్తున్న కళ్లతో సూరమ్మ చేతులు జోడించి భక్తిగా కళ్లు మూసుకుని కూర్చుంది.

కానీ... కొంచెం దూరంగా గోడకానుకుని కూర్చున్న కృష్ణవేణి దృష్టి అభిషేకం మీదలేదు. ఎందుకో నడుము విపరీతంగా సలుపుతోంది. అంతసేపు కింద నేలమీద కూర్చోవాలంటే చాలా ఇబ్బందిగా ఉంది. నడుము మీద చెయ్యి పెట్టుకుని వత్తుకుంటూ పళ్లబిగువున కూర్చుంది. నడుము దగ్గర పోట్లు వస్తున్నట్లనిపిస్తోంది. దీనికి తోడు విపరీతమయిన ఆకలి చెప్పలేనంత నీరసం కమ్ముకొస్తోంది. ఉదయమెపుడో తాగిన పాలు! వెళ్లి భోజనం చేసి రావాలనిపిస్తోంది. విపరీతమయిన వికారం, కళ్లు తిరుగుతున్నట్లనిపిస్తోంది.

కాని... అభిషేకం మధ్యలో తను భోజనం చేసివస్తే అపుడు భర్త చూసే చూపు తలచుకుంటేనే ఆలోచించడం అనవసరం అనిపిస్తోంది.

ఒక రుద్రం అయేసరికి పన్నెండు దాటింది.

"అమ్మా" బరువుగా నిట్టూరుస్తూ పక్కకు వత్తిగిల్లినట్లుగా కూర్చుంది కృష్ణవేణి.

కృష్ణవేణిని ఎవరూ పట్టించుకోలేదు. అసలా ధ్యానలేనట్లే అభిషేకంలో మునిగిపోయి భక్తి పారవశ్యంలో తేలుతున్నారు.

కాసేపు హాయిగా మంచంమీద వాలి పడుకోవాలనిపిస్తోంది. పళ్లబిగువున అటూఇటూ వత్తిగిల్లుతూ అలాగే కూర్చుంది. విశ్రాంతిగా

కళ్లు మూసుకుని ఒదిగి పడుకోవాలనిపిస్తోంది.

దాదాపు ఒకటిన్నరకి అభిషేకం పూర్త యింది.

దాదాపు నాలుగు గంటలు అలాగే నేలమీద కూర్చుందేమో వెంటనే లేచినిల్చోలేకపో యింది. నడుము విపరీతంగా సలుపుతోంది. దానికి తోడు నీరసం అతి కష్టంమీద గోడ ఆసరాగా లేచి నించుంటుంటే శరీరం ఎంతో బరువుగా అన్పిస్తోంది. ఒళ్లు ఒక్కసారిగా తూ లినట్లయింది. తెలియని మగతలా కమ్మింది. తూలుతూ వంటింట్లోకి నడిచింది. ఉదయం ఎపుడో వండిన అన్నం, చల్లారి బిగుసుకుపో యింది. బలవంతంగా నాలుగు ముద్దలు తిని వెళ్లి గదిలోపడుకునేంత వరకూ శరీరం తూలు తూనే ఉన్నది. కడుపులో వికారం తిప్పుతుంటే మాటిమాటికి నోటిలో నీళ్లు ఊరుతున్నాయి.

సూరమ్మ, దీక్షితులు అయిదింటి వరకూ కార్తీక పురాణం చదువుతూ కాలక్షేపం చేశారు.

అయిదు దాటింది. త్వరగా చీకటి పడసా గింది. సూర్యుడు అపుడే అస్తమించాడు. కార్తీక మాసపు సాయంకాలం! చల్లటిగాలి నది మీ దుగా వస్తూ రివ్వుమంటూ చెవుల్లో కూడా దూసుకువెళుతోంది.

ఊరంతా అపుడే నిశ్శబ్దమయిపోయింది.

అలాంటి సమయంలో గదిలో నీరసంగా పడుకున్న కృష్ణవేణి అలికిడికి కన్ను తెరి చింది.

గది గుమ్మం దగ్గర దడి కట్టినట్లుగా ముగ్గు రూ నించుని ఇటే చూస్తున్నారు. మాధవరావు గద్దించాడు "ఏం? ఇంకా పడుకున్నావేం? లే! చీకటి పడి పోయింది. వంట మొదలెట్టాలి. నీళ్లెవడు తెస్తాడనుకున్నావు? నీ తాత?"

వణికిపోయింది కృష్ణవేణి! నెమ్మదిగా లేచి నిల్చుని అన్నది "ఇప్పుడు ఈ చలిలో నేను తేలేనండి! నడుము నొప్పిగా ఉంది! ఆయా సంగా ఉంది" దీక్షితులు మాధవరావు చేయిప ట్టి లాగి చెవిలో ఏదో ఊదాడు.

మాధవరావు రెచ్చిపోయి అడిగాడు "అంటే భుజాన కావిడి వేసుకుని నేను తేవాలా? అంత ఆయాసాలు రావడానికి నీకే మన్నా తొమ్మిదోనెలా?"

"అదికాదు! నడవలేను, నన్ను అర్థం చేసు కోండి" కళ్ల నీళ్ల పర్యంతం అవుతూ చె ప్పింది! అప్పటికే శరీరంలోనుండి వెచ్చటి ఆవిర్లు చెవులగుండా బయటికి వస్తున్నాయి. ఊపిరి పీలుస్తుంటే ముక్కుపుటాలగుండా వేడి ఆవిరి బయటకు వస్తోంది.

"ఏం అర్థం చేసుకోవాలే? ఉదయం నుండి ఉపవాసాలు ఉండి- నీరసంతో అమ్మ తేవాలా? బయటినుండి వచ్చిన మామయ్య తేవాలా? బాగానే మెక్కావుగా! లే! తీసుకురా! అనవస రంగా విసిగించకు" ఉపవాసం చేశాడేమో! ఆ నీరసంతో మరీ కోపం ఎక్కువయిపోతోంది. అసహనం పురిగొల్పుతోంది. ఛాతీ ఎగిరెగిరి పడసాగింది. ఉక్రోషంతో కళ్లు ఎర్రబడ్డాయి. కృష్ణవేణి మాట్లాడలేనట్లు తలవంచుకుని ఉండిపోయింది.

మాధవరావు భరించలేకపోయాడు. విసు రుగా లోపలికి అంగవేసి భార్య చెయ్యిపట్టు కుని బరబరా లాక్కెళుతూ అన్నాడు "చెబు తూంటే అర్థం కాదూ!" అతనికి ఒకటే బాధ! మామయ్య ముందు భార్య తిరస్కారం అత నిని రెచ్చకొడుతోంది. అతని చేతినుండి విడి పించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తూ ఏడుస్తూ అన్నది కృష్ణవేణి "ఏవండీ! ఈ రోజుకి వదిలి పెట్టండి! ఈ చలి భరించలేకుండా ఉన్నాను. ఒక్క అడుగుకూడా వేయలేను! అత్తయ్యా మీరయినా చెప్పండి!" సూరమ్మ నొసలు చిట్లించి ముఖం పక్కకు తిప్పుకుంది.

అలాగే లాక్కెళ్లి బావిగట్టు మీద నిల్చుని "మామయ్యా!" అంటూ అరిచాడు.

అంతసేపూ వినోదంగా, ఆనందంగా చూస్తు న్న దీక్షితులు "ఆ! ఆ! వస్తున్నా!" అంటూ ఎగురుకుంటూ బావిగట్టు మీదకి వచ్చాడు.

వాళ్లు చేయబోయే పని తల్చుకుని భయంగా అరిచింది కృష్ణవేణి! పెనుగులాడు తూ "వద్దు! వద్దు! ఈ చలి నేను భరించలేను! మీకు దణ్ణం పెడతాను! పోనీ మామూలుగా తీసుకు వస్తాను! తల స్నానం వద్దు! జ్వరం వచ్చేలా ఉంది! నన్ను నమ్మండి. అత్తయ్యా! మీరయినా చెప్పండి!" గిజగిజలాడుతూ అన్నది.

దీక్షితులికి పట్టరాని ఆనందంగా ఉంది.





బొక్కెన తీసుకుని బావిలో వేసాడు. మనసు పట్టరాని ఆనందంతో గంతులేస్తోంది.

గడపదగ్గర చేతిలో బిందెతో నిల్చున్న సూరమ్మ కసిగా చూస్తోంది. ఆ అమ్మాయి ఆక్రందన వాళ్ళ చెవుల్లో దూరడంలేదు. మనసు కరగడంలేదు. సానుభూతి కలగడంలేదు. నిస్సహాయంగా అరిచే అరుపులు అరణ్యరోదనే అయ్యాయి. ఏదో కసి! ఏదో ఆనంతృప్తి. మనుమల సంస్కారాలను నిర్దాక్షిణ్యంగా అణగదొక్కేసింది. రాక్షసప్రవృత్తి రెచ్చగొడుతోంది. దట్టంగా మబ్బు పట్టినట్లుగా ఉన్న నల్లటి చిక్కటి ఆకాశంకింద ఓ మారుమూల పల్లెలో బావి గట్టుమీద భార్య పెనుగులాటను అణచి వేస్తూ పళ్ళు బిగించి, చేతులు బిగించి పట్టుకున్న భర్త ఎదురుగా, కసిగా, తృప్తిగా, హాయిగా చూస్తూ నిల్చున్న దీక్షితులు చేతిలో ఉన్నది కిరోసిన్ డబ్బా కాదు, నరాలు జివ్వుమనిపించే చల్లటి నీళ్ళతో నిండిన బకెట్!

కళ్ళజోడులోనుండి వికృతంగా చూస్తూ నిలుచున్న సూరమ్మ చేతిలోనున్నది అంటించడానికి అగ్గిపెట్టె కాదు, ఎత్తుకోడానికి బిందె! దీక్షితులు చేతిలోని బకెట్ నెమ్మదిగా పైకి లేచింది.

"వద్దు! వద్దు!" పిచ్చిదానిలా అరుస్తున్న కృష్ణవేణి నెత్తిమీద మంచుకొండ పగిలినట్లు ధారలు ధారలుగా చల్లటి నీళ్ళు పడ్డాయి.

ఒక్కసారిగా ఊపిరి ఎగదన్నినట్లయింది. ఆయాసంతో గబగబా ఊపిరి పీల్చుకునేలోగానే మరో బొక్కెన కుండపోతలా వర్షించింది. చల్లటి నీరు ధారలుగా పడుతూ, శరీరాన్ని మనసును ఘనీభవింపచేస్తోంది. చైతన్యం వచ్చినట్లుగా, వెన్ను ఒక్కసారిగా జలదరించింది. గుండె గొంతులోనికి వచ్చినట్లయి ఊపిరాడక ఉక్కిరిబిక్కిరయిపోయింది.

అప్పుడు... అప్పుడు జరిగిందది!

కడుపులో ముడుచుకుని పడుకున్న ప్రాణి ఒక్కసారిగా ఉలిక్కిపడినట్లుగా గడబిడ పడినట్లుగా అటూ ఇటూ పొర్లిన అనుభూతి! ఊపిరి పీల్చుకునే అవకాశం లేకుండా కళ్ళు మూసుకుని కొంకర్లు పోతున్న గుప్పిళ్ళు బిగించి పెదవి బిగబట్టి గడ్డకట్టుకుపోతున్న శరీరంతో మౌనంగా, కట్టెలా నిల్చున్న కృష్ణవేణి చెవులకు దూరంగా శివాలయంలోనుండి ఓంకారం విన్పించసాగింది.

అతి భయంకరమైన నిశ్శబ్దం అయిదు నిముషాలసేపు రాజ్యమేలింది. తడిసిన చీరలో, ఎత్తుగా ఉన్న పొట్ట ఉబ్బినట్లుగా ఉంది. పవిట పక్కకు జారింది. అయినా సర్దుకోవాలనిపించలేదు. కళ్ళు ఎత్తి ఎదుటి మనుమలను చూడాలనిపించలేదు. జారిపోయి, పాయలు పాయలుగా నీళ్ళు కారుతున్న జుట్టును ముడి వేసుకోవాలనిపించలేదు. వంచిన తల ఎత్తకుండా ముందుకి అడుగువేసిన కృష్ణవేణి చేతికి విసురుగా తగిలింది సూరమ్మ చేతిలోని బిందె.

మౌనంగా అందుకుని అడుగు ముందుకేసింది. ఆమె నిష్క్రమణాన్ని వెనకనుండి ముగ్గురూ ఒకవిధమయిన ఆనందంతో తిలకించారు.

రాత్రి ఆరుగంటల సమయం. కార్తీకమాసం అవడంతో అప్పుడే చీకట్లు కమ్ముకున్నాయి. రోడ్లు నిర్మానుష్యంగా అయిపోయాయి. చల్లటి చలిగాలి నరాలు కోస్తూ రివ్వున వీస్తోంది.

రేవువైపు తలవంచుకుని నడుస్తున్న కృష్ణవేణిని చూసి నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా ఉన్న వీధిలో ముడుచుకుని పడుకునివున్న వీధికుక్క భౌభౌమని అంటూ అరిచి మళ్ళీ ముడుచుకునిపోయింది.

ప్రకృతికూడా చీకటికళ్ళతో జాలిగా పరికిస్తోంది.

రేవు అంతా నిర్మానుష్యంగా ఉంది. నిరామయంగా ఉంది. నల్లటి ఆకాశంకింద పరవళ్ళు తొక్కుతున్న నల్లటి కృష్ణవేణి నిండు గర్భిణిలా ఉన్నది. ముందుకి వంగి చేతిలోని బిందె నీళ్ళల్లో ముంచుతుంటే చేతి వేళ్ళకు తగిలిన నీళ్ళు జివ్వుమని నరాలని లాగినట్లయింది. షాక్ కొట్టినట్లుగా చెయ్యి వెనక్కి తీసుకుంటుంటే శరీరం జిల్లుమన్నది. ఆ చల్లదనానికి కృష్ణవేణికి ఎప్పుడూ అలా అన్పించలేదు. చెవుల్లో ఎవరో గుసగుసలాడినట్లు అన్పిస్తోంది. ఏదో హోరులాంటి శబ్దం, అదోవిధమయిన తరంగాలను సృష్టిస్తోంది. గాలి హోరు పకపకలాడుతున్న శబ్దం! 'హిస్‌స్‌స్...మంటూ

వీస్తోంది. బిందె ముంచుతూ తలెత్తి చూసిన కృష్ణవేణి శరీరం ఝల్లుమన్నది. రోజూ చూసే కృష్ణానది! ప్రశాంతంగా, నవ్వుతూ కన్నతల్లిలా పలకరించే కృష్ణమ్మతల్లి, ఇప్పుడలా లేదు. ఘోష పెడుతున్న సముద్రంవలె ఉన్నది. చేతులు సాచి ఆహ్వానిస్తున్నట్లుగా ఉంది. జడలు విప్పుకుని, పాయలు పాయలుగా పరచుకున్న నల్లటి ముఖం పకపకా నవ్వుతున్నట్లనిపిస్తోంది. కళ్ళు మసకలు కమ్ముతుంటే తల విదిలించింది.

హఠాత్తుగా కళ్ళు తిరిగి ఒళ్ళు తూలినట్లయి అప్రయత్నంగా ఒక అడుగు ముందుకుపడింది. నెమ్మదిగా కళ్ళు విప్పిన కృష్ణవేణి నడుములోతు నీళ్ళల్లో ఉన్నది. జుట్టు పాయలు నీళ్ళమీద తేలుతున్నాయి. నోట్లోకి వెళ్ళిన నీళ్ళు కాలకూట విషంలా చేదుగా అన్పించాయి. శరీరం మంచుముక్కలమధ్యన కరిగిపోతున్న అనుభూతి. ఇదేమిటి? ఇలా ఒళ్ళు తూలిందేమిటి అనుకుంటూ వెనక్కి అడుగు వేయబోయింది. ఏదో అదృశ్యహస్తం కాలుపట్టి లాగినట్లుగా కూరుకుపోయినట్లుగా ముందుకే తూలింది. కంగారుగా గబగబా ముందుకు అడుగువేస్తున్నాననే అనుకుంది. కాని నీళ్ళు మెడవరకూ వచ్చాయన్న సంగతి గ్రహించేసరికే కృష్ణవేణి కళ్ళముందు ఆ దృశ్యం రకరకాలుగా కన్పించసాగింది. మసకలు కమ్ముతున్న కళ్ళకి స్వాధీనం తప్పుతున్న శరీరానికి స్మృతి కోల్పోతున్న మెదడుకి చుట్టూ నిండుగా, కన్నతల్లి హస్తాలతో పెనవేసుకున్నట్లుగా ఉన్న నీరు, పరుగులు పెడుతూ, అంతలో ఏటవాలుగా ప్రవహిస్తూ, చూస్తూ వుండగానే ఎత్తుగా జలపాతంలా ఉధృతంగా పరవళ్ళు పెడుతూ, ఆకాశంనుండి ఎత్తిపోతల్లా తనమీదకీ, తలమీదకీ పరవళ్ళు తొక్కుతూ... చిన్ని ప్రాణి గిజగిజా కొట్టుకుంటున్న అనుభూతి! పొట్టలో ఊపిరి ఆడక, ఉక్కిరి బిక్కిరవుతూ, కాళ్ళూ, చేతులూ తపతపా కొట్టుకుంటున్న భావన. నోటిలోకి, ముక్కుల్లోకి నీళ్ళు పోయి, ఊపిరాడక గిజగిజలాడుతూ ఉక్కిరిబిక్కిరి అవుతున్న భావన!

అది నిముషం మాత్రమే!





తర్వాత నిశ్శబ్దంగా అతి నిశ్శబ్దంగా నీరు ముక్కుల్లోకి, చెవుల్లోకి ప్రవహించసాగింది. తన పొట్టలోనుండే ఎవరో ఆక్రందిస్తున్నారు 'అమ్మా! అమ్మా!' అని.

కెవ్వున అరవబోయి నోరు తెరిచింది. దారి దొరికినట్లుగా నీళ్ళు శరవేగంతో నోట్లోకి ప్రవేశించాయి తన ప్రమేయం లేకుండానే. లోపలికి మింగుతున్న నీటివేగం తెలుసుకునే స్థితిలో లేదు కృష్ణవేణి. ఆమె పంచేంద్రియాలు పనిచేయడం మానేసి నిముషంపైనే అయింది.

ఎప్పటినుండో కోరుకుంటున్న విశ్రాంతి మనసు కోరుకుంటున్న నిద్ర అది!!

నీళ్ళపై తేలుతున్న బిందెని కృష్ణవేణి చీర చెంగుని మొదట చూసింది జ్ఞానమ్మ కొడుకు.

★ ★ ★

ఈ వార్త మరో పావుగంటలో గిరికి తెలిసింది. గుండెలు బాదుకుంటూ పరిగెత్తుకొచ్చాడు రంగడు. ఆ సమయానికి గిరి ఇంట్లో కూర్చుని తాపీగా ఆరోజువారి జమాఖర్చులు రాసుకొంటున్నాడు.

"బాబూ! గిరిబాబూ!" వెర్రివాడిలా పరిగెత్తుకొచ్చిన రంగడిని వింతగా చూస్తూ అడిగాడు గిరి "ఏమిట్రా? ఏమయింది?"

"బాబూ!" అంటూ భోరుమంటూ నెమ్మదిగా చెప్పాడా వార్త!

అంతే! గిరి చేతిలోని పుస్తకం పెద్ద శబ్దంచేస్తూ జారిపోయింది. మెదడులో డైనమైట్లు ఒక్కసారిగా బద్దలయ్యాయి. చేతులు వణకసాగాయి. ఆ షాక్‌కి కాసేపటివరకూ నోటమాట రాలేదు. గుండె ఆగిపోయినట్లయింది. కాళ్ళ కింద భూమి కంపిస్తున్నట్లుగా వణికిపోయాడు. నెత్తిమీద పడిన పిడుగు శరీరాన్ని తునాతునకలు చేసినట్లుగా ఫీలయ్యాడు. ఒక్క అడుగు ముందుకు వేయాలంటే శక్తినంతా కూడదీసుకోవాల్సివచ్చింది.

రెండుక్షణాల తర్వాత-

పిచ్చివాడిలా రేవువైపు పరిగెత్తుతున్న గిరిని చూస్తుంటే ఎవరూ నమ్మరు, అతనొక పట్టుదల, గుండెనిబ్బరంగల అసాధారణ వ్యక్తి అని! ఒక్క అంగలో కన్పించిన పడవలో ఎగిరి దూకాడు. మరుక్షణం ముందుకు దూసుకువెళ్ళింది.

ఈ వార్త మరునిముషంలోనే దావానలంలా వ్యాపించింది ఆ ఊరంతా. వింటూనే గుండె పట్టుకుని అలాగే కూర్చుండిపోయారు ఆచార్యులుగారు. ఆండాళమ్మ అయితే అక్కడే కూలబడి ఏడవసాగింది.

తీరుగా, దండ గుచ్చుతున్న వేణు చేతిలోని దండ జారిపోయింది. పూలన్నీ చెల్లాచెదురుగా పడిపోయాయి. మరికాసేపట్లో-

అందరూ హాహాకారాలతో నది దగ్గరికి చేరుకున్నారు. కనిపించిన పడవలో ఎక్కారు. అక్కడ ఉన్న పడవలన్నీ శరవేగంతో ముందుకు దూసుకుపోయాయి.

నది పొలెత్తినట్లుగా పడవలన్నీ ఆ ఊరి వైపు ప్రయాణించసాగాయి. ముందుపడవలో ఉన్న గిరి కళ్ళకు క్రమక్రమంగా మినుకుమినుకుమంటున్న దీపకాంతులు కన్పించసాగాయి. పడవ ఒడ్డుకి చేరువయ్యేకొద్దీ స్పష్టం అవసాగాయి. అవి లాంతర్లు. నది ఒడ్డున గుంపుగూడి వున్న మనుషుల చేతుల్లో లాంతర్లు!

ఒడ్డు కొద్దిదూరంలో ఉండగానే ఒక్కసారిగా ముందుకి దూకాడు గిరి. మోకాటి లోతు నీళ్ళు. నదిలోనుండి నడిచి వస్తుంటే వీరంగం వేస్తున్న వీరభద్రుడిలా ఉన్నాడు. నదీగర్భంలో నుండి వస్తున్న జలరాక్షసుడివలె ఉన్నాడు.

గిరిని చూడగానే గుమిగూడి ఉన్న జనం నెమ్మదిగా పక్కకి తప్పుకుని దారి యిచ్చారు.

హఠాత్తుగా భయంకరమయిన నిశ్శబ్దం. నర్మంటూ కోస్తున్న గాలి, నది హోరు తప్ప చీమ చిటుక్కుమన్నా విన్పించేటంత నిశ్శబ్దం! జనం మధ్యగా ముందుకు అడుగువేసిన గిరి కాళ్ళకి బంధాలు వేసినట్లు, షాక్ కొట్టినట్లు అక్కడే ఆగిపోయాడు.

అక్కడ-

ఇసుకమీద లాంతర్ల క్రీనీడలో వెల్లకిలా, అచేతనంగా, మూసుకున్న కళ్ళతో, చెల్లాచెదురుగా విస్తరించుకున్న జుట్టుతో, వికృతంగా, ఉబ్బి ఎత్తుగా ఉన్న పొట్టతో, తడిసిన తెల్లచీరలో బిగుసుకుపోయిన శరీరంతో పడివుంది...

ఎవరు...? ఎవరు...?

తన ప్రాణం! తన చెల్లెలు... కృష్ణకదూ! నా చిట్టితల్లి కృష్ణవేణి కదూ! అక్కడే మోకాళ్ళ మీద కూలబడిపోయాడు. నెమ్మదిగా కృష్ణవేణి తలను తన ఒళ్ళోకి తీసుకుని ఆప్యాయంగా పిలిచాడు "కృష్ణా! కృష్ణా! నేనురా! నీ గిరిని!"

చుట్టూ ఉన్న జనం జాలిగా చూస్తున్నారు! ఏడుస్తున్నారు!

"కృష్ణా! మాట్లాడు! నేను..." ఒళ్ళో వున్న తలను, ఆమె శరీరాన్ని కుదుపుతూ అన్నాడు!

అచేతనంగా జారిపోతున్న ఆమె శరీరాన్ని మళ్ళీ గట్టిగా గుండెలకు పొదువుకుని అలాగే ఉండిపోయాడు.

ఎక్కడినుండో విన్పిస్తోంది ఆ పిలుపు 'అన్నయ్యా! అన్నయ్యా!' ఏ లోకాలనుండో ప్రతిధ్వనిస్తోంది! ఒళ్ళో పడుకుని ఉన్న కృష్ణవేణి నవ్వుతూ మాట్లాడుతూనే ఉన్నట్లనిపిస్తోంది.

గిరి ఎంత షాక్‌లోకి వెళ్ళిపోయాడంటే ఆమె పొట్టమీద చెయ్యి వేసి నవ్వాడు! గాజులు సవరించాడు. చెక్కిలి నిమిరాడు. నుదురు స్పృశించాడు. ఆగిపోయిన గుండె ఒక్క కన్నీటి బొట్టుని కూడా రాల్చలేదు.

గుండెలకి హత్తుకుని, ఆ ఇసకలో కూరుకుపోయినట్లుగా కూర్చుని గిరి భుజం మీదుగా అప్పుడు పడింది ఒక చెయ్యి.

చివ్వున వెనుదిరిగాడు గిరి!

కృష్ణమాచార్యులుగారు! నోటికి ఉత్తరీయం అడ్డుపెట్టుకుని ఉన్నారు! కళ్ళు ఎర్రగా ఉన్నాయి. గిరి విసురుగా వెనుతిరగడంతో అతని గుండెలకు హత్తుకుని ఉన్న కృష్ణవేణి శరీరం కిందకు జారిపోయింది.

వెర్రివాడిలా మార్చిమార్చి చూసిన గిరి మరుక్షణం ఒక్కసారిగా ఆచార్యులుగారిని "బాబుగారూ!" అంటూ చుట్టేసుకుపోయాడు!

"గిరీ! ఊరుకో!" ఏం మాట్లాడాలో తోచనట్లుగా అతని భుజంమీద తడుతూ ఉండిపోయారు.

బావురుమన్నాడు గిరి "బాబుగారూ! నా చెల్లి, నా ప్రాణం, నా కృష్ణ, అయిపోయింది... వెళ్ళిపోయింది. కాదు... కాదు చంపేశారు. చెప్పండి! సంప్రదాయం అన్నారు! ఆచారం అన్నారు! అవే... అవే నా చెల్లిని బలితీసుకున్నాయి బాబుగారూ! నా కృష్ణని బలితీసుకున్న ఆ ఆచారాల్ని తగలపెట్టండి. నా కృష్ణ నాకు కావాలి బాబుగారూ! అది... అది ఏం పాపం




చేసిందని?" హిస్టీరియా వచ్చినవాడిలా ఆచార్యులుగారి భుజాలు పట్టుకుని ఊపేస్తూ ఆక్రోశిస్తున్న గిరిని ఎలా కంట్రోల్‌చేయాలో ఎవరికీ అర్థంకావడంలేదు. పిచ్చివాడిలా చేతితో నుదురు కొట్టుకుంటున్నాడు.

రంగడు, అలివేలు నిశ్శబ్దంగా రోదిస్తున్నారు.

ఆచార్యులుగారిని విసురుగా వదిలేసి మళ్ళీ శవందగ్గర కూలబడి తలని ఒళ్ళో పెట్టుకుని, "కృష్ణా..." అంటూ కుమిలిపోతున్న గిరి వీపుమీద మృదువైన చెయ్యి స్పృశించింది.

తల తిప్పి చూసిన గిరి చిన్నగా గొణిగాడు "సంధ్యా!"

సంధ్య గిరి భుజంచుట్టూ చేతులవేసి, దగ్గరకు తీసుకుంది. ఆ క్షణంలో గిరి పసిపిల్లాడే అయిపోయాడు. ఆమె భుజంమీద తల ఆనించి ఉండిపోయాడు. అతని వీపు, తల నిమురుతూ ఉండిపోయింది! అతని కన్నీరు ఆమె భుజాన్ని తడుపుతోంది.

అక్కడ ఉన్నవారికి అది అసహజం అన్పించలేదు. పైగా ఊరట కల్గించింది. సంధ్య చేతుల్లో ఏ శక్తి ఉన్నదో తెలీదుకాని పొరలి పొరలి గుండె లోతుల్లోనుండి తన్నుకు వచ్చిన దుఃఖం నెమ్మదిగా కంట్రోల్ కాసాగింది.

అంతసేపూ మనుషుల మధ్యన నిశ్శబ్దంగా నిల్చుని కృష్ణవేణి శవాన్ని కన్నార్పకుండా చూస్తూ ముక్కలయిపోయిన మనసును అతి కష్టంమీద కంట్రోల్ చేసుకుంటూ వెనుతిరిగి... క్రమంగా... చీకట్లో కలిసిపోయాడో వ్యక్తి... అతను వేణు!

కాసేపటికి జనం వల్చబడ్డారు. ఆ మనకబారిన లాంతర్లను ఊపుకుంటూ వెళ్ళిపోయారు. కృష్ణవేణి పాదాలను స్పృశిస్తూ కృష్ణవేణి అమాయకంగా సాగిపోతోంది.

★ ★ ★

ఆ షాక్‌నుండి గిరి చాలారోజులు తేరుకోలేకపోయాడు. మనిషి చిక్కి శల్యమైపోయాడు. భోజనం చేస్తున్నాడో లేదో తెలియదు. కంటి నిండా నిద్రపోతున్నాడో లేదో తెలియదు. ఏ విషయం గురించి పట్టించుకోవడం మానేశాడు. గందరగోళంగా ఉన్న అతని మనసులాగే తోటలో కూడా కలుపుమొక్కలు లేచాయి. ఎక్కువగా ఒంటరిగానే గడపటం అలవాటుచేసుకున్నాడు.

మొదట్లో సూరమ్మ, మాధవరావులమీద కేసుపెట్టి, కోర్టుకీడుస్తానని గొడవచేశాడు. కాని ఆచార్యులుగారు నర్దిచెప్పారు. "ఏమని పెడతావు గిరీ! సాక్ష్యమేమిటి? అది వరకట్నపు చావుకాదు! తాగుబోతు భర్త చేతిలో మరణం కాదు. ఎలా? ఏమని పెడతావు? సంప్రదాయం బలితీసుకున్నదని పెడతావా? సంప్రదాయం అనే చీకటికోణాన్ని కోర్టుకి ఎలా ఈడుస్తావయ్యా? మనది హిందూసమాజం! నిన్నే వేలెత్తి చూపుతారు! దురదృష్టం కొద్దీ ఈ కేసులో సానుభూతి వాళ్ళకే పోతుందికాని మూర్ఖత్వం, మొండితనాలంటే ఎవరూ నమ్మరు. ఇలాంటి వారికి ఆ దేవుడే బుద్ధిచెబుతాడు!"

పిచ్చివాడల్లే నది ఒడ్డున ఒంటరిగా కాలక్షేపం చేస్తున్న గిరిని చూస్తూఉంటే గుండె తరుక్కుపోతోంది ఆచార్యులుగారికి. వేణుగోపాలుడిని వేడుకోవడం మినహా ఏమీ చేయలేకపోయారాయన!

★ ★ ★

రోజులు బరువుగా గడుస్తున్నాయి. నవంబర్ మాసాంతపు రోజులు!!

కోస్తాతీర ప్రజలు పిలవని ఆ అతిథికోసం ఎదురుచూస్తున్నారు. వాళ్ళకి తెలుసు! తరచూ తప్పనిసరిగా పలకరించిపోయే ఆ అతిథి వచ్చేరోజులు దగ్గర పడుతున్నాయని! ఆ అతిథి 'తుఫాన్!'

వాళ్ళ ఊహని నిజంచేస్తూ-

వాతావరణం కొత్త ఊపిరి పోసుకోసాగింది. గాలి శబ్దం మార్చుకుంటోంది. ఆకాశంలో మబ్బులు పరిగెత్తసాగాయి వేగంగా! శరవేగంగా! నల్లటి కరిమబ్బులు గుంపులు గుంపులుగా కదిలిపోతున్నాయి.

గాలిలో కూడా క్రమంగా మార్పు రాసాగింది.

అప్పుడే వచ్చింది ఆ వార్త! అతి సమీపంలోనే ఆగ్నేయదిశలో వాయుగుండం కేంద్రీకృతమయి ఉన్నదని! అది ఆ రాత్రి ఏ సమయంలోనైనా తీరాన్ని దాటవచ్చు.

మామూలుగా వీచే గాలి, ఈదురుగాలిగా మారి పెనుగాలిలా తిరుగుతోంది. ఆకాశంలో చీకట్లు కమ్ముకొస్తున్నాయి. రానున్న ప్రళయాని కి సంకేతంగా పక్షులు కీచుకీచుగా అరుస్తూ గూళ్ళవైపు ఎగురుతున్నాయి. వేణుగోపాలునికి గబగబా నైవేద్యం పెట్టి, గర్భగుడి మూసేయ డానికి ఆయత్తమవుతున్న కృష్ణమాచార్యులు గారు బయట మ్రోగిన జేగంట శబ్దానికి తిరిగి చూశారు.

'సంధ్య...!'

ఆయన ముఖంలో ఒకవిధమయిన కాంతి వచ్చింది. వెంటనే బయటకు వచ్చి పిలిచారు "సంధ్యా!" అంటూ.

"చెప్పండి!" ఆయనవైపు తలెత్తి చూస్తూ అంది.

పిట్టగోడ దగ్గరకు వెళ్ళి "సంధ్యా! ఒక్కసారి అలా చూడు!" అన్నారు.

బయట నది ఒడ్డున ఒంటరిగా, విరాగిలా కూర్చున్న గిరి... గులకరాళ్ళు చేతిలోకి తీసు కుని ఒక్కొక్క రాయి నదిలోకి విసురుతున్నా డు.

సంధ్య దీర్ఘంగా నిట్టూర్చింది.

"తల్లీ! చిన్నదానివయినా ఈ భారం నీమీ దే పెడుతున్నాను. ఎందుకంటే నీవలనే అవు తుంది. నీకొక్కదానికే సాధ్యమవుతుంది. మళ్ళీ మా గిరిని మాకందించు. వాడిని మామూలు మనిషిని చేయి. రోజురోజుకు పిచ్చివాడయిపో తున్నాడు. మా గిరిని మాకు దక్కించు సంధ్యా!" హఠాత్తుగా ఆయన గొంతు గద్గదిక మయింది.

సంధ్య వెంటనే సమాధానం చెప్పలేదు. కళ్ళు మూసుకుని దేవుడిని ప్రార్థిస్తూ నిశ్చ లంగా ఉండిపోయింది. తర్వాత నెమ్మదిగా కదిలి మెట్లు దిగి వెళ్ళి గిరిపక్కనే కూర్చుని అతని భుజంమీద చెయ్యివేసి అన్నది

"గిరీ...!"

ఉలిక్కిపడిన గిరి తల తిప్పి చూసి మళ్లీఏదో ఆలోచనలో పడిపోయినట్లుగా తల వంచుకున్నాడు.

"ఒక్కసారి తలెత్తి చూడు! తుఫాను తరు ముకొస్తోంది. మన కృష్ణాతీర వాసులను ముంచి ఎత్తడానికి పరుగులు పెడుతూ వస్తోంది. నీలాంటి శక్తిమంతుల అవసరం ఇపుడెంతయినా ఉంది. ఊరికే ఆలోచిస్తూ కాలం వృధాచేయకు గిరీ! కాలం ఎంతో విలువ యినది. మన లోతట్టు ప్రాంతవాసులకు సహాయ సహకారాలు అందించవలసిన బాధ్యత ఈ ఊరి యువకుడిగా నీమీద ఉన్నది. ఒక్కసారిగా కళ్ళువిప్పి మహోధృ తంగా పరవళ్ళు తొక్కుతున్న కృష్ణవేణిని చూ డు! నీ కర్తవ్యం గుర్తుతెచ్చుకో"

"సంధ్యా...!"

"అవును! నువ్వు ఆలోచించుకోవలసినది పోయినవాళ్ళ గురించి కాదు. ఉన్నవాళ్ళని బతికించుకోవడం గురించి!"

టప్‌మంటూ చినుకు పడింది. మరుక్షణం వెంటవెంటనే చినుకులు పడి వాన జడివా నగా మారసాగింది.

సంధ్య లేచి నిల్చుని చెయ్యి అందించింది. హిప్నటైజ్ చేయబడినవాడిలా ఆమె చెయ్యి అందుకుని లేచాడు గిరి. అడుగు ముందుకు వేశాడు: గాలి ఉధృతం అధికంకాసాగింది. తీరంవెంబడి ఈదురుగాలులు ప్రచండంగా వీస్తున్నాయి. మనిషిని అమాంతం ఎత్తిపారే సేలా గాలి వీస్తోంది.

వాన కూడా కుండపోతగా కురుస్తోంది. భయంకరమయిన ఉరుములు, మెరుపుల మధ్యన వాతావరణం ప్రళయరూపాన్ని దాలు స్తోంది. చేపలు పట్టడానికి నదిమీదకి వెళ్ళిన వాళ్ళు వెంటనే తిరిగి వచ్చేశారు.

ఇదిలా ఉండగా-

అక్కడ రెండు జిల్లాల కలెక్టర్లు అప్పటిక ప్పుడు అత్యవసర సమావేశం ఏర్పాటుచేశారు. తుఫానుని ఎదుర్కోడానికి ప్రత్యేక సిబ్బందిని సిద్ధంచేశారు. సైన్యాన్ని అప్రమత్తం చేశారు. ప్రత్యేక దళాలు, దివిసీమవైపు బయలుదే రాయి. సహాయ బృందాలు ఎలాంటి పరిస్థితి నయినా ఎదుర్కోడానికి సిద్ధమవసాగాయి. ప్రతి అయిదు నిముషాలకొకసారి తుఫాన్ హె చ్చరికలు రేడియోలో వస్తున్నాయి. నిజాంప ట్నం రేవులో మూడోనెంబరు ప్రమాదసూచిక ను ఎగురవేశారు. హెమ్ రేడియోలు పనిచే





యడం ప్రారంభించాయి. గాలి ఊళపెడుతూ, గర్జిస్తూ, దిశ మారుతోంది. దక్షిణంవైపునుండి తూర్పుకి తిరుగుతోంది. అప్పుడు వాతావరణం మరింత భయంకరంగా మారింది.

గిరి, రంగడు, కన్నయ్య ముసలివాళ్ళని, చిన్నపిల్లలని దగ్గరలోవున్న రాయుడిగారింట్లోకి చేర్చారు. ఈదురుగాలికి నడవలేని వృద్ధులను భుజాలమీద చేతులు వేసి లాక్కువెళ్తున్నారు. పల్లపు వీధుల్లో జనాల్ని ఖాళీ చేయించి వేణుగోపాలస్వామి గుళ్లోకి తీసుకువచ్చారు. అప్పటికి జనం పెద్దగా అరుస్తూ చేతికి అందిన వస్తువులతో బయటకు పరుగులు పెడుతూ వస్తున్నారు.

గిరి ఒకచేత్తో ముసలి ఆవిడని పట్టుకుని భుజంమీద పిల్లాడిని వేసుకుని గుడి ఆవరణలోకి చేర్చాడు. అప్పటికే పూరిళ్లు, పాత పెంకుటిళ్ళు కూలిపోయాయి. చెట్లు ఫెళఫెళమని విరిగి వేళ్ళతోసహా లేచి దారికడ్డంగా పడిపోతున్నాయి. ఇళ్ళ పైకప్పులు గాలిలోకి నలుసుల్లా ఎగిరి పోతున్నాయి. విసిరేసిన గాలిపటాల్లా తాటాకులు ఆకాశంలో గిరికీలు కొడుతున్నాయి. ప్రకృతి ప్రళయగర్జన చేస్తూ విజృంభిస్తుంటే కృష్ణానది పొంగులు వారుతూ పరుగులు తీస్తోంది. చిమ్మచీకటి, గాలివాన మధ్యన నది హోరు భయంకరంగా విన్పిస్తోంది. పోటెత్తిన సముద్రంలా గర్జిస్తోంది. వాయువేగంతో ప్రవహిస్తోంది. గుడిలోకి వస్తున్న మనుమలమధ్యన ఎవరికోసమో వెతుకున్న ఆచార్యులుగారి కనుబొమలు అనుమానంగా ముడుచుకున్నాయి. అయిదు నిముషాలు చూసి ఆయనే బయటకు వచ్చారు. ఒక్కసారిగా గాలి విసురుకి తూలిపడబోయి మళ్ళీ నిలదొక్కుకొని జాగ్రత్తగా ముందుకి నడిచారు. కాళ్ళకి చెట్లు, రాళ్ళు అడ్డంపడుతున్నాయి. పావుగంట తర్వాత ఆ యింటిలోకి చేరుకున్నారు.

ధడధడా, విసురుగా కొట్టుకుంటున్న తలుపులు, జోరుగా కురుస్తున్న వానమధ్యన గోడకానుకుని మోకాళ్ళలో తల దాచుకుని రాయిలా కూర్చున్న అతను తలెత్తాడు.

"వేణూ!"

"బాబాయ్! మీరా!" పిచ్చివాడిలా ఉన్న వేణు తలెత్తాడు. జీవచ్ఛవంలా ఉన్నాడు.

"అవునురా! నీకోసమే వచ్చానురా! ఏంచేస్తున్నావు? ఒంటరిగా ఏం సాధిద్దామని కూర్చున్నావు! వేణూ! రా! నీ సహాయం ఇప్పుడు ఎంతో అవసరం. ఈ ప్రళయం ఊరినే మింగేసేలా ఉంది! లేచిరా!"

గాలిహోరులో ఆయన మాటలు కలగాపులగంగా విన్పించాయి. ఫ్లాష్‌లా మెరిసిన మెరుపు వెలుగులో వేణు కళ్ళు హఠాత్తుగా చిత్రంగా మెరిసాయి.

నిజమే! తన అవసరం ఇప్పుడు ఎంతయినా ఉన్నది. ఆయనతోపాటు గాలివానలోకి అడుగుపెట్టాడు. దాదాపు రెండువందల కిలోమీటర్ల వేగంతో వీస్తున్న గాలి, భగభగా మండుతున్నట్లుగా ఉంది. గేదెలు, దూడలు మోరలెత్తి, గంగ వెర్రులెత్తుతున్నట్లుగా వీధుల్లో పరుగులు పెడుతూ మనుమలకు అడ్డుపడుతున్నాయి.

ఆచార్యులుగారు గుడి మెట్లు ఎక్కి వెళ్ళారు. వేణు వెంటనే పక్కకు తప్పుకుని నది ఒడ్డుకి వెళ్ళి, లంగరువేసిన పడవని విప్పసాగాడు. అతని ధ్యేయం ఒక్కటే! అతని గమ్యం అప్పుడే నిర్దేశించుకున్నాడు.

అదే సమయానికి ఒక ముసలాయనను గుడిలోకి చేరుస్తున్న గిరికి మెరుపులమధ్యన పడవ ఎక్కుతున్న వ్యక్తి ఎవరో, అతని ఉద్దేశ్యం ఏమిటో అర్థంకాలేదు.

వెంటనే పరుగులాంటి నడకతో నది ఒడ్డుకు వచ్చేసరికే పడవ బయలుదేరింది. గిరి ఆలశ్యం చేయలేదు. ఎగిరి నదిలోకి దూకి కొంతదూరం ఈది పడవ అంచు పట్టుకున్నాడు. ఆ విసురుకు వెల్లికిలా నీళ్ళలో పడి, క్షణంలో చేపపిల్లలా, నీళ్ళలోనే గిర్రున తిరిగి పడవ అంచు పట్టుకుని లోపలికి ఎగబాకాడు. మరుక్షణం ఆశ్చర్యపోతూ అరిచాడు - "వేణూ! పిచ్చిపట్టిందా?"

నవ్వాడు వేణు. "ఎందుకూ? ఈ ఊరి సంగతి మీరు చూస్తున్నారుగా! ఆ ఒడ్డున ఇంకా చాలా ఉన్నాయి! అందుకు!"

గిరి వెంటనే పళ్ళబిగువున అరిచాడు "నీకు మతిపోయింది! తిప్పు! వెనక్కి తిప్పు!"

అంటూ బలవంతంగా వేణు చేతిలోని తెడ్డు తీసుకోబోతుంటే ఆ పెనుగులాటలో తెడ్డు జారి పోయి కనురెప్పపాటులో నీళ్ళలో మాయమయి పోయింది. ప్రవాహంలోపడి ఎటు కొట్టుకుపో యిందో తెలియనంత వేగంగా మాయమ యింది.

గిరి స్థాణువయిపోయాడు. వేణు చిన్నగా నవ్వాడు.

వేణు శక్తినంతా కూడగట్టుకుని చేతులతో అటువైపు పడవని తిప్పాడు! ఒడ్డు చేరువవు తుంటే అర్థమయింది గిరికి - అది కృష్ణ అత్తవారి ఊరని! అది నీళ్ళ వేగానికే అటు వెళ్ళిందో, బుద్ధిపూర్వకంగా అటు మళ్ళించబ డిందో ఆలోచించే స్థితిలో లేడు గిరి! ఒడ్డు రాగానే ఇద్దరూ ఎగిరి దూకారు! ఆ ఊరి పరిస్థితి ఇంకా భీభత్సంగా ఉంది.

దక్షిణంవైపు కట్ట తెంచుకున్న కృష్ణ వెల్లువలా ఊళ్ళోకి వచ్చి ముంచెత్తింది! వేణు, గిరి వరుగులాంటి నడకతో ఊళ్ళోకి వెళ్ళారు. కాని అది ఊరులా లేదు. మరో నదీపాయలా ఉన్నది. నడుములోతువరకూ నీళ్ళు వచ్చాయి. నీటిమట్టం అంతకంతకూ పెరుగు తోంది. చిన్నచిన్న ఇళ్ళు అప్పటికే నాని ఎగిరి పడిపోతున్నాయి. గిన్నెలు, చెంబులూ నీటి మీద తేలుతూ వెళుతున్నాయి. ఇళ్ళు క్ర మంగా మునిగిపోతున్నాయి. ఆ చీకట్లో మను ష్యలు పెద్దగా ఏడుస్తూ, అరుస్తూ వెళుతున్నా రు. ఒకరి చెయ్యి మరొకరు పట్టుకుని నీళ్ళల్లో జాగ్రత్తగా ముందుకు తోసుకుంటూ ఎదురుగా కన్పించే ఎత్తు డాబావైపు వెళుతున్నారు. కొంతమంది మధ్యలోనే కాళ్ళకు ఏవో అడ్డంప డి తూలి, అక్కడే కూరుకుపోతున్నారు. పరీ క్షగా కళ్ళు చికిలించుకుంటూ నడుము లోతు వరకూ వచ్చిన నీళ్ళను చేతులతో తోస్తూ ముందుకి వెళుతున్న వేణు కళ్ళు హఠాత్తుగా మెరిశాయి. అతనికి కావాల్సిన వ్యక్తి మెరుపుల మధ్య కన్పించాడు.

వేణుకి నాలుగు అడుగుల ముందర మాధ వరావు, సూరమ్మ చేతులు కలియపట్టుకుని ముందుకు వెళుతున్నారు. వాళ్ళ వెనకే ఉన్నా డు వేణు. నీళ్ళని నెట్టుకుంటూ ఆ చీకటిలో ముందుకు సాగుతున్న మాధవరావు, అతని తల్లికి తెలీదు వేణు రాక.

వేణు అతనికి రెండు అడుగుల దగ్గరిలోకి వచ్చేశాడు. ఒక్క అడుగు - అంతే! క్షణంసేపు ఊపిరి బిగబట్టాడు. గట్టిగా ఊపిరి పీల్చి వదిలిన వేణు కళ్ళముందు క్షణకాలం బుట్టబొ మ్మలా పకపకా నవ్వుతున్న కృష్ణవేణి కన్పించి మాయమయిపోయింది. ఒక్కసారిగా పైకి ఎగిరి పిడుగుపాటులా మాధవరావు రెండు భుజాలమీద చేతులు వేసి, అమాంతం నీళ్ళ లోకి ముంచేశాడు.

మాధవరావుకి ఊపిరి పీల్చుకునే సమయం కూడాలేదు. వేణు బలమైన హస్తాల కింద నీళ్ళల్లో గిజగిజ కొట్టుకున్న మాధవరావు మళ్ళీ పైకి లేవలేదు. నీళ్ళ అడుగునే జలస మాధి అయిపోయాడు.

వేణుకి మరో పది అడుగుల దూరంలో జ్ఞానమ్మను జాగ్రత్తగా నడిపించి తీసుకెళుతు న్న గిరికి ఈ సంగతి తెలియదు అతనికి అతి చేరువలోనే మాధవరావు శరీరం పడి ఉందని, అతని చేతులు తన కాళ్ళకి తగులుతున్నా యని. ఆ చీకటిలో ఎవరు ఏమిటో ఎవరికీ అర్థంకావడంలేదు.

చెయ్యి పట్టుకుని నడిపిస్తున్న మాధవరావు అమాంతం నీళ్ళల్లోకి జారిపోవడంతో సూరమ్మ బెంబేలెత్తిపోయింది. పెద్దగా అరుస్తూ ఏడవ సాగింది. ఎవరూ పట్టించుకోలేదు. ఎవరి టెన్ష న్‌తో వాళ్ళు ఉన్నారు.

మేడమీదకి జ్ఞానమ్మను చేర్చిన గిరికి వేణు మరో వ్యక్తిని పైకి తీసుకువస్తూ కన్పించాడు. మరో పావుగంట తర్వాత వేణు గిరితో "వచ్చిన పని అయిపోయింది. వెళదాం" అన్నాడు.

వేణు ముఖం మామూలుగా ఎలాంటి భావాలు లేకుండా నిర్మలంగా ఉన్నది. గిరి, వేణు చెయ్యి చెయ్యి పట్టుకుని ఒడ్డుకు వచ్చి ఇసుకలో చిక్కుకుపోయిన పడవను బల వంతంగా నదిలోకి తోసి ఎగిరి కూర్చున్నారు.

వాతావరణంలో ఏమాత్రం మార్పు రాలేదు. తుఫాను విజృంభిస్తోంది. పెనుగాలి విసిరి విసిరి కొడుతూ వీస్తోంది. ఒడ్డున ఉన్న కొబ్బరి చెట్లన్నీ విరిగి పడిపోయాయి. గాలివాటుకు కొట్టుకుపోతున్న పడవలో ఉన్న వేణు, గిరి




ఒక్కసారిగా ప్రళయంలా వచ్చిన శబ్దానికి అదిరిపడ్డారు. మరుక్షణం వాళ్ళు ప్రయాణిస్తున్న పడవ హఠాత్తుగా లోపలికి కుంగిపోతున్నట్లుగా, నీటిమట్టం వేగంగా కిందకు తగ్గిపోతున్నట్లుగా అన్పించింది. భూమి లోపలికి కుదించుకుపోతున్నట్లు అన్పించింది. హఠాత్తుగా నీళ్ళమీద పడవ అదుపుతప్పి గిరగిరా తిరిగిపోయింది. అప్పుడర్థమయింది ఉత్తరంవైపు కరకట్ట కూడా తెరచుకున్న నీళ్ళు మహోధృతంగా ఊరిమీద పడ్డాయని. రెండు వైపులనుండి నీళ్ళు ఆ ఊరిని ముంచెత్తుతున్నాయి. మరో అయిదు నిముషాలు అక్కడ ఉంటే ఏమయ్యేదో తలచుకుంటే గుండె ఝల్లుమన్నది వారికి! వేణు నిర్వికారంగా ఉన్నా, గిరి టెన్షన్ ఫీలవుతున్నాడు. ఎక్కడో పిడుగు పడినట్లుంది. ఆ అదురుకి గిరికి గుండె ఆగినట్లయింది. ఇద్దరూ చేతినే తెడ్లగా చేసి విశ్వప్రయత్నంమీద ఒడ్డుకి వచ్చారు. ఊరంతా నిర్మానుష్యంగా ఉంది. ఇద్దరూ గాలికి తూలిపోకుండా చేతులు పట్టుకుని గుడి మెట్లమీదకి వచ్చారు.

గిరి తలెత్తి చూశాడు. ముందరి మండపమంతా మనుమలతో నిండిఉంది. పైకి అడుగువేసిన గిరి నెమ్మదిగా చెయ్యి విడిపించుకున్న వేణుని గమనించలేదు! వెనకే పైకి వస్తున్నాడనుకున్నాడు!

కాని పైకి రాలేదు. చెయ్యి విడిపించుకున్న వేణు వెనుతిరిగి అడుగులు వేస్తూ చీకట్లో కలిసిపోయాడు.

వేణుని ఆ ఊరివారు చూడటం అదే ఆఖరు.

గుడి ముఖమండపంలో ఉన్న పిల్లలు పెద్దగా ఏడుస్తున్నారు. మిగతావారు నిశ్శబ్దంగా తుఫాను సృష్టిస్తున్న ప్రళయాన్ని చూస్తూ ఉండిపోయారు. మృత్యుఘోషలా ఉన్న ఆ శబ్దాలను మౌనంగా వింటూ వుండిపోయారు. ఎగిరిపోయిన ఇళ్ళు, కూలిపోయిన గోడలు, ప్రస్తుతం ఇవేమీ వాళ్ళ కళ్ళముందు కదలాడటంలేదు. ఈ రాత్రి గడిస్తేచాలనుకుంటున్నారు. నాలుగు వైపులనుండి విసిరికొడుతున్న జల్లుతో అందరూ తడిసిపోయారు. టైమ్ ఎంతయిందో తెలియదు. తుఫాను మళ్ళీ దిశ మారుతోంది. గాలి ఈసారి గుడి వెనుక ఉత్తరంవైపు తిరుగుతోంది.

కాళరాత్రిలా ఉన్న ఆ ప్రకృతి భీభత్సాన్ని ప్రత్యక్షంగా చూడలేక కొంతమంది కళ్ళు మూసుకుని రామనామస్మరణ చేస్తున్నారు. తడిసిపోయిన శరీరాలతో గజగజా వణుకుతున్నారు. గుండెలరచేత పట్టుకుని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు. ప్రకృతి విలయతాండవాన్ని ఊపిరి బిగబట్టి పరికించసాగారు.

ఓ అరగంట తర్వాత...

నెమ్మదిగా గాలి ఉధృతం తగ్గసాగింది. వాన కూడా నెమ్మదిగా తగ్గసాగింది. ప్రళయం ముందరి ప్రశాంతతలా ఉన్న ఆ వాతావరణాన్ని ఊపిరి బిగపట్టి పరికిస్తున్న గిరి దూరంగా చూస్తూనే అదిరిపడ్డాడు.

ఆచార్యులుగారు కూడా గమనించారది!

ఆకాశం అంచులో ఎర్రగా గీత గీసినట్లుగా వచ్చిన వెలుగు, క్రమంగా ఆకాశంలోకి పాకుతోంది. క్రమంగా విస్తరిస్తోంది. నాలుకలు జాపుకుంటూ కమ్ముకొస్తోంది.

ఉప్పెన!!!

"భగవంతుడా!" చూడలేనట్లు కళ్ళు మూసుకున్నారు! మరుక్షణం ఒక్కసారిగా వేయి పిడుగులు భూమిని బద్దలు చేసిన శబ్దం విన్పించింది. ఆ శబ్దానికి ధ్వజస్థంభం కదిలిపోయింది. గుళ్ళోని జేగంట అటూ ఇటూ ఊగింది. అక్కడున్నవారికి గుండెలు ఒక్కక్షణం ఆగి మళ్ళీ కొట్టుకోసాగాయి. అందరూ వెర్రిగా హాహాకారాలు చేశారు. పిల్లలయితే పెద్దపెట్టున ఏడ్చారు. నదికి అవతల ఉన్న సముద్రం చుట్టుపక్కల పల్లెలని పొట్టనపెట్టుకుంది.

మళ్ళీ గాలి ఊపందుకుంది. వాన విజృంభించి కురవసాగింది. గిరి, ఆచార్యులుగారు అక్కడే మౌనంగా కూర్చుండిపోయారు. ఆ ప్రళయరాత్రినుండి అతి కష్టంమీద తప్పించుకోగలిగారు భగవత్ నామస్మరణ చేస్తూ ఆ ఊరివారు! తెల్లవార్లు వాన ఎడతెరపి లేకుండా పడుతూనే ఉన్నది. గాలి కూడా విసిరి విసిరి కొడుతూనేవున్నది.

★ ★ ★

ఊళ్లోకి ప్రవేశించిన నీళ్ళు రెండురోజులవరకూ తీయనేలేదు. ఆ రెండురోజులూ జలదిగ్బంధంలోనే ఉండిపోయిందా ఊరు. ఆ ఊరితో మిగతా ప్రపంచానికి సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. అసలా ఊరిలో మనుమలు మిగిలారో లేదో తెలియని పరిస్థితి!

మూడోరోజు-

మేడ అరుగుమీద కూర్చున్న సూరమ్మ భయంకరంగా ఏడుస్తోంది. రెండురోజుల నుండి ఆహారంలేదు, మంచి నీళ్ళు లేవు. ఏడ్చి ఏడ్చి శోష వస్తోంది.

"నా కళ్ళెదుటే చెట్టంత నా కొడుకు పోయాడు. నేనింక ఎవరికోసం బతకాలి? దేవుడా!" పెద్దగా రోదిస్తున్న సూరమ్మని అవధానిగారే ఓదార్చసాగారు.

నీళ్ళు నెమ్మదిగా తీయసాగాయి. అయితే వండుకోడానికిగాని, తినడానికిగాని, ఏమీ మిగలలేదు. అన్నీ కృష్ణలో కలిసిపోయాయి. ఇంకా రెండురోజులు ఇలాగే ఉంటే ఆకలితోనే చచ్చిపోయేలా వున్నారు అక్కడివారు. గుంపులు గుంపులుగా చేరి దిక్కుతోచని పరిస్థితిలో పెదవులు తడిచేసుకుంటూ పైకి చూస్తున్నారు.

ఆకాశంలోకి ఆశగా చూస్తున్న వాళ్ళ కళ్ళు హఠాత్తుగా మెరిశాయి.

దూరంగా చిన్న చుక్కలా ప్రత్యక్షమయి క్రమంగా దగ్గరవుతూ ధడధడ శబ్దం చేస్తూ వస్తున్న హెలికాప్టర్ అందరినీ ఒక్కసారిగా చైతన్యవంతులని చేసింది. అందరూ వెర్రెత్తిన వాళ్ళల్లే వీధులవెంబడి పరుగెత్తసాగారు గుంపులు గుంపులుగా! హెలికాప్టర్‌లోనుండి పెద్ద పెద్ద బాగ్స్‌లో ఆహారం పొట్లాలు కిందపడుతుంటే అందరూ కుమ్ముకుంటూ, తోసుకుంటూ వాటిమీద పడ్డారు. వాళ్ళవైపు నిస్సహాయంగా చూస్తూ అలాగే ఉండిపోయింది సూరమ్మ. తోసుకుని వెళ్ళలేక, అడుగు ముందుకు వేయలేక నీరసంగా కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని కూర్చున్న సూరమ్మ నిస్త్రాణకు తట్టుకోలేక "ఆకలి! ఆకలి!" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. నీరసానికి కాళ్ళు, చేతులు పీక్కుపోతుంటే గుండె దడదడలాడుతోంది.




గుంపులోనుండి మనుష్యులను తోసు కుంటూ వచ్చిన ఆ ముసలావిడ చేతిలో అన్నంపాకెట్ పెట్టుకుని సూరమ్మ దగ్గరికి వచ్చి తీసుకోమన్నట్లుగా చేయి చాపింది.

మగతగా మూసుకుపోతున్న కళ్ళను బల వంతాన తెరిచింది సూరమ్మ! ఆకలితో ఉండ లు చుట్టుకుపోతున్న ప్రేవులు భగభగలాడు తున్నాయి.

అన్నాన్ని చూడగానే ఒక్కసారిగా జిహ్వ అగ్నికీలవలె ఎగిసిపడింది. ప్రాణాలు లేచివ స్తుంటే కంపిస్తున్న చేతులతో చేయి జాచి అన్నంముద్ద తీసుకుంది. అగ్నిహోత్రుల సూ రమ్మ ఆ ముసలమ్మ చేతిలోనుండి, ఆబగా, ఆకలిగా, హడావిడిగా పొట్లాం అందుకుని నోట్లో కుక్కుకుంది.

ఆచారాన్ని ఆకలి జయించింది.

దడదడలాడుతున్న ప్రాణాలని అదిమిపె ట్టి కాసేపు అలాగే కళ్ళుమూసుకుని కూర్చుండి పోయింది సూరమ్మ.

మరికాసేపటికి కళ్ళు తెరిచి, తనకు పొట్లాం అందించిన ముసలమ్మను చూసింది! ఆమె జాలరి జ్ఞానమ్మ.

ఓ పావుగంట తర్వాత ఒక్కసారిగా భళ్ళున వాంతి చేసుకున్నది. తిన్నది మొత్తం బయ టకు వచ్చేసింది. మరో అయిదు నిముషాల లోనే మరో వాంతి అయి విరోచనాలు అయ్యాయి.

ఇదంతా గమనిస్తున్న అవధానిగారు నిస్స హాయంగా చూస్తూ ఉండటం మినహా ఏమీ చేయలేకపోయారు.

ఆయనకి అప్పుడే అర్థమయిపోయింది. కలరా విజృంభించిందని. సూరమ్మ ఒక్కరోజు కంటే బతకదని. కాని ఆయన ఆలోచనని అబద్ధం చేస్తూ ఆ పూటలోనే కన్నుమూసింది అగ్నిహోత్రుల సూరమ్మ! ఏకాకిగా, ఈ లోకంనుండి నిష్క్రమించింది. ఆ యింటి చరిత్రకు మడీ, ఆచారాలకు, సంస్కృతీ సాంప్రదాయాలకు ప్రత్యక్ష సాక్షిగా నిలిచిన ఉయ్యాలబల్ల ఇసుకమేటలో కూరుకుపో యింది.



మోకాటి లోతువరకూ ఉన్న నీళ్ళు! వాటి మీద తేలుతూ వెళ్ళిపోతున్న పిందెలూ, పూత, కాయలూ!

మహా సామ్రాజ్యం కోల్పోయిన చక్రవర్తిలా దిగులుగా నిల్చుని, తుఫాను భీభత్సానికి చెల్లా చెదరయిపోయిన తన తోటని చూస్తున్నాడు గిరి.

ఎన్నేళ్ళ కష్టం అది. ఒక్క రాత్రిలో తుడుచు కుపోయింది. చెట్లు విరిగిపడిపోయాయి. మొ క్కలు పూర్తిగా పక్కకి ఒరిగిపోయాయి. కొన్ని నీళ్ళల్లో నాని నాని కుళ్ళేదశలో ఉన్నాయి. కొన్ని చెట్లయితే నల్లగా మాడిపోయాయి. ఆకులన్నీ రాలి, మోళ్ళయిపోయాయి.

ఆ దృశ్యాన్ని చూస్తూవుంటే గుండె పిండిన ట్లయింది. పిచ్చివాడిలా అటే చూస్తున్న గిరి "గిరీ!" అన్న పిలుపుకి తుళ్ళిపడి వెనుతిరిగి చూశాడు.

సంధ్య...! నవ్వింది!

అదే ఆమె ప్రత్యేకత. ఎలాంటి పరిస్థితిలో నూ నిండుగా నవ్వడం! సంధ్య గిరి భు జంమీద చెయ్యి వేసి అన్నది "ఈ నష్టం నీ ఒక్కడిదే కాదుగా! ఎందుకంత దిగులు?"

"కానీ సంధ్యా! మళ్ళీ ఎన్నేళ్ళు కష్టప డితే..."

నవ్వింది! మనస్ఫూర్తిగా నవ్వింది! "వద్దు! ఏదీ కష్టం అనుకోవద్దు గిరీ! నువ్వు మళ్ళీ సాధించగలవు! ఎందుకంటే నీ వెనక నేను వున్నాను"

గిరి నమ్మలేనట్లు చూశాడు. "సంధ్యా! ను వ్వు... నువ్వు చెప్పేది నిజమా! ఎప్పుడూ... జీవితాంతమూ నా తోడుగా ఉంటావా?"

"అక్షరాలా!" ఆ నాలుగు అక్షరాలే అతని లోని వ్యధని, దిగులుని తుడిచేశాయి. సంధ్య గిరి చేతిని తన చేతిలోకి తీసుకుని వెనుతిరి గింది. ఇవతలకు వచ్చిన ఇద్దరికీ దూరంగా వేణుగోపాలస్వామి ఆలయశిఖరం మెరుస్తూ కన్పించింది కొత్త జీవితాలకు నాందీ ప్రస్తావన పలుకుతూ!!



# రచయితలకు మనవి





★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టలోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# అమృతహస్తంపై సమీక్షలు

డిసెంబర్ చతురలో ప్రచురితమైన పి.వి. శేషారత్నం నవల 'అమృతహస్తం'పై పాఠకులనుండి మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## ఇదొక మార్గం

*(ప్రథమ బహుమతి రు: 100-/ పొందిన సమీక్ష)*

ప్రతి చిన్న విషయానికి ఆందోళన చెందడం, తాను ఏ రంగంలోనైనా ఓడిపోతే ఇక తన బ్రతుకు నిరర్థకమని భావించి ఆత్మహత్యకు పాల్పడడం నేడు సమాజంలో ముఖ్యంగా యువతలో తలెత్తుతున్న ఓ మానసిక జాడ్యం. ఈ సమస్యకి పరిష్కారంగా ఆత్మహత్యకి పాల్పడే వ్యక్తి ఏ విషయంలో తననుతాను కించపరుచుకుంటున్నాడో గమనించి, ఆ విషయంలో వారికి పూర్తి మనోధైర్యం కల్గించి జీవితంపై నమ్మకం కలిగేట్టు చేయడమే నిజమైన మార్గం. అలాంటి మానసిక స్వస్థతని కలుగజేయాలంటే చాలా కష్టతరమైనపని. సహనంతో సమయాన్ని వెచ్చించి సహకారం అందించే మనిషి ముఖ్యంగా కావాలి. మరి అలాంటి వ్యక్తులు నిస్వార్థ హృదయంతో ముందుకు వచ్చేవారు ఈ సమాజంలో ఉన్నారా అనేదే ప్రశ్న! ఒకవేళ ఉంటే వారు ఈ వ్యవస్థకే పునాది రాళ్లవుతారు. ఇదే విషయాన్ని సమగ్రంగా విశ్లేషించి మనుమల్లో మార్పు రావాలనే ఉద్దేశంతో అందించిన చతుర నవలే 'అమృత హస్తం'

ఇందులోని ప్రతిపాత్ర ఓ తపస్సంపన్నమైనదనడంలో సందేహంలేదు. 'మనసున మనసై బ్రతుకున బ్రతుకై తోడొకరుండిన అదే భాగ్యము' అనే ఓ సినీకవిగారి వాక్యంలోని భావం ఈ నవలలో చోటుచేసుకుంది. తన జీవితం అనతికాలంలో అంతమౌతుందని తెలిసీ బ్రతికున్న ఆ కొద్దిరోజులు నిస్వార్థ హృదయంతో తోటివారికి సహాయపడదామనే సత్సంకల్పంతో ఆశ్రమాన్ని స్థాపించి ఏ సమస్యకు గురై ఆశ్రమంలో చేరారో ఆ సమస్యగల వ్యక్తులకే డాక్టర్లుగా పనిచేసి ఆపదనుండి ఆదుకునేలా సభ్యుల్ని నియమించే ఈ ప్రక్రియను ప్రవేశపెట్టిన మృత్యుంజయ నిజంగా మృత్యుంజయుడే. వయస్సువేడిలో అమృత రచనలు చదివి వక్రమార్గంలో పయనించిన ప్రీతి చివరికి హృదయవిదారకంగా మరణించడం మనసును కలచివేసింది. తన వేలితో తన కన్నే పొడుచుకున్నట్టుగా జీవితంలో మోసపోయిన అమృత అడుగడుగున మృత్యుంజయని అపార్థం చేసుకొని చివరికి తన రచనలవల్లే ఓ వర్గం యువత తప్పుదారి పట్టి సర్వనాశనం అవుతున్నారని తెలుసుకొని తిరిగి తన 'అమృతహస్తం' అనే రచనతో పరిష్కారం సూచించడం నవలకే హైలైటు. ఒక్కో పాత్రకి ఒక్కోకథ. ఆశ్రమంలో అందరూ ఒక గూటిపక్షులమనే భావంతో ఒకర్నొకరు అర్థం చేసుకొని సమాజంలోని తనలాంటి వ్యక్తులకే తన జీవితం అంకితం చేయడం, కథ, కథనం, ముఖ్యంగా శైలి చాలా బావుంది. ఇలాంటి ఆశ్రమాలు, మృత్యుంజయలాంటి మహోన్నత వ్యక్తులు స్థాపించి నడిపిస్తే ఇక ఈ సంఘంలో ఆత్మహత్యలనే మాట తలెత్తదనే చెప్పాలి.

– అవుసలి ఆంజనేయులు
మూసాపేట

## అక్షరమథనం

*(ద్వితీయ బహుమతి రు: 75-/ పొందిన సమీక్ష)*

జీవితంలో ఓడిపోయి నైరాశ్యంతోను, అవమా

నంతోను డిప్రెషన్‌కి లోనై జీవితాన్ని అర్ధాంతరంగా ముగించుకోవాలనుకొనే వారికి కనువిప్పు కలిగించి, వారికి జీవిత మాధుర్యపు రుచిని తెలియజేయడానికి రచయిత చేసిన 'అక్షరమథనం' నుండి బయల్పడిందీ 'అమృతహస్తం'. ప్రస్తుత సమాజంలో ఎదురవుతున్న సమస్యలలో యువత 'మనోదౌర్బల్యం' ముఖ్యమైనది. దాని ఫలితంగా జీవితం అంతం చేసుకోవడం ఎంత తొందరపాటు చర్యో తెలుపుతూనే, కర్తవ్యాన్ని చక్కగా చూపించారు రచయిత్రి. అయితే యువతీయువకుల మనోదౌర్బల్యానికి ముఖ్యకారణం కథలు, సీరియల్ నవలలేననే అభిప్రాయాన్నే మొత్తంగా చూపించారు. నిజానికి నేడు సీరియల్ కథల కంటే ఎన్నో రెట్లు దుష్ప్రభావం చూపుతున్నవి సినిమాలు. రెండేళ్ల బాలుడినుండి తొంభయ్యేళ్ల వృద్ధుడివరకూ అందరినీ ఆకర్షించే రంగులతెర యువతీయువకులను కలల ప్రపంచంలోనికి తీసుకొనిపోతుందనడంలో అతిశయోక్తిలేదు. అలాంటిది కేవలం కథలవల్లనే ఆత్మహత్యలకు దారితీసేంతటి 'ప్రేరణ' కలుగుతుందనేది అతిశయోక్తి కాకపోయినా పూర్తి వాస్తవం కాదు. అట్లే ఒక రచయిత్రి ఒకేఒక నవలతో సమాజంలోని అన్నివర్గాలవారి మనోదౌర్బల్యాన్ని దూరం చేయడం కూడా సత్యదూరమే. ఆయుష్షును కొనడం- పల్లెటూరిలో అతి చిన్న వ్యవసాయదారుడి కుటుంబంలో పుట్టి కార్లలో తిరగడమెలా సాధ్యమో తెలియదు కాని మొత్తంపైన ప్రతిమనిషి జీవితంలో ఎప్పుడో ఒక్కసారి తప్పకుండా ఎదుర్కొనే 'బలహీన క్షణం' గురించి చక్కని ఊహతో వెరైటీ నవలగా 'అమృతహస్తం' బాగుంది. రచయితకు అభినందనలు.

-ఎస్. రామేశ్వరప్రసాద్
మెదక్

## యువతకు ఇదో సందేశం

*(మూడవ బహుమతి రు: 50-/ పొందిన సమీక్ష)*

'అమృతం హస్తం' నవలని రచయిత్రి చక్కని ఉద్దేశం పెట్టుకుని రచించారు. ఈనాటి మన సమాజానికి కావలసిన అన్ని విషయాలను ఈ చిన్న నవలలో రచయిత్రి పొందుపరచారు. ముఖ్యంగా ఒక లక్ష్యమంటూ లేక గాలి ఎటువీస్తే, అటే కొట్టుకుపోయే ఈనాటి యువతకిలాంటి మంచి రచనలే కావాలి. ఉద్యోగంలేదని, పరీక్షల్లో మంచి మార్కులు రాలేదని, వరసగా ఆడపిల్లలే పుడుతున్నారని, ప్రేమ విఫలమైందని ఇట్లా రకరకాల సమస్యలు చుట్టుముట్టగా ధైర్యంగా వాటిని ఎదుర్కోలేని పిరికితనంవల్ల చాలా మంది ఆ సమస్యలన్నింటికి ఆత్మహత్యే పరిష్కారం అన్న దురభిప్రాయంతో దానికి పాల్పడుతున్నారు. మృత్యుంజయ మాటల్లో- 'ఆత్మహత్య చేసుకునేవాళ్లు అనామకులు, విద్యాగంధం లేనివాళ్లు కారు. వాళ్లకి జీవితంపట్ల సరైన అవగాహన లేకపోవడమే కారణం. 'జీవితం అంటే ఆటవస్తువుకాదు, జీవితం విలువ అమూల్యం' అనుకుని 'ఒకవేళ తమకక్కరలేదు ఆ జీవితం అనుకుంటే ఆ మిగిలిన జీవితాన్ని నిస్వార్థంతో ప్రజాసంక్షేమం కోసం ధారపొయ్యండి' అన్న మాటలు అక్షరసత్యాలు. తను ఎప్పుడు పోతాడో తెలియకపోయినా పోయేవాళ్లని ఆపి, వాళ్లకో వ్యాపకం కల్పిస్తున్న మృత్యుంజయవంటి వాళ్లు ఇప్పటి మన సమాజానికెంతో అవసరం. చివరలో మృత్యుంజయ, అమృత విడిపోయే సన్నివేశం పొడుగు పొడుగు డైలాగులతోకాక చిన్న మాటలతో ముగించటంవల్ల నవలకి మరింత రాణింపు వచ్చింది.

-ఎమ్. అఖిలాశ్రీదేవి
మద్రాస్

## ఆవేదనాభరితం

*(నాలుగవ బహుమతి రు: 50-/ పొందిన సమీక్ష)*

నాగరికత పెరుగుతున్నకొద్దీ, మానవునిలో సున్నితత్వం ఎక్కువై ప్రతి చిన్న విషయానికి అతలాకుతలమైపోతున్నాడు. తన ముందున్న చిన్న సమస్యలనైనా భూతద్దంలోంచి చూస్తూ పెనుభూతంలా ఊహించుకొని భయాందోళనలతో ఆత్మహత్యకు సైతం పాల్పడుతున్నాడు. ఆలోచన వచ్చినప్పుడే ఆత్మహత్యకు సిద్ధపడతారు అంటారు మానసిక శాస్త్రవేత్తలు.




నిజమే! ఆ క్షణంలో సరిగా ఆలోచించగలిగినా, ఆలోచింపజేసేవారు, ఓదార్చేవారు దగ్గరున్నా వారిని మృత్యుముఖంనుండి బయటకు లాగుటకు అమృతహస్తం అందించినవారే అవుతారు.

ఈ అంశాన్నే ఇతివృత్తంగా తీసుకొని నవలగా మలచుటకు శేషారత్నంగారు గొప్ప సాహసమే చేశారని చెప్పవచ్చు. నేడు సమాజంలో అంటువ్యాధిలా వ్యాపిస్తున్న ఒక సమస్యను ఎంచుకొని వ్రాయడం వెనుక రచయిత్రి ఆవేదన కనిపిస్తుంది.

అయితే కథలో వైవిధ్యమున్నా కథ నడిపించినతీరు, పాత్రలు సన్నివేశాల చిత్రీకరణ బాగోలేదు. ఆత్మహత్యలకు దారితీసే ఆర్థిక, సాంఘిక, మానసిక సమస్యలను సూత్రప్రాయంగా చెప్పి వదిలివేస్తే బాగుండేది. అలా కాకుండా ప్రతి ఆత్మహత్యా బాధితుని యొక్క 'ఫ్లాష్‌బాక్'ను చూపించడంవల్ల అనేక పాత్రలు రంగప్రవేశంచేసి నవల సాంతం గజిబిజిగా తయారైంది. దీనివల్ల మెయిన్ క్యారెక్టర్స్ పాఠకులపై చెరగని ముద్రవేసేవిగా రూపొందలేకపోయాయి.

ఇంటిదొంగని ఈశ్వరుడైనా పట్టలేడన్నట్లు, ఆత్మహత్యకు పూనుకొనువారిని కుటుంబసభ్యులు కూడా ముందుగా పసికట్టలేరు. అటువంటి దుస్సాధ్యమైన విషయాన్ని సులభసాధ్యం చేసి చూపించారు రచయిత్రి. 'ఆయుష్షును కొనడం', 'నా వయస్సు వెయ్యినూట ఇరవైమూడు'లాంటి మాటలు పాఠకులను కొంత కలవరపరుస్తాయి. వేరొకరికి ప్రేమించి, దగావడిన అమృత, మృత్యుంజయపట్ల అంత తొందరగా ప్రేమను పెంచుకోవడం, ఆమెను రక్షించిన మరునాడే అతడు ఈమెను ప్రేమిస్తున్నట్లు డైరీలో వ్రాసుకోవడం, ప్రేమపట్ల వారి చౌకబారుతనాన్ని వెల్లడిచేశాయి. పోనీ వాళ్లు పెళ్లి చేసుకున్నా కథ సుఖాంతంగా వుండేది. చివరిలో మృత్యుంజయ అదృశ్యమైపోవడం, తన స్వగ్రామంలో వ్యవసాయంచేస్తూ పూచికపుల్లలా తయారవడం డాక్టరైవుండి తనకు కనీవినీ ఎరుగని జబ్బు వున్నట్లు చెప్పడం సహజంగా లేదు.

-సారెడ్డిప్రతాపరెడ్డి
హుజూర్‌నగర్

## అద్భుతానుభూతి

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

డిసెంబరు చతుర నవల 'అమృతహస్తం' చదువుతున్నంతసేపు ఏదో తెలీని సంచలనం- మనసుని మైమరపించే సంభ్రమం- ఏవో తెలియని ఊహాలోకాల్లో విహరింపచేసే అద్భుతానుభూతి.

ఆపదలలో ఇరుక్కుని అలమటించే అభాగ్యులను, అర్థం పర్థంలేని అసంపూర్ణ రచనల ప్రభావంతో వక్రమార్గంలో నడిచే అబలలను, ఎందరి జీవితాల్నో పరోక్షంగా పర్యవేక్షిస్తూ వారు ఆపదల పాలవబోతున్న తరుణంలో వారినాదుకుంటూ మృత్యుంజయపేరిట, భగవంతుని ప్రతిరూపంగా తోచే ఒక మహోన్నత వ్యక్తి ఆపద్బాంధవుడు నిజంగా ఒక్కడైనా నేటి సమాజంలో వుంటే ఎంతో బావుంటుంది కదా!

ఎక్కడ ఆత్మహత్య జరగబోతున్నా అక్కడ అతని మనుమలు ప్రత్యక్షమవడం సదరు వ్యక్తిని రక్షించి ఆ వ్యక్తి మిగిలిన ఆయుష్షుని కొనేసి అతన్ని తమ అధీనంలో వుంచుకోవడం, జీవితంపట్ల వారికి సరిఅయిన ఆసక్తిని అవగాహనని కలిగించి, వారిలోని గూఢమైన శక్తిని ప్రతిభని వెలికితీసి ఉపయోగించుకోవడం, అదో వింతవ్యాపారం. జీవితంపట్ల ఆసక్తి కోల్పోయినవారి ఆయుష్షు కొనేసి పోషించే వారి కేంద్రం ఎవరికీ అర్థంకాని ఓ అద్భుత ప్రపంచం. ఎందరు అభాగ్యులకో కంటికి కనిపించని ఆయుష్షు విలువని తెలియచెప్పిన మృత్యుంజయకి ఆ విధాత ఇచ్చిన ఆయుష్షు కేవలం ముప్పది సంవత్సరాలు మాత్రమే అని తెలిసినప్పుడు మనసులో తెలియని సంచలనం కలుగకమానదు.

అచ్చులో పేరుపడితే చాలనుకుని రచనలు చేసే రచయితలకు కనువిప్పు కలిగిస్తూ మానవజీవితంలోని సున్నిత కోణాలని స్పృశించిన నవల 'అమృతహస్తం'.

-కె. రాధికానిరంజన్
రాయపూర్

# చతుర కథలు

## కొత్త లిస్టు

'డైటింగ్ ప్రహసనంతో నేను పడుతున్న పాట్లు ఇన్నీఅన్నీకావు, అయినా ఈ దిక్కుమాలిన శరీరం చెప్పినమాట వినట్లేదు, అనుకుంటూ వుంటుంది కామేశ్వరి. చూసీ చూడనట్టు వారానికి 3, 4 సార్లయినా బంగాళదుంప వంటకాలు తినందే ఉండలేకపోవడమనేదే తన ఒళ్లు తగ్గకపోవడానికి ముఖ్యకారణమని ఎవరన్నా చెపితేమాత్రం ఒప్పుకోదు ఆవిడ.

వెయిట్ తగ్గడంకోసం జిమ్‌లో, స్విమ్మింగ్ సెంటర్లో కూడా జాయినయింది కామేశ్వరి. ఇదికాక ఇంటిపక్కనే వున్న తెలిసున్న డాక్టరు వద్దకు కూడా వెళ్ళి డైటింగ్ పద్ధతులను గురించి కన్సల్ట్ చేస్తోంది. ఎప్పటికప్పుడు ఆవిడ ఆహారం, వ్యాయామం గురించి ఎన్ని మార్పులు రాసిచ్చినా ఎక్కడా ఫలితం కనిపించక ఆశ్చర్యపోతున్నాడు డాక్టరు.

డాక్టర్‌గారి కూతురు రాణి, కామేశ్వరి కూతురు హరిణి మంచి ఫ్రెండ్స్ కావడంతో డాక్టరుకో మంచి ఐడియా వచ్చింది. తనిచ్చిన డైటింగ్ ఛార్ట్ ప్రకారం ఆవిడ ఆహారనియమాలు ఖచ్చితంగా పాటిస్తున్నదీ లేనిదీ రహస్యంగా తెలుసుకోమని కూతురుకి చెప్పాడు.



ఇద్దరూ ప్రాణస్నేహితులు కాబట్టి కామేశ్వరి తిండి వివరాలు బాగానే రాబట్టగలిగింది రాణి.

''అన్ని పద్ధతులూ పట్టుదలగానే పాటించినా ఆంటీ బంగాళదుంపలు మాత్రం మానటంలేదు డాడీ!'' అని అసలు విషయాన్ని చల్లగా చెప్పింది రాణి, వారం తిరిగేలోగా.

''అదన్నమాట సంగతి. మరేదైనా కారణముందేమోనని ఖరీదైన టెస్టులు చేయిద్దామనుకున్నాను సుమీ'' అన్నాడు డాక్టరు.

''ఎవరెంత చెప్పినా ఆంటీ వినదుట డాడీ,

హరిణి కూడా చాలాసార్లు చెప్పి చూసిందట'' అంది రాణి.

మర్నాడు మామూలుగా వచ్చిన కామేశ్వరికి డైటింగ్ ఛార్ట్ పూర్తిగా మార్చేసి కొత్త లిస్టు రాసిచ్చాడు డాక్టరు.

అందులో... ఉదయమే బంగాళదుంప బజ్జీ, మధ్యాహ్నం బంగాళదుంపలవేపుడు, రాత్రి పూరీ-బంగాళదుంపకూర, సాయంత్రం ఒకవేళ ఆకలేస్తే బంగాళదుంప చిప్స్. ఇలా వారంరోజులకు ఛార్టిచ్చాడు డాక్టరు.

తెల్లబోయింది కామేశ్వరి.

''ఇదేమిటండీ బంగాళదుంపల్లో మరింతగా ఒళ్ళు పెంచే గుణముందన్న విషయం చిన్న పిల్లలకు కూడా తెలుసు గదా?'' అంది కోపంగా.

''అవునమ్మా! నాకూ తెలుసు. ఇలా రోజూ కొన్నాళ్లపాటు ఎడా పెడా బంగాళదుంపలు తిన్నారంటే, దానిమీద విరక్తి పుట్టి జీవితంలో మళ్ళీ ఆ దుంపల జోలికిపోరని నా ఆశ'' అన్నాడు డాక్టరు.

-రాధాశివమోహన్

---

## బ్రోకర్

ఫైళ్లు చూస్తున్నానన్న మాటేగానీ యాంత్రికంగానే తప్ప, మనసుపెట్టి ఏ పనీ చేయలేకపోతున్నాను. కొన్ని రోజులుగా ఆఫీసులో వున్నా ఇంట్లోవున్నా ఏ పని చేస్తున్నా నిరంతరం అద్దె ఇంటి సమస్య ప్రశ్నార్థకంలా ఎదురుగా నిల్చి భూతంలా భయపెడ్తోంది. పెళ్లికి ముందు బ్రహ్మచారిగా దిగిన కొంప అది. పెళ్లయ్యాక ఇద్దరు పిల్లలు పుట్టి, పెరిగి స్కూళ్లకెళ్తున్నా అదే ఇంట్లో ఉండిపోయాం. ఆర్నెల్లుగా ఇంటాయన చెవినిల్లు కట్టుకుని మరీ పోరుతున్నాడు ఇల్లు ఖాళీ చేయమని. పడగొట్టి పిల్లర్సు వేయాల్సుందనీ, కొడుక్కి ట్రాన్స్ఫరయి ఫామిలీతో వచ్చేస్తున్నాడనీ ఒకటే గొడవ... నిజానికి అవేమీ అసలు కారణాలు కావనీ, పదిహేనేళ్ల బట్టీ వుంటున్నాం గనుక ఎక్కడ స్వాధీనం చేసుకుంటామో అనే భయంతోనూ, అద్దె పెంచి మరొకరికి ఇవ్వచ్చనే ఆలోచనతోనే ఖాళీ చేయమంటున్నారని మా ఆవిడ గొణుగుతోంది.

కారణం ఏదైతేనేం అద్దె ఇల్లు ఖాళీ చేయక తప్పదు.

ఈ హైద్రాబాదులో ఇల్లు దొరకదని కాదు గానీ ఇప్పుడున్న చోటు పిల్లలకి స్కూలుకి బాగా దగ్గర. నడిచి వెళ్లిపోవచ్చు. ఆఫీసుకు నాకు దగ్గర్లోనే బస్టాపుంది. వేరే చోట అయితే నామటుకు ఎలాగో తంటాలు పడగల్ను. కానీ పిల్లలకి కష్టం. చాలా చిన్నవాళ్లు బస్సుల్లో రాలేరు. రిక్షాలకీ ఆటోలకీ డబ్బుపోసే స్తోమత లేదు. పోనీ వేరే స్కూల్లో వేయాలన్నా మళ్లీ రికమెండేషన్లూ డొనేషన్లూ.. నావల్లకాదు. అందుకే నేనుంటున్న కాలనీలోనే చూస్తున్నాను. ఈ ఆర్నెల్లుగా ఎక్కిదిగని గడపలేదు. ఎక్కడకెళ్లినా అడిగి లేదన్పించుకోడమే జరుగుతోంది.

ఆలోచన్లతో తల పగిలి పోతోంది. టీ అయినా తాగుదాం అనుకుంటూ ప్యూన్ని కేకేశాను.

''ఏంది సారూ నెత్తిగానీ నొస్తుందా ఏంటీ?'' అనడిగాడు వెంకటప్పయ్య.

అద్దె ఇంటికోసం నేను పడ్తున్న పరేషానీ గురించి చెప్పాను.

అంతా విని అద్దెకు, కొనుగోలుకూ ఇళ్లు చూచిపెట్టే బ్రోకరు ఒకతను తనకు తెల్సనీ, రేపతన్ని పిల్చుకొస్తాననీ, అతనికి కొంత కమీషను ఇవ్వాల్సుంటుందనీ దిలాసా ఇచ్చాడతను.

మర్నాడాఫీసులో అడుగు పెట్టగానే బ్రోకర్ని పరిచయం చేశాడతను.

ఎనిమిది వందల అద్దెలో రెండు గదుల ఇల్లు మేముంటున్న కాలనీలోనే కావాలనీ, కమీషన్ ఇచ్చుకుంటాననీ చెప్పాను. సాయంకాలం వచ్చి చెప్తానంటూ వెళ్లాడతను.

చూచి పెట్టినప్పటి సంగతిగదా అనుకుని బలవంతంగా ఆలోచన్లు కట్టిపెట్టి పనిలో మునిగిపోయాను.

సాయంకాలం ఐదింటికి ఫైళ్లు కట్టేయబోతూంటే ఎదురుగా బ్రోకర్నిచూచి ఆశ్చర్యపో

యాను... ఇంత క్విక్ సర్వీసా అనుకుంటూ

అతను చెప్పిన ప్రకారం బయల్దేరి కాస్సేపటికి కాలనీలో బస్సు దిగాం. ముందు అతను, వెనక దర్జాగా నడుస్తూ నేను,

ఐదారు నిమిషాలకి ఓ సందు మలుపు తిరిగాడతను. నాలో నిలువునా ఆశ్చర్యం... ఏమిటీ ఏకంగా మా సందులోనేనా? నాకు తెలీని ఇల్లేముందబ్బా... ఈ సందులో... అనుకుని ఆశ్చర్యాన్నణచుకుంటూ మౌనంగా అనుసరించాను.

అతను ఆ ఇంటి ముందాగి ఎవర్నో పిలుస్తున్నాడు.

నేనా ఇంటి ముందుకి రావడం ఆ ఇంటాయన అదే సమయంలో బయటికి రావడం నన్ను చూస్తూనే నిలువుగుడ్లేసి గుటకలు మింగడం... ఇంకేం చెప్పను? ఆయన మా ఓనరే! అది మేం ఉంటున్న ఇల్లే! అదీ మా పోర్షనే!

-నియాజ్ అలి

---

# పాషాణాలు

ఈ.ఓ గోవిందరావుగారు యు.పి.స్కూల్లో వార్షిక తనిఖీ చేస్తున్నారు. తెలుగు క్లాసుకు వెళ్లారు. శాస్త్రిగారు గోవ్యాఘ్రసంవాదంలో పద్యాలు రాగయుక్తంగా చదివి పిల్లల చేత చదివించారు.

పాఠం ముగించి ప్రశ్నలు వేశారు. వాళ్లూ జవాబులు చెప్పారు. వెనకటి పాఠాల్లో ప్రశ్నలు వేశారు. పిల్లలందరూ కరెక్టుగా సమాధానాలిచ్చారు. ఈ.ఓ గోవిందరావుకిదేం నచ్చలేదు. ఎలాగైనా టీచర్ని చీవాట్లు పెడితేగానీ తన గొప్ప తెలవదనుకున్నాడు.

ఆ పాఠంలో ఓ చోట పాషాణం అన్న పదం వచ్చింది. ఓ కుర్రాణ్ణి లేపి "అబ్బాయ్! పాషాణం అనే పదం ఉపయోగించి





స్వంతంగా ఓ వాక్యం చెప్పు'' అన్నాడు.

తెలివైన కుర్రాణ్ణే గోవిందరావుగారు అడిగినా వాడు జవాబు చెప్పలేదు. దాంతో క్లాసులో ఎవరూ చెప్పలేదు. శాస్త్రిగారు కల్పించుకొని 'చూడండి అబ్బాయిలూ పాషాణం అంటే' అని బోర్డుమీద రాయబోతూండగా ''నో దటీజ్ నాట్ ది కరెక్టు ప్రాసీజరు. వాళ్ల చేతనే చెప్పించాలి. నే చెప్పిస్తా మీరుండండి'' అన్నారు.

''చూడండబ్బాయిలూ! మనం అన్నం తింటాంకదా! అన్నం ఎలా అవుతుందీ?'' అన్నారు నవ్వుతూ.

అన్నం తింటున్నప్పుడు వంటి క్రింద పడుతుంటాయి. పటుక్కుమంటాయి. ఏంటవి?''

''రాళ్లు''

''గుడ్'' ఎంతో గర్వంతో శాస్త్రివేపు చూసి అలా రాబట్టాలి పిల్లలనుండి. అంతేకానీ మనమే చెప్పేయకూడదు'' అని కోపంగా చూసి ''అబ్బాయ్... అన్నంలో ఉన్నవాటిని రాళ్లు అంటామే అవి చిన్నవి. అవే బాగా పెద్దవయితే పాషాణం అంటాం. అర్థం అయిందా?'' అన్నారు.

అర్థమయిందని కోరస్‌గా అరిచారు పిల్లలు.



''బియ్యం ఎసర్లో పోస్తే'' ఓ కుర్రాడు చెప్పాడు.

''గుడ్''

''బియ్యాన్ని చేటలో పోసి చెరుగుతారు ఎందుకని?''

''అందులో బెడ్డలుంటాయి'' ఓ కుర్రాడు.

''ఇంకా ఏముంటాయి?''

''ధాన్యం'' ఇంకో కుర్రాడు చెప్పాడు.

అసహనంగా కదిలారు గోవిందరావుగారు. అయినా తమాయించుకొని అప్పుడప్పుడు

ఈ ఓ గోవిందరావుగారు ఎవరెస్ట్ ఎక్కినంత సంబరపడిపోయి ముందు వరసలో ఓ కుర్రాణ్ణి లేపి ''ఇప్పుడు చెప్పరా అబ్బాయ్. పాషాణం అనే పదం ఉపయోగించి ఓ వాక్యం చెప్పు'' అన్నారు.

'అన్నంలో చిన్నప్పటి పాషాణాలుండును' తపీమని చెప్పాడా కుర్రాడు.

-లావాస్ఫూర్తి

# చతుర-ప్రపంచం

## రస్నాబేబీ

'ఐలవ్‌యూ రస్నా!' అంటూ ముద్దుముద్దు మాటలతో మనకు బుల్లితెరపై కనిపించే ఆ చిన్నారి పేరు అంగిత. కానీ ఆ పాపని అంద రూ 'రస్నాగర్ల్' అనే పిలుస్తారు. ఆరు సంవత్స కూడా అంగిత సిద్ధహస్తురాలే. ఆ అమ్మాయి అయిదవ పుట్టినరోజు నాడు తండ్రి బర్త్‌డే గిఫ్ట్‌గా ఇచ్చిన పియానో పై ఆ వయసునుంచే ఆ అమ్మాయి అద్భుత రాగాలు వాయించడం ప్రారంభించింది.




రాల వయసులోనే అంగిత 40 ఎడ్వర్టయిజ్ మెంట్ ఫిల్మ్‌లలో నటించింది. మొట్టమొదటి సారి 'నేపీస్' ప్రకటనలో కనిపించిన అంగిత మిగిలిన కంపెనీదారులను అమితంగా ఆక ట్టుకుంది. ఈ పాప నటించిన వాటిలో 'ర స్నా'నుమించిన ప్రకటనలేదని అన్నారు ఆనాటి టి.వి. ప్రేక్షకులు. ప్రస్తుతం పదకొండే ళ్ల అంగిత ఆరో క్లాసు చదువుతోంది.

నటనలోనేకాక పియానో వాయించడంలో

ఒకే ఒక్క హిందీ సినిమాలో నటించిన అంగితకి హీరోయిన్ రేఖ అంటే ఇష్టం. ఆ సినిమాలో కిందపడిపోయిన అంగితను రేఖ అతిసున్నితంగా పైకి తీసి ఆప్యాయతతో అక్కున చేర్చుకుంటుంది. 'అందుకే నాకు రేఖంటే చాలా ఇష్టం' అంటుంది అంగిత.

"ఇంతకీ ఈ నటనా స్వేచ్ఛ అంగితకి 10 సంవత్సరాల వయసువచ్చే వరకే! ఆ పైన ఆమెను నటనలో ప్రోత్సహించడం మాకి ష్టంలే"దన్నారు ఆమె తల్లితండ్రులు. మరిప్పు డు పదకొండో ఏట కాలుపెట్టింది అంగిత! చూద్దాం!

# భయంకర ప్రేమ

ప్రేమల్లో చాలా రకాలుంటాయి. కొందరి ప్రేమలు కేవలం ఆకర్షణతో అంతమయితే, మరి కొన్ని అనవసర కక్షలతోటి, పగసాధింపులతోటి అంతమవుతాయి. ప్రేమ పెళ్లికి దారితీసి, షష్టిపూర్తి వరకూ సుఖంగాసాగే జీవితాలున్నా చాలా తక్కువని చెప్పచ్చు. ఖగాయముచి అనే పెళ్లాడేసింది. అంతేకాదు ఖగా తిరిగివస్తే తన ఎడ్రస్ తెలియకుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంది. విషయం విన్న ఖగా కోపోద్రిక్తుడై పోయాడు. నెల్లాళ్లు నిద్రాహారాలు మాని గాలించి, గాలించి ఎట్టకేలకు ఒరీనా చిరునామా తెలుసుకున్నాడు. వేషం మార్చి ఫ్రిజ్ మెకానిక్‌నని చెప్పి ఇంట్లోకి ప్రవేశించి ఆమెని క్రూరంగా రేప్ చేసి, అటుపైన కత్తితోపొడిచి జాగ్రత్తగా ఆమె హృదయాన్ని కోసుకు తినడం ప్రారంభించాడు. అంతలో ఇంటికొచ్చిన ఒరీనా




31 సంవత్సరాల యువకుడు పారిస్ యూనివర్సిటీలో ఎడ్వాన్స్‌డ్ ఫ్రెంచ్ కోర్స్‌లో చేరాడు. అనుకోకుండా ఆ యూనివర్సిటీ లైబ్రేరియన్ 21 ఏళ్ల ఒరీనా ప్రేమలో పడ్డాడు. ఇద్దరూ 5 సంవత్సరాలపాటు ప్రేమ షికార్లు, డ్యూయెట్లు, లేఖలు, ఫోనులు వగైరాలు యధేచ్ఛగా కొనసాగించారు. అలా ప్రేమలో ఎంత పురోగమించినా ఖగా కొంచెం తల్లితండ్రుల చాటు పిల్లవాడు కావడంతో, వివాహానికి అమ్మా, నాన్న ఆమోదం పొందివస్తానని స్వదేశమైన టోక్యోకి వచ్చాడు. అతి కష్టంమీద తల్లితండ్రులను ఒప్పించి, ఆ శుభవార్త మోసుకుంటూ వాయువేగ మనోవేగాలతో పారిస్ చేరుకున్నాడు. తీరా అతను పారిస్ చేరుకునేసరికి ఒరీనా ఓ పెద్ద పారిశ్రామికవేత్తని గుట్టు చప్పుడు కాకుండా భర్త ఆ ఘాతుకాన్ని చూసి షాక్ తిన్నాడు. ఆనక పోలీసులకోసం పరిగెడితే పూర్తిగా మతి భ్రమించిన స్థితిలో వున్న ఖగాని అరెస్ట్ చేసి తీసుకెళ్లారు. అలా ముగిసిందా ప్రేమకథ.

# సతీ సహగమనం

రాజస్థాన్ సతీసహగమనాలకి ప్రాముఖ్యత పొందిన ప్రాంతమని అందరికీ తెలిసిందే. మొన్నమొన్నటిదాకా కూడా అక్కడ సతులు జరుగుతూనే వున్నాయి. ఒక్క సతులే కాకుండా ఒకప్పుడు అక్కడ 'సతా'లు కూడా

జరిగేవని చరిత్ర చెపుతోందంటున్నారు సామాజిక శాస్త్రవేత్తలు. పురుషులు కూడా కొందరు తమ భార్యల చితుల పై పడి అగ్నికి ఆహుతి అయ్యేవారనీ, వారిని 'సతా'లని పిలుస్తారనీ అంటున్నారు. వారి పేరుమీదుగా వెలసిన దేవాలయాలు ఇప్పటికీ అక్కడ కొన్ని ప్రాంతాల్లో దర్శనమిస్తున్నాయట. పురుషులు కేవలం తమ భార్యల కోసమేకాక గురువులు, లేదా సన్నిహిత బంధువులు పోతే కూడా వారిని విడిచి వుండలేక వారితోపాటు మరణించేవారట!

శిఖావతికి 3 కిలో మీటర్ల దూరంలో వున్న ఓట్జూ గ్రామంలోనే 12 సతాదేవాలయాలున్నాయి. ఈ దేవాలయాల్లో విగ్రహాలేమీ వుండవు. ప్రజలు బయట వరండాలోనే నిలబడి సతాలకి ప్రార్థనా కార్యక్రమాలు నిర్వహిస్తారు. అక్కడి దేవాలయాల్లో సతాదాదా దేవాలయం అత్యంత ప్రాముఖ్యమైందిగా భావిస్తారు. కృష్ణపక్ష దశమినాడు వేలాది ప్రజలు వివిధ ప్రాంతాలనుంచి ఓట్జూ గ్రామానికి వస్తారు. ఎక్కువమంది భక్తులు స్త్రీలే. ప్రతిస్త్రీ వచ్చేటప్పుడు తమతో కూడా ఓ చీపురు తెస్తుంది. దేవాలయాన్ని ఆ చీపురుతో ఓసారి ఊడ్చి దాన్ని గుడి బయటపెట్టి ప్రార్థనాదికాలు ప్రారంభిస్తారు. దశమి తరవాత రోజున చూస్తే ఆ దేవాలయాలవద్ద చీపుళ్లు గుట్టలు గుట్టలుగా కనిపిస్తాయి.




గోధుమ పిండి, బెల్లం కలిపి చేసిన తీపిపదార్థాలను 'సతా'లకు నివేదన చేస్తారు. ముఖ్యంగా సతాదాదా దర్శనం వల్ల చర్మవ్యాధులు నశిస్తాయని ప్రజల నమ్మకం. సతాదాదా గురించి అక్కడ చాలా కథలు ప్రచారంలో వున్నాయి. అతడు జాట్ వంశానికి చెందినవాడు. అతడికి ఇద్దరు తమ్ముళ్లు. ఓసారి చిన్న తమ్ముడు హఠాత్తుగా మరణించడంతో ఆ దుఃఖాన్ని తట్టుకోలేక అతడు కూడా తమ్ముడితోపాటు ఆత్మత్యాగం చేసి 'సతా' అయ్యాడు. స్త్రీలు సతాదాదా దేవాలయాన్ని దర్శించినపుడు ముఖానికి ముసుగువేసుకుంటారు. కారణమేమంటే సతాదాదాని తమ భర్తకి పెద్దన్నగారిగా భావించి గౌరవ సూచకంగా అలా చేస్తారు.

కొత్తగా ఇల్లుకట్టుకునేవారు పునాదులు తీసేముందు ఓ ఇటుకను సతాదాదా దేవాలయం వద్దవుంచి ఆపైన పని ప్రారంభిస్తారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.



ఫోటో: ఎస్.జి. శేషగిరి

